achieved carefully after watching, and cautiously it should be done.

Then the most important subject that has to be carefully handled is the Services The adjustment of the Services is really a big problem when these two parts become one big State The prosperity of the people much depends on good administration and the administrative set-up For that, the Services should be manned by persons of ability, hard work and character The adjustment of the Services must be done very impartially, the ultimate aim being efficiency of the Services. That alone will solve the several problems of the people. After integration the rules of Services should be common and no one should be given any priority by choice or partiality The Services must be contented and they must feel that there is impartial treatment in the entire State and that efficiency alone coupled with character are the guiding factors with the Government.

Sir, I went through Clause 108 of the Bill (at page 61 of the Bill). It gave me a doubt whether it would be interpreted by courts or persons to suit the occasion My own feeling is that before integration the headships of the departments of the two States must be quite settled. Actually there should not be parallel lines of heads of offices running. To give a concrete example, there should not be two Directors of Public Instruction, there should not be two Inspector-Generals of Registration and there should not be two Inspector-Generals of Local Administration of the same cadre I take these three examples for the reason that they are not All-India Services to-day, and probably State Services here. This clause will certainly give an impression which may give rise to difficulties later on. So I suggest that a sub-clause (3) be added to clause 108 giving a clarification to this point. Before integration things should be settled. There should not be two parallel appointments of the same cadre, at least for the headships concerned.

We have faith in our leaders and let them deal with this problem—or for the matter of that, any other problem—in

the new State in a statesmanlike manner, rise above pettiness and achieve stability and prosperity and win the gratitude of all Andhras.

Mr Speaker, Sir, I may add here that this is the first time in history that the Andhras—Andhras in the sense, Andhras of this particular or present Andhra State—have kept themselves quiet, calm and cool. They were not perturbed, they were not disturbed and they had not given room for any sort of violent agitation. They left it wholly for the Telangana brethren who have very kindly and rightly come to the right conclusion. Very shortly we are all going to live together as brethren in one house under one roof. I hope the same attitude of trust in mutuality will bring in happiness and prosperity to the new State ; and I hope they will in a spirit of calm atmosphere steer us through to come to the new State, where all Telugu speaking people may live in peace, happiness and prosperity. Thank you, Sir.

SRI K. SUBBA RAO :—అధ్యక్షా, భారతదేశ చరిత్రలో ఒక అపూర్వమైన ఘట్టంలో మనం ఉన్నాము. ముఖ్యంగా విచ్ఛిన్నమైపోయి విడివిడిగా అనేక ప్రాంతాలలో ఉన్నటువంటి ఆంధ్ర జాతి మరొకసారి కలుసుకొని ఏక రాష్ట్రంగా ఏర్పడబోతున్నది. ఇటువంటి శుభ సమయంలో మనం శాసనసభ్యులుగా ఉండి ఆంధ్ర జాతి అభ్యుదయానికి తగిన సలహాలు, సూచనలు చేసేటటువంటి అవకాశం కలగడమనేది మరింత సంతోషదాయకమైన విషయం. ఆంధ్రదేశం చాల ప్రసిద్ధి చెందిన దేశం. ముఖ్యంగా మార్కోపోలో అనే విదేశీయుడు మన దేశానికి వచ్చినప్పుడు మొట్టమొదటగా ఆంధ్ర రాజ్ఞి రుద్రమదేవి రాజ్యం చేస్తున్నది. అతడు దానిని చూచి ఆంధ్ర దేశంయొక్క కీర్తి ప్రతిష్ఠలను ప్రపంచములో చాటినాడు. ఆంధ్ర దేశంలో జరిగినటువంటి వ్యవహారాలు ఒక్కొకటి జాగ్రత్తగా పరిశీలించితే రాజ్యాలకొరకు ఏవరెవరు ఎన్నివిధాల తమ ప్రాణాలను సమర్పించినారో తెలుస్తుంది. అదృష్టవశాత్తు మహాత్మాగాంధిగారి యుగధర్మము ననుసరించి అహింసా పద్ధతిలో ఎవరెవరి రాజ్యాలు వారు ఆక్రమణ చేసుకొనే శుభసమయం సంభవించింది. భారతంలో చూచినట్లయితే అంగ, వంగ, కళింగ, కాశ్మీర మొదలైన రాజ్యాలుఉన్నాయి. ఈ నాడు భారతదేశం 15 రాజ్యాలుగా ఏర్పడడమేగాక రాజ్యాన్ని సంపాదించే విధానంలోకూడా నూతన పద్ధతులను మనం అనుసరిస్తున్నాము. ఈ నాడు మహాత్మ గాంధియొక్క తత్వపరిణామమునకు పునాదిగా ఉన్నటువంటిధర్మరాజా "5 ఊళ్లు

Sri K. Subba Rao] [3rd April 1956

ఇస్తేచాలు. రాజ్యం అక్కరలేదని" చెప్పి పంపించినపుడు ఇవ్వడానికి ఒప్పుకోకుండా ఉండేసమయంలో చాల పరితాపం చెందుతూ ఈ విధంగా చెప్పిఉన్నాడు.

"క్షత్రధర్మమింత కష్టమగునే, పె
ర ధర్మ మాచరింప దగ దటండ్రు అయిన
శస్త్ర జీవికేదగియు
న్నది వంశనాశనా భి మతము.

ఆనాడు "5 ఊళ్లు ఇస్తే సంతోషపడుతాను. రాజ్యాల విషయంలో తగాదాలు లేకుండా పరిష్కారం చేసుకోవలసిన అవసరం ఉన్నదని" చెప్పి ఉన్నాడు మహాత్మగాంధిగారు మన దేశంలో నాటిపోయినటువంటి శాంతి ధర్మమునకు పునాది ధర్మరాజు. తరువాత బుద్ధుడు, తరువాత మహాత్ముడు, ఈ ముగ్గురు ఈ దేశంలో జన్మించి అనేక పరిణామాలను తీసుకుని వచ్చి, అనేక పద్ధతులను అనుసరించి విడిపోయిన ఆంధ్రజాతిఅంతా ఏకపరిపాలన క్రిందకు చేరేటటువంటి శుభసమయంలో మనమందరం ఉన్నాము. పేరునుగురించి తగాదా పెట్టుకోవలసిన పనిలేదు. ఆంధ్రప్రదేశ్ అనేపేరు పెట్టాలనే ప్రయత్నం చారిత్రకంగా అనేక యుగాల నుంచి వస్తున్నది. ఐత్రేయ బ్రాహ్మణంలో వేదకాలంనుంచికూడా ఆంధ్రశబ్ద ప్రయోగం ఉన్నది. అలాగే పురాణాలలోకూడా ఆంధ్ర ప్రదేశ్ యొక్క పేరు ఉన్నది. ఈనాడుకూడా "ఆంధ్రప్రదేశ్" అనేపేరు పెట్టుకోవలసిందని నేను తెలంగాణా ప్రజలను ప్రార్థిస్తున్నాను. ఆంధ్ర తెలంగాణా శబ్దముకూడా అనాది నుంచి మన ఆంధ్రజాతికి అనుస్యూతంగా వచ్చినదే. అనేక రకాలుగా మనం చూస్తూ ఉంటాము. ట్రంకుపెట్టె, కిరసనాయిలు మొదలైన విధంగా ఒక్కొక్క మాటకు రెండేసి పదాలు వాడడం ఆంధ్రజాతికి అలవాటయిపోయింది. ఆంధ్ర, తెలంగాణాశబ్దము ఉన్నప్పటికి తెలంగాణాఅనే పదం దానంతటదే జారి పోతుంది. ఆంధ్రప్రదేశ్అన్నా, తెలుగు ప్రాంతమన్నా ఒక్కటేగనుక ఒకే పేరుతో వ్యవహరించడానికి తెలంగాణావారు ఒప్పుకోవలసిందని, ఆంధ్రప్రదేశ్ యొక్క కీర్తి ప్రతిష్ఠలు జగద్విదితం కావడానికి తగినటువంటి అవకాశాలు కల్పించ వలెనని మన అందరి తరఫున ప్రార్థిస్తున్నాము.

ఇక High Court విషయంచూచి నట్లయితే, High Court తప్పకుండా Hyderabad లోనే ఉండవలసిన అవసరంఉన్నది. Urdu లో వ్రాయగలిగి నటువంటి వారికి Urdu Bench ఒకటిపెట్టి న్యాయపరిశీలనకు తగిననటువంటి ఏర్పాటు చేయవచ్చు. "సమానవియ్యము, సమానకయ్యము, సమానవైయ్యము" అనే సామెతప్రకారం నడుచుకోవాలని అంటున్నారు. ప్రతిభావంతుడైన

వకీళ్లంతా ఒకచోట చేరినట్లయితే చిన్నవాళ్లను "పెద్దచేపలు చిన్నచేపలను మ్రింగుతవనే" విధంగా ఒకవిధమైనటువంటి భయం ఉన్నట్లు వినబడుతోంది. కాని జాతియొక్క కీర్తిప్రతిష్ఠలు సంస్కృతిపైన ఆధారపడి ఉంటుందిగాని వారుచేసే త్యాగాలమీద యుద్ధాలమీద గాదు. వారి సంస్కృతినిబట్టి వారిచరిత్ర అత్యద్భుతంగా ఉంటుంది. ఆంధ్రులు ప్రపంచచరిత్రలో అద్వితీయమైన స్థానం ఆక్రమించవలెనంటే అన్నిహంగులతో అన్నివిధములైన సౌకర్యములతో రాజధాని నగరాన్ని ఏర్పాటు చేసుకోవలసిన అవసరం ఉన్నది. కనుక High Court మొదలైన ప్రధానకార్యాలయాలన్నీ రాజధాని నగరమైన Hyderabad లోనే పెట్టుకొని చక్కగా పరిపాలన చేయుటకుగాను కావలసినటువంటి సౌకర్యములను ఈ బాధ్యులైనటువంటి తెలంగాణా పెద్దలు, ఆంధ్ర పెద్దలు ఏకమై తీర్చిదిద్ది చక్కచేయవలసిందని ప్రార్థిస్తున్నాను.

ఇంకొక ముఖ్యవిషయం ఉన్నది. Councils అవసరమా, లేదా అనే విషయం గురించి, మాట్లాడుతూ, అవి అవసరంలేవని సుందరయ్యగారు చెప్పారు. అనుభవం లేనటువంటివారు ప్రజాస్వామ్యం అనే పేరుతో ఉద్వేగము ఉద్రేకముతో కూడిన ఉత్సాహపూరితమైన భావాలతో Assembly లో ఉండేటప్పుడు వీళ్లకై వీళ్లు సరైనపద్ధతిలో చేస్తున్నారో లేదో పరిశీలించివారిని అదుపులో పెట్టడానికిగాను ఈ Council ఉండడం అవసరం. మనదేశంలో తెలివితేటలలో పేరెన్నికగన్న పెద్దలనేకమంది ఉన్నారు. వీరందరు సాధారణ ప్రజల ఎన్నికలలో నిలబడలేరు. వారికి విజ్ఞానశక్తి ఉండినప్పటికినీ, ఇది ప్రజాస్వామ్యం గనుక నేను గెలుస్తాను అనేటటువంటి ధీమాతో శాసనసభకు వచ్చేటటువంటి శక్తిలేదు. ఇప్పుడు ప్రజలతో పోరాడేటటువంటి వ్యవహారంవారికిలేదు కాబట్టి అటువంటివాళ్లకు స్థానం ఇవ్వడం చాల అవసరం గనుక అటువంటి Council నొక దానిని యావదాంధ్ర భూభాగానికి ఏర్పాటు చేయవలసిందని ప్రార్థిస్తున్నాను. 1936-37 వ సంవత్సరములో మేము మద్రాసు అసంబ్లీలో శాసనసభ్యులుగా ఉండినపుడు అక్కడ Council లో అనేకమంది పెద్దలు, ప్రతిభావంతులు, మద్రాసు రాష్ట్రంలో ఆరితేరి అన్నిటిలోకూడా పేరుపొందినటువంటి పెద్దలు ఉండినారు. Assembly కార్యక్రమాలలో మేమెంతో ఉత్సాహంగా ఉపన్యాసాలుచేసి తీర్మానాలను గెలిపించుకుంటూ పోయినప్పటికీ, అందులోని స్వారస్యాన్ని, రహస్యాన్ని, సర్వజనులకు తెలిసేటట్లు చెప్పగలిగినటువంటి శ్రీనివాసశాస్త్రిగారు, C. R. Reddy garu, K.V. Reddy Naidu garu, మొదలైన అనుభవజ్ఞులు అక్కడ ఉండి మేము మాట్లాడినటువంటి విషయాన్నే వారెంతో ప్రతిభావంతంగా అత్యద్భు

తంగా మాట్లాడుతూ ఉండడం మేము చూచినాము. భారతదేశంలో మూడవ స్థానాన్ని ఆక్రమించినటువంటి ఆంధ్రజాతికి ఏదైనా ఒక Council ఉండడం అవసరం ఆంధ్రజాతిఅంతా ఏకమై అటువంటి Council నొకదానిని పెట్టుకోనేందుకు ప్రయత్నించవలసిందని కోరుతున్నాను.

ఇక నాల్గవది ప్రాంతీయమండలాలు. ఇవి చాల అవసరం. సరిహద్దు ప్రాంతాలలో ఉండేటటువంటి ప్రజలకష్టాలు మధ్యాంధ్రదేశంలో ఉండేవాళ్లకు తెలియవు. మేము Mysore ప్రాంతంలో ఒకభాగంలో ఉన్నాము. వారు అక్కడినుంచివచ్చే ప్రతిఒకచుక్క నీటికిగూడ అడ్డకట్టవేసి ఈదేశంలో ఉండేటటువంటి ప్రజలకు అనేకవిధములైనటువంటి బాధలను కలుగచేసే ప్రయత్నాలు జరుపుతున్నారు. ఇందుకు పరిష్కారమార్గంగా ఢిల్లిలోఉండే ప్రభుత్వానికి కాగితాలు పంపించి వాళ్లంతా దీనినిగురించి ఆలోచనచేస్తారా అనేటట్లు కాకుండా ఎప్పటికప్పుడు ఏప్రాంతానికాప్రాంతంవారు సౌహార్ద్రముతో, సౌజన్యంతో ఒకచోటచేరి కష్టనిష్ఠూరాలను చెప్పుకోవడానికిగాను ప్రత్యేక మండలాలు చాలా అవసరం. ప్రజలయొక్క భావిభాగ్యోదయానికిగాను మన పెద్దలందరు ఆలోచనచేసి భారతదేశాన్ని 5 మండలాలుగా ఏర్పాటుచేసుకొనేటటువంటి ప్రయత్నంచేసినారు. ప్రత్యేక సమితుల ఏర్పాటుకు అందరు ఏకగ్రీవంగా ఒప్పుకోవలసిందని ప్రార్థిస్తున్నాను.

ఇంతకంటె ఎక్కువగా ఇప్పుడు తెలంగాణా ప్రాంత అభ్యుదయానికి ఒక ప్రత్యేక అభ్యుదయమండలి కావాలని అంటున్నారు. ఈ సందర్భంలో ఒక విషయము చెప్పదలచుకొన్నాను. నేను రాయలసీమ ప్రాంతమునుంచి వచ్చినటువంటి వాడిని. ఎంతో ఆందోళనచేసి ఈ రాయలసీమ అభ్యుదయానికి ఒక అభ్యుదయమండలి కోరడం మనకు అప్పుడు ఏవిధంగా ధర్మంగా తోచెనో, అదేవిధంగా ఇప్పుడు తెలంగాణా ప్రాంతంలో ఉండేటటువంటివారుకూడ వారి అభ్యుదయానికి ఒక అభ్యుదయ మండలినికోరడం భావ్యమే. దానిని అనుసరించి ఆ ప్రాంతానికి తగినటువంటి ఒక స్తోమతకల్పించేటటువంటి బాధ్యత మనపై ఉన్నది ఆ యేర్పాటుకూడ కొన్నాళ్లకు క్రమంగా పోతుంది. ఈ దినము రాయలసీమలో ఉన్నటువంటివారు ఆంధ్ర ప్రాంతములో ఉండేవారు మాకంటె ప్రతిభావంతులనిగాని, భాగ్యవంతులనిగాని అనుకొనేటటువంటి స్థితిలోలేరు. మనస్సు ఏకమైనప్పుడు మహేశ్వరునికూడ కొట్టియ్యవచ్చునట. కనుక మన మనస్సు ఒకటిగా చేసుకొనేదానికి అవసరంగానే మన పెద్దలు అక్కడ అభ్యుదయ మండలి, development board, అనేటటువంటి దాన్ని పెట్టినారు. ఇది చాలా అవసరముకూడా. వెనుకబడినటువంటివారు, విద్యలోగాని, వినయంలో గాని, విజ్ఞానంలోగాని, వికాసంలోగాని, లేక ఆర్థికంగా గాని,

Sri K. Subba Rao] [3rd April 1956

సాహిత్యంగా గాని, ఇంకా అన్ని విధాల బాగుపడేటటువంటి ప్రయత్నాలు చేసుకొనే దానికి అక్కడ (తెలంగాణాకు) ఒక council అవసరమే. కాని ఈ ప్రాంతానికి అటువంటిది అవసరమా లేదా అంటే నా మట్టుకు నాకు అది ఈ ప్రాంతానికి అవసరంలేదు అని మాత్రము చెప్పుతున్నాను. అది ఇక్కడ ఏమాత్రము అవసరంలేదు. తెలంగాణా ప్రజలకు అభ్యుదయకరమైన కార్యక్రమాలు ఏమేమి కావాలో అవన్నీ చేసుకోవచ్చునని, వాటికి తగిన సౌకర్యాలు ఇస్తామని వారికి మనము హామీ ఇచ్చి, వారు మనము అందరు కలిసి మెలసి సఖ్యతతో, ఐక్యతతో కావలసినటువంటి అభ్యుదయానికి పాటుపడే అవకాశము కల్పించడానికి గాను మన తరఫున మన మంత్రులు, పెద్దలు అక్కడికిపోయి వాళ్లతో ఈవిధముగా ఒప్పుకొనిన దాన్ని మనముకూడ పూర్తిగా ఒప్పుకొనవలెనని, మన ఐక్యతకు, దేశాభివృద్ధి కార్యక్రమాలు చేసుకొనేందుకు ఇది చాలా అవసరమని నేను మనవిచేస్తున్నాను.

ఇంతకంటె ఎక్కువగా మనమంతాకూడా చేయవలసింది ఒకటి ఉన్నది. మనము భవిష్యత్తులో మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించేటటువంటి యుగంలో మనము ఇప్పుడున్నాము. ఈ యుగంలో ఎవరుకూడ, ఏ సభ్యుడుకూడ ఏవిధమైనటువంటి పొరబాటుమాట అనకుండా, నేను మంచి ఉన్నతమైనటువంటి ప్రదేశమునుండి వచ్చినానని కాని, భాగ్యమైనటువంటి ప్రదేశమునుండి వచ్చినానని కాని అనకుండా, ఐక్యతను, సఖ్యతను పెంచడానికి కావలసినటువంటి భావి పరిణామంకొరకు ప్రతి సభ్యుడుకూడ వెనుకబడినటువంటి, అధోగతిలో ఉన్నటువంటి వారిని అభ్యుదయానికి తీసుకువచ్చేటటువంటి ప్రయత్నం చేయాలి. ఇది అందరికి చాలా ముఖ్యమైనటువంటి కర్తవ్యము.

ఇక, సరిహద్దుల గురించి 1, 2 మాటలు చెప్పదలచుకొన్నాను. మా బాధ చాలామందికి తెలియకుండా ఉన్నది. ఈనాటికి అయినాసరే, మన ముఖ్యమంత్రిగారు, హైదరాబాదు ముఖ్యమంత్రిగారు ఏదైనా అవకాశముంటె తుంగభద్రకు ఇవతల ప్రక్కన మనకు రావలసిన మూడు తాలూకాలు మనకు ఇవ్వడానికి గట్టిగా ప్రయత్నం చేయవలసిందని మనవిచేస్తున్నాను. హైదరాబాదుతో ఏకమయ్యేటప్పుడు ఆనాడు చేసిన సూచనలలో, ఈ సూచనకూడా వారు ఇచ్చి ఉంటే, అవి తప్పకుండా మనకు వచ్చి ఉండేవి. తుంగభద్రకు అవతల హైదరాబాదు వాళ్లు కైలాసం కట్టినారు; ఇవతల ప్రక్క మద్రాసు వాళ్లు వైకుంఠము కట్టేటటువంటి ప్రయత్నం జరిగింది. కాని ఈనాడు వైకుంఠము, కైలాసము అంతాకూడా మైసూరుకు అప్పజెప్పేటటువంటి ప్రయత్నం జరిగింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం చేసుకొనుచున్నటువంటి ఈ సందర్భంలో ఏ రాష్ట్రాన్ని మనము ఏర్పాటు చేసినప్పటికిని ఆ రాష్ట్రముయొక్క అభ్యుదయానికి తగినటువంటి సరిహద్దులు

3rd April 1956] [Sri K. Subba Rao

అందులో ఉండేటటువంటి ప్రయత్నాలు చేసుకోవాలి అనేది కూడ ప్రధానమైనటువంటిది. ఇప్పుడు మనకు రావలసినటువంటి బళ్ళారిప్రాంతము కర్నాటకులది అని వాళ్లు దానికొక చరిత్ర చెప్పుతారు. వాళ్లు ఏ చరిత్ర చదువుకొన్నారో, మేముకూడా ఆ చరిత్రే చదువుకొన్నాము. బళ్ళారి ప్రాంతము కర్నాటక ప్రాంతము కాదని ఈ దినముకూడ నేను ధైర్యంగా చెప్పగలను. విజయనగర రాజ్యంలో కర్నాటకులకు ఎంత హక్కు ఉన్నదో తెలుగువాళ్ళకుకూడా అంత హక్కు ఉన్నది. అక్కడ పరిపాలనచేసిన నాలుగు శతాబ్దాలలో రెండు శతాబ్దాలు తెలుగువారే పరిపాలన చేసినారు. తరువాత కర్నాటకులు వచ్చినారు. ఆంధ్రకర్నాటక రాజ్యలక్ష్మీధురంధరులని అప్పుడు రాజును పిలిపించిందేగాని అక్కడ కర్నాటకమనేది ప్రత్యేకంగా ఏమిలేదు. కర్నాటక శబ్దం కన్నడశబ్దంనుంచి వచ్చిందికాదు. 'కరినాటి' శబ్దంనుంచి వచ్చినటువంటిది ఈ కర్నాటక శబ్దము. నల్లని నేలలో రాజ్యపరిపాలనం చేసినటువంటిది అది ఒక్కరాజ్యమే. కనుకనే ఆంధ్ర-కర్నాటకం అనే భేదంలేకుండా, నల్లని నేలలో కట్టినరాజ్యం గనుక కర్నాటక రాజ్యం అనే పేరు దానికి తీసుకువచ్చి పెట్టినట్లు చరిత్రలో ఉన్నది. ఈనాడు తెలంగాణా ప్రజలు మనము అందరుకూడ ఏకమైపోయినాము కనుక ఇద్దరియొక్క భవిష్యత్తు ఆధారంగా చేసుకొని ఇద్దరియొక్క భావిభాగ్యోదయానికిగాను దానిని తుంగభద్ర ప్రాంతములో ఒకభాగం ఈతట్టు రావడానికి తగినటువంటి ప్రయత్నం చేయవలెనని ప్రార్థిస్తున్నాను. అంతకంటె ఎక్కువగా సరిహద్దుల విషయంలో మీకు తెలుసునో తెలియదోగాని రాయచూరువిషయము ఉన్నది. రాయచూరు కొరకు ఎంతమంది తెలుగువాళ్లు తమ తనువులను సమర్పించి రక్తధార పోసినారో రాయచూరు ముట్టడిని గురించి ఒకసారి చదువుకొంటే తెలుస్తుంది. రాయచూరు తెలుగువారిది. తెలుగువారు ముట్టడిచేసి తమ రక్తాన్నిధార పోసి ప్రవాహమువలె ప్రవహింపజేసి ఆదినము సంపాదించినటువంటిది ఈ రాయచూరు. ఈ దినముకూడ రాయచూరు తెలుగుప్రాంతమే. కన్నడప్రాంతము వేరే ఉండవచ్చును. ఆ కారణంచేతనే బహుశా రాయచూరుపట్టణము అక్కడ పోయిందేమో! కాని, భారతదేశమంతా ఒకటి అనే భావముతో ఇప్పుడు ఉన్నాము. గనుక అంత తగాదాచేయక పోయినప్పటికి, రాజోలిబండ ప్రాంతములో కొన్నిభాగములలోను అట్లాగ హైదరాబాదు ప్రాంతములో అటువైపు మధ్యప్రదేశ్‌లో ఉండేటటువంటి కొన్ని భాగములలోను మన నీటివసరులకు అభ్యంతరంలేకుండా మన ఆంధ్రరాష్ట్ర ఆర్థికాభ్యుదయానికి కావలసిన సౌకర్యములు చక్కగా ఏర్పాటుచేసుకొనేదానికి ఏఏ భాగములు మనకు అత్యవసరమో వాటిని గురించి మన ఆంధ్రమంత్రులు తెలంగాణాలో ఇదివరకు అధికారము వహించినటువంటి పెద్దలు ఇద్దరుకలిసి ఒక చక్కని plan వ్రాసి భారతప్రభుత్వానికి అర్పించి

ముందు తగాదాలు లేకుండా, మా అభ్యుదయానికి ఎక్కడా అడ్డురాకుండా ఉండేటందుకు యీ ప్రాంతాలు మేము అడుగుతున్నామని అవసరమైతే వీరు నిర్ధారణ చేసినప్రకారము అక్కడ వాళ్ల భాషకుగాని ఇతరవిషయాలలోగాని వారికి ఏలాటి ఆటంకం కలుగకుండా వారికి కావలసిన సౌకర్యములు ఏర్పాటుచేస్తామనే టటువంటిహామీ ఇస్తామనిచెప్పి ఆ విధంగా వారికి హామీ యిచ్చి ఆ సరిహద్దు భాగాలను మనం తీసుకొనేందుకు గట్టి ప్రయత్నం చేయవలెనని ప్రార్థిస్తున్నాను. ఈ సందర్భంలో ముఖ్యమంత్రిగారిని ఎక్కువగా అభినందించవలసిన విషయము మరొకటి ఉన్నది. నేను సభ్యుడుగా ఉండేటటువంటి మడకశిర ప్రాంతము గురించి కర్నాటకులు ఆలోచనచేసి దానిని వాళ్లభాగంలో కలుపుకొనేందుకు ప్రయత్నించిన ఫలితంగా మొట్టమొదట S.R.C. రిపోర్టుప్రకారం, అది వారిభాగములో చూపబడింది దానికి మనము ఆందోళనచేయలేదు కాబట్టి మేము దానిని కర్నాటకులకు ఇచ్చినాము అనే కారణము చెప్పినారు. కాని ఆందోళనే అవసరమైతే ఆంధ్రులు వెనుకపడేవాళ్లు కాదు అని వారికి ఇదివరకే చెప్పాము. అంతేకాదు. అవసరం వచ్చినప్పుడు శాంతిలో సత్యానికి కట్టుబడి పెద్దలు చెప్పిన వాక్యాలకు కట్టుబడి ఉండేవారు ఆంధ్రులు. ఆ కారణముచేత ఆంధ్రులు ఊరికే ఉండినందువలన, దాన్ని ఒక కారణంగా తీసుకొని వారు అడగలేదని చెప్పి ఎన్నికలలో ఓడిపోయినటువంటి ఒక సభ్యుడు మడకశిరప్రాంతము కర్నాటకులది. అక్కడ కన్నడిగుల సంఖ్య ఎక్కువ ఉన్నది కాబట్టి అది మాకు ఇవ్వవలసిందని చెప్పితే, దాన్ని అంగీకరించి, అదేసందర్భంలో ఎన్నికలలో గెలిచినటువంటి బాగెపల్లి సభ్యుడుపోయి మేము తెలుగువాళ్లలోనే పోతాము, మమ్ము తెలుగుప్రాంతములోనె ఉంచండి అనిచెప్పితే అదిమాత్రం లెక్క చేయకపోవడంజరిగింది. కాని అప్పుడు మనముఖ్యమంత్రిగారు సంజీవరెడ్డిగారుఅక్కడ ఉండడంవల్ల, సంజీవరెడ్డిగారు కోపముతో ఇది అక్రమము అని వారిని హెచ్చరించి చెప్పితే మరల మడకశిరప్రాంతము ఈ భాగంలోనికి వచ్చింది. కాని ఈనాటికి కూడ అవసరమని చెప్పేటటువంటి అభ్యుదయం కలిగినట్లయితే మడకశిర, పావగడ, ఈ రెండు తాలూకాలను ఏకముచేసి అందులో తెనుగుభాగాలను, కన్నడభాగాలను విభాగంచేయనివ్వండి. దానిప్రకారం వచ్చే తెనుగుభాగాన్ని ఒప్పుకొనేందుకు మేము సిద్ధముగా ఉన్నాము. ఆవిధంగాచూస్తే తెలుగుభాగాలు ఎక్కువవున్నాయి కనుక ఆభాగాలను మాకు ఇచ్చివేయండని, ఈనాటికైనా పట్టుపట్టి ఆ భాగాలను తీసుకొన్నట్లయితే, అనంతపురం మండలానికి ఎక్కడా ఏమి అడ్డులేకుండా చక్కగా అభ్యుదయం జరగడానికి తగిన అవకాశాలు ఉన్నాయని చెప్పుచున్నాను.

కాబట్టి ఈ తీర్మానాన్ని మనమందరము ఏకగ్రీవంగా ఆమోదించి ఈ సూచన ఆన్ని పట్టుబట్టి సాధించేటందుకు ప్రయత్నించవలెనని కోరుచున్నాను. అందులో ముఖ్యంగా బళ్లారిప్రాంతము, తుంగభద్రాప్రాంతము ఏదో ఒకవిధంగా వచ్చేటట్లు

ప్రయత్నంచేయవలసియున్నది. ఈ విషయంలో కావాలంటే ఒకటి చేయవచ్చును. ఈ దినము ముండ్లూరు గంగప్పగారు రాజీనామాయిచ్చినారు. ఆ స్థానములో ఒకరిని ఎన్నుకొనేందుకు ఈ సమస్యమీదనే ప్రజాభిప్రాయము తెలుసుకొనేందుకు ఇరు ప్రక్కల అభ్యర్థులను నిలబెట్టి ఎన్నికలు జరుపమనండి. మరల గంగప్పగారు కాంగ్రెసుతరఫున ఇటువైపున నిలబడతారు. అటువైపు కర్నాటకులు ఒక అభ్యర్థిని నిలబెట్టనివ్వండి. కర్నాటకులు గెలిస్తే వారే ఆ ప్రాంతాన్ని తీసుకో నివ్వండి, ఆంధ్రులు గెలిస్తే ఆంధ్రులు తీసుకొంటారు. ఆవిధంగా చేస్తే, న్యాయం జరగడానికి అవకాశముంటుంది. లేకపోయినట్లయితే, దేశములో ఎప్పటికికూడా కుళ్లుతూ ఉండేటటువంటి ఒక కుళ్లు కంఠప్రాయంగా అయిపోయి, సరిహద్దు ప్రాంతాలలో ఎప్పుడుకూడ శాంతినిరోధన కార్యక్రమాలు జరగడానికి అవకాశము ఉంటుంది అని హెచ్చరిస్తూ, ఈ దినము బళ్ళారిప్రాంతములో కనీసపుకోర్కగా అడిగేటటువంటి మూడు ఫిర్కాలనైనా మనప్రక్క తీసుకోడానికి ఆంధ్రప్రభుత్వం వారు, తెలంగాణాపెద్దలు ప్రయత్నంచేయవలసిందని ప్రార్థిస్తూ, ఈ అవకాశము ఇచ్చినందుకు అధ్యక్షులవారికి వందనములు అర్పిస్తున్నాను.

* SRI K. V. VEMA REDDI :—Mr Speaker, Sir, in supporting the Bill I want to make a few observations. Yesterday the Chief Minister in presenting the Bill dwelt at length on the Bill and covered all aspects of it. First of all, it marks a new era for Andhras, as a new State is formed.

Before speaking about the formation of the enlarged State let me recapituate the progress of the formation of States on linguistic basis. As a matter of fact this Bill has a historical background, first in the Indian Statutory Commission during the British rule, then the Dhar Commission, then the J.V.P. Report and later on the Fazal Ali Commission who were entrusted with the great task of redrawing the map of India on linguistic basis. The Congress lent its support to that proposal as well as the Communists, and the Socialist Party also has supported the view in consonance with the aspirations of the people. First of all I wish to submit that the Fazal Ali Commission was guided not only by the linguistic consideration but also by administrative, economic and financial considerations. A few years ago the Andhra State was formed and at that time there was a good deal of reasoning against the formation of States on linguistic basis

on the ground that linguistic States fostered exclusiveness, regional and communal affinities and also obliterated the sense of national unity by local language, history and culture. That is true. I agree with it. But it can be averted by dynamic leadership, political acumen and political consciousness. In this connection it may not be out of place—it may be relevant I think—to mention that if leadership emerges out of political cliques, from group mentality and communal basis it would dissipate the politics of Andhra State, and I am sure with the formation of the new State a new leadership based on goodwill and co-operation and unanimity will be formed in the State of Andhra. We enter upon a new era with the transfer of territories of Telangana to the present Andhra State. Ours becomes the third biggest State in India and our State has got a great scope and opportunity for development because of the natural resources, power, water and mineral wealth. At the outset Telangana had its own apprehensions. I am not prepared to call them imaginary, for they may be real and natural apprehensions ; but all the same those apprehensions have now been dispelled by the safeguards guaranteed, and I am sure those safeguards will be incorporated by the President in the Bill.

Coming then to the Bellary issue, with regard to it, the Fazal Ali Commission's approach was quite different from the approach of the Misra Commission. The approach of Mr. Misra was guided by the 'linguistic gravity, in the words of Fazal Ali Commission. But the Fazal Ali Commission in recommending the transfer of the territories of Bellary taluk, Siruguppa and Hospet considered also the aspects of administrative convenience, geographical contiguity and the vital importance of Tungabhadra project and the headworks. As a matter of fact the High Power Committee and the Government of India also recognised the vital interest to Rayalaseema of the Tungabhadra Project and the headworks, but did not agree with the recommendation of the Fazal Ali Commission with regard to the territorial changes. They twisted it and gave a different finding on the issue of Bellary, namely, that the vital interests may be safeguarded

by some other means So that is the opinion of the Government of India and the High Power Committee. Sir, to-day Bellary issue is a most serious question It affects the interests of Rayalaseema. In fact Rayalaseema is as much undeveloped and backward as Telangana The Tungabhadra project is an insurance against recurring famine in Rayalaseema, and if we have no control over the project and if we have no control over the headworks, the development of Rayalaseema will be greatly retarded.

Then, Sir, as regards the Zonal Councils I wish to say a few words. The composition of the Zonal Councils is purely official. It has got an official atmosphere. A non-official element should be introduced in them A few non-official say, eminent persons, men of wisdom, men of administrative experience should also be included in the Zonal Councils.

Coming next to the High Court, clause 53 of the Bill is quite clear on the subject. That clause provides for the constitution of a High Court for the new State. But the location of our High Court should be decided either by Parliament or the new Legislature. In my opinion Hyderabad is the best place for the location of the High Court. When that location was suggested, there arose some apprehensions in the minds of Telangana Advocates that they could not face competition by the influx of Advocates from Andhra area. Probably it may be so. But competition in any walk of life is inevitable. I am sure there are eminent Advocates in Hyderabad also. For those Advocates in Hyderabad they can have a separate Bench of Urdu knowing judges to cater and protect the interests of Urdu knowing Advocates. It may be set up.

As regards the second chamber, clauses 31 to 36 deal with it. They provide a legislative council for Madhya Pradesh, Mysore and the Punjab. Ours is the third biggest State in India. As the Deputy Speaker, Sri Kallur Subba Rao observed bicameral legislature is the cardinal principal of democracy. Ours is an infant democracy. About eight

Sri K. V. Vema Reddi] [3rd April 1956

years ago we achieved independence, and in an infant democratic set up it is necessary to have a second chamber as the counsel of elders is highly necessary. So men of wisdom, men of experience should have a place in the council of elders and they can contribute to the well functioning of the infant democracy. In the elections of 1952 and 1955 we found that people with their fluctuating opinion and fluctuating ideas could not judge whom to elect. As a matter of fact we find that persons who are decried yesterday by the public are being returned to-day with athumpi ng majority. That is the state of our present democratic set up. To safeguard against such things, and to check hasty legislation a second chamber is necessary.

As regards the Public Service Commission, the Fazal Ali Commission has recommended that the appointment of members and Chairman should be made by the President. It is a good rule. For it will increase the stature and independence of the Public Service Commission. It will also remove apprehensions of discrimination in the matter of recruitment to the services from the mind of the people and from the minds of those who seek employment. As regards the transfer of High Court Judges from one High Court to another, it is a good idea in the sense it will inspire confidence, it will help in arresting parochial trends etc. After all a Judge also like any other ordinary man is subject to human weakness, and so the transfer of Judges from one High Court to another is quite desirable in the interest of administration of justice.

Finally, Sir, in the matter of reorganisation of States there are several matters which require care and caution. Take for example, the reallocation of Services, the division of assets and liabilities and the fixation of cadres and scales of pay. All these are very important and they have to be decided with meticulous care. I am sure under the able guidance of our leaders we will able to solve those problems. Andhra-Telangana, the third biggest State in India has a great future before it, and I am sure by co-operation and good will we can make our State a model State in India.

3rd April 1956]

SRI P. NARASIMHAPPA RAO:—అధ్యక్షా, రాష్ట్రపునర్విభజన కమీషన్ వారు చేసిన సూచనలపై కేంద్రప్రభుత్వమువారి నిశ్చితాభిప్రాయములు తే॥ 16-1-1956 న ప్రకటింపబడినవి. ఆ ప్రకటనలో (1) తెలుగుభాషమాట్లాడు వారి రాష్ట్రముగురించియు, (2) బళ్ళారిజిల్లాలోని కొన్నిప్రాంతములను ఆంధ్రకు ట్రాన్స్ఫరుచేయుటగురించియు, కేంద్రప్రభుత్వమువారి తుదినిర్ణయములు ప్రకటింప బడలేదు.

హైదరాబాదురాష్ట్రములోని తొమ్మిదిజిల్లాలతో "ఆంధ్ర-తెలంగాణా" అనుపేరుతో తెలుగుభాష మాట్లాడువారిరాష్ట్రము యేర్పరుచుటకు నిశ్చయింప బడినది.

ఆంధ్రులదృష్టిలో మిక్కిలి ముఖ్యమైన తుంగభద్రప్రాజెక్టును యెవ్విధమైన ప్రాంతీయమార్పులు చేయకుండ నిర్వహించుటకు వీలుకలదు అనియు, ఆకారణముచే బళ్ళారివిషయమై పరిశీలన అవసరములేదు అనియు, కేంద్రప్రభుత్వపు అభిప్రాయము.

కేవలము భాషాప్రయుక్తరాష్ట్రవిభజన కొన్నింటిలోడల పరిపాలనా సౌకర్యమునకు విరుద్ధముగ నుండవచ్చును. ప్రస్తుతము జరుగుచున్నది "రాష్ట్ర విభజన" మాత్రమే.

రాష్ట్ర సరిహద్దులవిషయములో స్వల్పమార్పులు మాత్రము......అవియు పరిపాలనా సౌకర్యముకొఱకు అవసరమైనవి—చేయుటకు బౌండరీ కమిషనులు నియమింపబడును.

భారతదేశముయొక్క శ్రేయస్సు ప్రతి భారతీయుని లక్ష్యము. లక్ష్యసిద్ధికి అనుసరించుమార్గములు యేవి మంచివి? ఏవి మంచివి కావు? అను విషయమున భేధాభిప్రాయములకు మార్గముండవచ్చును. అట్టి విభిన్నాభిప్రాయములను సమన్వయ పరచి శాంతియుత అంగీకారంపద్ధతిని సాధించవచ్చును.

రాష్ట్ర పునర్విభజన కమిషనువారు కడు శ్రమపడి సమగ్రమైన రిపోర్టు కేంద్రప్రభుత్వమువారికి అందజేసినందుకు వారికి కృతజ్ఞతాపూర్వక వందనములు సమర్పిస్తున్నాను.

నేను చేయబోయే సూచనలు సభామోదము పొందగలవని నమ్ముచున్నాను.

(1) రాష్ట్రముయొక్క పేరును మార్చుకొనగల హక్కు యీ సభకుగలదు. "ఆంధ్ర తెలంగాణా" అను పేరుకు బదులుగా వేరొకపేరు బిల్లులోనే పొందు పరచుట మంచిది.

(2) మూడవ షెడ్యూలులో యీ రాష్ట్రమునకు House of People కు 43 స్థానములును, Assembly కి 301 స్థానములున్ను నిర్ణయింపబడియున్నవి.

Sri P. Narasimhappa Rao] [3rd April 1956

ప్రస్తుతమున్న స్థానములకంటె, సదరు స్థానములు తక్కువకావని నా నమ్మకము. తక్కువైనచో కేంద్ర ప్రభుత్వమువారికి సదరులోపము తెలియజేయవలసియుండును. 1951 సం॥ము జనాభా ప్రకారము సీట్లు నిర్ణయింప బడవలెను.

3. 1956-57 సం॥ ముయొక్క మొదటి అర్ధ సంవత్సరమునకు.

(1) ఆంధ్రకు............... 5. 92 శాతము.

(2) హైదరాబాదుకు — 5. 39 శాతము.

— వెరశి 11. 31 శాతము.

Excise Duties వాటా కేటాయించబడినది. రెండవ అర్ధ సంవత్సరమునకు 9.08 శాతము కేటాయించబడినది. రాబడి పన్ను వసూళ్ళనుంచి :—

(1) మొదటి అర్ధ సం॥నకు — 9. 99 శాతమున్ను

(2) రెండవ అర్ధ సం॥ నకు — 8. 09 శాతమున్ను

కేటాయించబడినది.

ప్రాథమిక విద్యాభివృద్ధికొఱకు :—

(1) మొదటి అర్ధ సం॥నకు 20 లక్షల రూపాయిలు.

(2) రెండవ అర్ధ సం॥నకు 11. 55 లక్షలున్ను కేటాయించబడినవి.

ఇకపోతే general purposes కు ఏమియు కేటాయింప బడలేదు.

తెలంగాణా ప్రాంతము చాల వెనుకబడియున్న ప్రాంతమను విషయము నిర్వివాదమైనది. అట్టి ప్రాంతమును ఆంధ్రలోచేర్చనున్న తరుణమున నూతన రాష్ట్రమునకు కేంద్రము చాలినంత ధన సహాయముచేయుట న్యాయము. అందుచే (1) Excise Duties, (2) రాబడి పన్నుల వసూళ్ళు, (3) ప్రాథమిక విద్యా గ్రాంటు ; (4) General purposes grant లలో మరి కొంచెము హెచ్చు చేయుట ముఖ్యావసరము.

Zonal Councils కేవలము సలహా సంఘములు మాత్రమే అయియుండును. అట్టి సలహా సంఘములలో అనధికారవర్గమునకు చెందినవారి ప్రాతినిధ్యము వాంఛనీయము. ఎస్సెంబ్లీ సభ్యులకు పరిపాలనా సమర్థత మరియే యితర సంస్థలలో కలగగలదు ? యీ సత్యమును గుర్తించి సదరు Zonal Councils లో (1) Planning Commission వారిచే నియమింపబడిన ఒక సభ్యుడున్ను (2) M. L. A లు తమలో తాము ఎన్నుకొనిన ముగ్గురు M.L.A. లు, మొత్తము నలుగురు Advisers (సలహాదార్లు) వోటింగు హక్కు కలిగియుండవలెను. కౌన్సిలులోగల మంత్రుల కార్యదర్శులు సలహాదారులుగనుండుటయు, సలహాదారులుగా వారికి వోటింగు

3rd April 1956] [Sri P. Narasimhappa Rao

హక్కు లేకుండుటయు, ప్రజాస్వామ్య విధానమునకు వ్యతిరేకములు. గాన పై ప్రతిపాదన, ఆమోదించకోరుచున్నాను.

బిల్లులో 1 (2) సబ్ క్లాజు 4. (11) ప్రకారము-"ఆంధ్ర తెలంగాణా" అను పదము, సందర్భముగాను, సరియైనదిగాను ఎంతమాత్రము కనిపించుటలేదు. వినుటకుగూడ కర్ణకఠోరముగా నున్నది.

జనసమ్మతమైన భాష తెలుగు లేక ఆంధ్రము. అనగా రెండును ఒకే అర్థము నిచ్చును. ఈ కారణముచే భాషలో ఏమాత్రమైన వ్యత్యాసము లేదు. దీనినందరు విశ్వసించవలసిన విషయమే.

ఇప్పుడు ఆంధ్రలో కలుపవలసిన జిల్లాలు ముఖ్యముగా హైదరాబాదులో నున్న తెలుగుజిల్లాలేగాన, భాషయే ముఖ్యముగా ప్రాతిపదికయైనది. ప్రస్తుతము హైదరాబాదులోనున్న తెలుగుజిల్లాలే. ఇప్పుడు ఏర్పడనున్న ఆంధ్రకు కలుపవలసి యున్నది. గాన ఇదివరలోనున్న తెలంగాణా అను పేరు ప్రస్తుతము అప్రస్తుతము. కేరళ, కర్నాటక, మహారాష్ట్ర మొదలగుపేర్లు భాషాప్రాతిపదికపైననే ఏర్పడినవి. ఇవియేగాక, ఆంధ్రశబ్దము భారత భాగవతములలోనుకూడ కన్పించుచున్నది. పైకారణములచే అన్నితరగతులచే తరతరాలుగ వాడుకచేయబడుచున్న "విశాలాంధ్ర" అను నామమే సరిగాయున్నది. విశాలాంధ్ర అని పేరుపెట్టి పిలచుట మంచిది. ఈ పేరును మన తెలంగాణా సోదరులుగూడ యిదివరలో ఒప్పుకొనియేయున్నారు. ఒక చిన్న "పేరు" అను సమస్యపైన, మనస్పర్థలు పెంచుకొని, తగవులాడుటవలన, మన పొరుగునున్న రాష్ట్రాలసోదరులు, నవ్వకమానరు. మనలోనున్న అనైక్యత వెల్లడి కాక తప్పదు. అందుచేత మనమందరము విశాలభావముతో ఆలోచించిన "విశాలాంధ్ర" అను నామము సమంజసముగానున్నది. "విశాలాంధ్ర" అను పదము ఆంధ్రజనబాహుళ్యమునకే చెందిన పదముగాని, కమ్యూనిస్టులదని, కమ్యూనిస్టు సోదరులుగాని, వారి సహచరులుగాని, భావించుట అసమంజసమేగాని వేరుకాదు.

Clause 1 (3) సబ్ క్లాజు (1) ప్రకారము, ఇతరరాష్ట్రములలోనున్న తెలుగుప్రాంతములు అనగా ముఖ్యముగా, ఒరిస్సారాష్ట్రములోనున్న తెలుగు ప్రాంతములు—అనగా పర్లాకిమిడి, రాయగడ, బరహంపూర్ మొదలగు ప్రాంతములు క్రొత్తగా ఏర్పడిన తెలుగునాడులో కలుపుటకు అన్ని ప్రయత్నములు చేయవలెను. S. R. C. report లో విధిగా సరిహద్దుసంఘము నియామకానికి, ఒకక్లాజు చేర్చవలెను. రాజ్యాంగచట్టమునే సవరణలు చేయుచున్న మనకు, S. R. C. report లో సరిహద్దుసంఘ నియామకానికి క్లాజునుచేర్చుట ఒక పెద్దపనికాదు. అట్లుకాకున్న, ఇతరరాష్ట్రములలోనున్న అనగా ఒరిస్సారాష్ట్రములోనున్న తెలుగువారికి,

Sri P. Narasimhappa Rao] [3rd April 1956

మహాపచారము చేసినవారల మగుదుము. వారి కుతూహలమునకు దోహదమివ్వక తప్పదు. కాన దీనినిగూర్చి కేంద్రమునకు వెంటనే చెప్పుట మనందరి బాధ్యత అయి ఉన్నది.

తరువాత యింకొక విషయము ఉన్నది. సరిహద్దురాష్ట్రములలో ఉండిపోయి నటువంటివి, మనకు రావలసినటువంటివి, ముఖ్యంగా ఒరిస్సా, మద్రాసు, మైసూరు రాష్ట్రములలో ఉన్న తెలుగుప్రాంతాలు మనకు రాలేదు. వీటికొరకు ఏమాత్రము ఆందోళన,వత్తిడిచేయకుండా విడిచిపెట్టిన కొరకులు మన ఆంధ్రనాయకులనే చెప్పక తప్పదు. హైదరాబాదు వస్తేచాలు అని అనుకోవడముతప్ప, మనకు నిజముగావచ్చింది యేమీ కనబడలేదు. ఒక్క హైదరాబాదు వచ్చినంతమాత్రాన, తక్కిన తెలుగు ప్రాంతాలుగూడ రావలసినవి వచ్చినట్లు మనము అనుకోటానికి వీలుంటుందా? ఆనాడు ఆంధ్రరాష్ట్రము ఏర్పడినసమయములో రాయలసీమవారు, ఏదో శ్రీబాగ్ ఒడంబడిక అనేది ఒకటి గట్టిది వారికి ఉన్నదని చెప్పి, సర్కారుజిల్లాలవారిని నిర్లక్ష్యముచెయ్యడము జరిగింది. శ్రీబాగ్ ఒడంబడికను వెనుకబెట్టుకుని రాయల సీమలోని జిల్లాలను బాగుచేసుకున్నారు. ఇక సర్కారుజిల్లాలలో వెనుకబడిన విశాఖపట్టణము, శ్రీకాకుళంజిల్లాలసంగతి ఎత్తుకున్నవారులేరు. ఆంధ్రరాష్ట్రము వచ్చి యిప్పటికి రెండుసంవత్సరములు దాటిపోయిననూ, ఆ జిల్లాలు యిప్పటికీగూడ యథాప్రకారముగా వెనుకబడినస్థితిలోనే ఉన్నవి. హైదరాబాదుకావాలి, కావాలి అని చెప్పి, ఏదోసామెత చెప్పినట్లు కొత్తకోడలు వస్తుందని సంతోషించడము మాదిరిగా, హైదరాబాదు వచ్చిందని మన నాయకులు ఏదో సంతోషిస్తున్నారు. కాని హైదరాబాదు ఒక్కటి రావడముతప్ప మనకు నిజముగా వచ్చింది ఏమీలేదు శాస్త్రముగా రావలసిన తెలుగుప్రాంతాలను మన నాయకులయొక్క అశ్రద్ధచేతనే సంపాదించలేకపోయారు. ఇందుకు చాలా విచారకరముగా ఉన్నది. దీనివల్ల మన నాయకులయొక్క శక్తిసామర్థ్యాలు ఎంతటివో రుజువు అయినవి. ఇప్పటికైనా మరొకప్రయత్నము తప్పక చేస్తారని ఆశిస్తున్నాను. లేకపోతే ప్రజలలో ఎంత వరకు నిరుత్సాహము, నాయకులమీద ఎన్ని అనుమానాలు, ప్రబలుతాయో ఆలోచించ మని మంత్రివర్గాన్ని హెచ్చరిస్తున్నాను. హైదరాబాదుమాత్రము వస్తేచాలదు. తెలంగాణాలోని యితరజిల్లాలు వచ్చినాగూడా,అవి రానట్లేనని లెక్కవేసుకోవచ్చు. నేను శ్రీకాకుళంజిల్లావాడిని. మాకు సరిహద్దురాష్ట్రము ఒరిస్సా. ఒరిస్సారాష్ట్రము ఏర్పడినసమయములో ఆంధ్రప్రాంతాలు ఒరిస్సాలో అక్రమముగా చేర్చబడినవి. ఇప్పుడు States re-organization వల్లనైనా ఆ ఒరిస్సారాష్ట్రములో ఉన్న ఆంధ్రులందరు తిరిగి ఆంధ్రలో చేరబోతామని ఎంతో ఆశపెట్టుకున్నారు. ఇప్పుడు ఈ బిల్లునుబట్టి ఆ ప్రాంతాలు రాకపోవడముచేత, తిరిగి ఆందోళనలు అల్లర్లు బయలు దేరుతాయేమోనని భయపడుతున్నాను. ఒరిస్సాలోని ఆంధ్ర ప్రాంతాలు

రాకపోవటానికి బాధ్యులు ఆంధ్రనాయకులనే నమ్ముతున్నారు ఇదేమాదిరిగా మైసూరు ప్రాంతములో మన ఆంధ్రులు ఎంతోమంది ఉండిపోయారు మనకు ఉన్న బళ్లారి, దాని సరిహద్దున ఉన్న తెనుగుతాలూకాలు, తుంగభద్రప్రాంతము రాలేదు. దీనినిగురించి మన నాయకులు ఏమనివాదించారో తెలియటానికి వీలు లేకుండాపోయింది. కేంద్రప్రభుత్వమువారైనా మనము చెప్పుకోటానికి ఏమి అవకాశము కలిగించారు ? ఎంతసేపటికి విశాలాంధ్ర, విశాలాంధ్ర అని ఉవ్విళ్లూరి యిప్పుడు అది వచ్చిందని మన నాయకులు సంతోషపడుతున్నారేగాని సరిహద్దురాష్ట్రిలలో ఉన్న ఆంధ్రులు ఎంత తహతహపడుతున్నారో నాయకులు గుర్తించినట్లులేదు. ఒరిస్సాలో ఉన్న ఆంధ్రులు ఏ విధముగా గోలపెట్టుతున్నారో ఆలోచించినట్లులేదు. ఈ మధ్య కాల్పులుగూడ జరిగిన సంగతి అందరికి తెలిసినవిషయమే. ఈ విషయము ఆంధ్రనాయకులు మరచిపోయినారా ? రక్తప్రవాహాలుకూడ అయినవిగదా ? వాళ్ల సంగతి ఏమి చెబుతారు ? ఇప్పుడు యీ ఒక్క హైదరాబాదు వచ్చిందని సంతోషించి తృప్తిపడడము సమర్థనీయమా అంటే కాదనే చెప్పాలి. మరొకవిషయము. రేపు మనము Hyderabad కు పోబోతున్నాము. ఇక్కడ మన రాష్ట్రింలో ఉన్నమాదిరి అక్కడగూడ గజెటెడ్, నాన్‌గజెటెడ్ ఉద్యోగస్థులు ఉన్నారు. Hyderabad లో గజెటెడు ఉద్యోగస్థులు 5,077 మంది, నాన్ గజెటెడువారు 30,172 మంది ఉన్నారు. ఇక్కడ మన రాష్ట్రంలో గజెటెడువారు 1780 మంది ఉన్నారు. నాన్‌గజెటెడువారు 93,412 మంది ఉన్నారు. వారి scales of pay కున్నూ యిక్కడ ఉన్నవారి scales of pay కున్నూ విపరీతమైన తేడాలు ఉన్నవి. మనవాళ్ల scales కంటే వారివే చాలా ఎక్కువ. ఇద్దరూగూడా ఒకేచోట యింత తేడాలతో పనిచేయుట న్యాయము అనిపించుకుంటుందా ? వారికి వీరికి సమానస్థాయిలో scales of pay ఏర్పాటుచేయాలి. ఇది ఎట్లా ఉన్నదంటే ఇద్దరికి ఒకే పంక్తిలో ఒకరికి ఒకవిధముగాను యింకొకరి యింకొకవిధముగాను భోజనము వడ్డించి తినండి, అని చెప్పినట్లు అవుతున్నది. ఇది ఈవిధముగా ఉండడము దురన్యాయము. ఈరోజున Hyderabad మంత్రి మండలిలోని ముఖ్యులు యిక్కడికి వచ్చారు. మనము Hyderabad కు పోయేముందు వీరికి వారికి జీతాలలో తేడాలు లేకుండాచేయడం మొదటి షరతుగా Hyderabad నాయకులచేత మన డిప్యూటీ ముఖ్యమంత్రిగారు, ముఖ్యమంత్రిగారు ఒప్పించవలసిందిగా కోరుతున్నాను. ఈ విషయములో తగుశ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత మన ఆంధ్రప్రభుత్వంయొక్క ఆఫీసులు కొన్ని మద్రాసులో ఉన్నవి. కొన్నిఇక్కడఉన్నవి ఇంకాకొన్ని వేరేచోట్లలోఉన్నవి.వీటినన్నింటినీHyderabad లోనే వెంటనే ఏర్పాటుచేయటానికి, Hyderabad లో తగిన buildings లేక

Sri P. Narasimhappa Rao] [3rd April 1956

పోతే, వెంటనే కట్టించి అందరిని ఒకేసారి వచ్చే అక్టోబరునాటికి తప్పకుండా తీసుకునివచ్చి Hyderabad లో ఏర్పాటుచేస్తారని ఆశిస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

*Sri K. V. RAMANAYYA NAIDU :—Mr Speaker, Sir, now the Report is before us and we are asked to give our opinion about this. Our Andhra State has been the result of an effort made for over 40 years and on account of the sacrifice made by Potti Sreeramulu we got our Andhra State much sooner than expected. We are the pioneers for the formation of linguistic States in India and we hold the place of pride in inaugurating linguistic States as adumberated by the Report.

Now we see that the Prime Minister Nehru was against the formation of linguistic provinces. He was of opinion that the formation of linguistic provinces would go against the National spirit of India and it would lead to disintegration of the various people that inhabit the length and breadth of our Bharat Desa. He was also against the disintegration of Hyderabad for various reasons, but as he himself has admitted, after the S R.C Report has come out, he changed his opinion and he agreed to the disintegration of Hyderabad State. Now we see we are faced with a question as to what should be the name of our new State, whether it should be Andhra-Telangana as envisaged in the Report or it should be some other name. We find on reliable authority that our leaders of the residuary State of Hyderabad are also anxious and willing to change the name of Andhra-Telangana into some other name which would be acceptable to one and all. I believe that our Telangana leaders also are in favour of accepting 'Andhra Pradesh' as the name of the newly formed State from October of this year. If that is so, we shall all be glad. There is also another suggestion why it should not be called 'Telugu Pradesh'. Now the agitation for Andhra has been for over 40 years and we got Andhra State and so now this Andhra State is going to be implemented by adding certain portions wherein Andhras live. So, that being the case, this Andhra State is the basis of the new extended State and

as such, I think we would be able to pursuade our Telangana leaders to accept the name 'Andhra Pradesh' as the name of the new State.

After the State is formed, we are faced with certain difficulties. Just when the Andhra State was formed, the people of Rayalaseema entertained very grave doubts that the coastal people would come and invade upon their rights and that they would drown them and eclipse them That was the fear that was agitating their minds when the agitation for the formation of Andhra State was in full swing But now our friends have realised that not only did the coastal people did not eclipse them, but on the other hand, they feel that they are in a position to deal with the entire Andhra State, and that being the case, we can also inform our friends from Telangana area that the same doubts which they now entertain—and they want certain safeguards—were the same expressed by our Rayalaseema people. Now they are disillusioned about their fears. So also they will soon be disillusioned of their fears and the new leadership would realise that it is its duty to create confidence among all sections of the people and among all sections of the country. The new leadership will certainly try to realise the importance of winning confidence of all sections of the people and of all parts of the country. Certain safeguards have been provided in the new Bill itself. There are Regional Committees going to be appointed to safeguard their interests and Sri S B. P Pattabhirama Rao has expressed a fear whether it is going to be a Regional Committee for that part of the country or whether there is going to be another Regional Committee for this part of the country or for both parts of the new State. Whatever it is, from the report we find that it is intended more to safeguard the interests of the people living in that area and there is no harm in it. We need not be afraid of what is going to happen if we are going to be fair in our dealings, if we are going to be honest and just in our dealings, no section of the country, no section of the people need entertain any doubt about the partiality of the leaders whoever they be, whether it is from this part

of the country or from the other part of the country. When once we feel that we belong to one race, which speaks a common language, it is the duty of the leaders to treat it as one unit and treat all the people living in both the sections of the country as one race, as one people and do what is just and necessary to promote the common interests of one race.

With reference to the location of the capital at Hyderabad it is a ready-made city. After the separation of the Andhra State when we had to move away from Madras, we know the difficulties and troubles felt not only by the legislators but also by the members of the staff and their families It is very fresh in our memories and we can realise the gravity of those difficulties. So also here now, we feel that the location of the capital at Hyderabad should be done immediately as early as possible just before the schools and colleges reopen so that the members of the staff may not feel any difficulty of putting their children to school and if that is done as early as possible and if all the offices at Madras are located there, if they could also be conveniently transferred immediately before the end of June, that would be conferring a great boon on the services.

As regards the location of the High Court, the Bill says that the Hyderabad High Court is abolished and the High Court also has to be located at the place where the capital of the province is located. There is a suggestion that a Bench of the High Court should be located at Guntur and that the jurisdiction over Cuddapah, Kurnool and Anantapur should be transferred to the High Court at Hyderabad. This involves not only a lot of expenditure but also a lot of inconvenience and lot of trouble. If it is to be in two places, where is the Chief Justice to reside and how is he to have effective control over the administration of justice. There will have to be two Advocate-Generals, there will have to be two Government Pleaders and two Registrars and all these difficulties are there. So it is necessary that the entire High Court should be at the place where the capital of the

Government is located. Then only there is scope for better harmony, better co-ordination and better improvement and growth of cultural as well as educational and economic uplift of the place. Here, a fear is expressed by some of the Advocates at Hyderabad that all the High Court Advocates would migrate themselves to Hyderabad. The Advocates at Hyderabad who transact their business in Urdu feel that they would be under a handicap because better people and senior people would come and take up their place and that they would be affected I think their misapprehension is not well founded for this reason When they see seniors, leaders and better people practising in their places, it would be a good example for them to emulate them and come up to that standard which they see before their eyes and it would be to their advantage and not to their disadvantage at all. So it is highly desirable that there should be no Bench of High Court at Guntur. There are further difficulties also. Are these Advocates to keep two offices, one at Hyderabad and the other at Guntur ? Are they to keep two establishments, one there and the other at Guntur , and how, even if a Bench is formed, the Bench of the High Court changes from week to week or even if it changes once in a month, the Judges who form a Bench at Guntur will have to go back to Hyderabad. Are they to keep two residences, and two establishments ? I do not think that that is the intention of the framers or the people who wished such a state of things. So it is absolutely necessary that in the interests not only of the Andhra Advocates but even of the Advocates of Hyderabad, that the High Court should be in one and the same place and not in two places. The dignity of it would be gone, the prestige would be gone. The administrative effect of it will have to be considered if it is to be stationed in two places. So it should be at Hyderabad alone.

With reference to the formation of a Legislative Council, it has already been stated and we have seen from the various States that the Legislative Council acts as a sort of eye-opener to the actualities of the various situations that might arise in the Legislative Assemblies. At the time when our

Sri K. V. Ramanayya Naidu] [3rd April 1956

Indian Constitution was framed, our President Rajendra Prasad who was the President of the Constituent Assembly at the close said "Well we have prescribed so many qualifications for the people who are expected to carry out the provisions of the Constitution. If a doctor is to be allowed to practice he has to pass his M.B.B S., if a lawyer is to practice he has to pass B L. or LL B , and if a lecturer is to be appointed, he has to pass M.A , or Ph D., or D Sc., and even if a clerk is required to serve in the Collectorate he has to pass S.S L.C. and then pass the Public Service Commission examination and if a teacher is to be appointed he has to pass the training examination. So for each and every service, certain qualification is prescribed." He then posed a question before the members of the Constituent Assembly. " These are all people who are to carry out the provisions laid down in the Constitution in the various acts of the legislature, but what are the qualifications prescribed for the legislators themselves ?" He posed this question. The Constitution did not lay down any qualification for the legislators. The only qualification is that they must be above a certain age. That is the only qualification which the Constitution envisages. These constitute the Legislatures and all the legislation that is passed is to be carried into effect by people who are to qualify themselves in ever so many ways and he piously hoped that a day would come when the Government of India would take suitable steps to prescribe the necessary qualifications for the legislators themselves. In the Legislative Council, we will have expert Educationists, Scientists, Businessmen and all other people who cannot afford to fight an open competition in the general elections, and would be there available to give their mature advice and certainly this is a feature which we all should welcome.

[At this stage Mr Deputy Speaker occupied the Chair.]

Then there is a difficulty expressed by Sri S. B. P. Pattabhirama Rao with regard to Section 108 (2) which says that 'nothing in this section shall be deemed to prevent a competent authority, after the appointed day, from passing in relation to any such person any order affecting his

continuance in such post or office.' This is the most difficult and complicated aspect of the matter which we have to seriously consider About the services, we have got ever so many departmental heads There also, there are departmental heads How to integrate the services of this State with the new State. The Assembly is dissolved the High Court is dissolved but the services there are not dissolved, Then it is a difficult problem how to integrate these two services. That is a most difficult and complicated question, As is suggested by Sri Pattabhirama Rao, instead of trying to sit up and settle those questions afterwards, it is better to sit up and settle all those questions before the new State comes into existence because we have got one Chief Secretary there and another here and every departmental head is there as also here and the question remains as to who is to go or who is to be put in a particular position in the new set up. That creates a lot of trouble and this is not an easy matter and I feel that all the members of the services here are greatly perturbed. They are thinking over it and they are meeting together and the Central Government also asked them to meet and give their opinion. They are also having consultations and it is a matter which is not entirely in their hands. It is a matter which is in the hands of leaders. The leaders must try to safeguard their interest. Otherwise there will be discontent and dissatisfaction with the result that there would not be a settled state of things for the first one or two years. So this is a subject which requires attention.

Member after member was pleased to say that all the Andhras are brought together. I fail to see how all the Andhras are brought together. Only certain Andhras are brought together, but what about Bellary, what about Tungabhadra project. Tungabhadra project was started at a time when Bellary was in the Madras State. It is solely intended for the benefit of the Rayalaseema area. Bellary was never in Mysore for ages and Bellary was in Madras and never claimed by the Madrasis. It is claimed by the Andhras. Even though Misra Report was against it, the Fazal Ali Commission has seen the reasonableness of including Bellary

Sri K. V. Ramanayya Naidu] [3rd April 1956

and the other three Taluks in this area. It is not by the majority of the Telugu speaking but people alone also by affinity, by tradition and cultural aspects it forms part of Rayalaseema and it should be in it with a view to get greater control and effective management of the Tungabhadra project which is solely intended for the benefit of the Rayalaseema people. The Government of India have set at naught the report of the Fazal Ali Commission by saying that Bellary deserves to be part of Mysore. Here, I fail to see the logic and reasoning of the higher authorities. It is not quite consistent with the reasoning they have adopted for adding on Telangana to this area. So, hereafter, as our Deputy Speaker himself has suggested, we should not give up the fight for getting back Bellary where the Telugu-speaking people are in a majority. I also feel (subject to correction) that our leaders themselves are responsible for this state of things, because I hear there is a revised statement put in before the High Command viz., that we do not want those three taluks if we are given complete control of the Tungabhadra area and I believe, the present state is the result of adopting that attitude on the part of our leaders. If that is true, I am very sorry for the attitude taken by our leaders. I state that subject to correction If they had not exhibited that attitude, I think we would not have lost Bellary. Bellary people are very anxious. They were never part of Mysore, they never had any traditional connections with Mysore, they never had anything in common with Mysore and they were always part and parcel of Rayalaseema i e., Telugu-speaking people and so we should not give up our attitude to fight for getting back Bellary. Introducing this Bill, the Chief Minister said 'let us not create trouble, let us nct create bad-blood, let us as far as possible go on the line of least resisience'. I think this attitude is mainly responsible for the present state of things. We must get what is our due. We must fight for them. Why should we care for the feelings of others. If our claims are unjust, certainly we can be made to realise them. When our cause is just and honest, why should we not fight for it.

With reference to the Districts in the north, like Parlakimidi and other places, there is of course a provision in the Bill itself for the appointment of a Boundary Commission and what the functions of the Boundary Commission would be, God alone knows. But it can be an eye-wash for the time being and when once Telangana State is formed, it may practically be given the go-bye. That being the case, we should not give up our attempts and our claims for including the three Taluks of Bellary where the Telugu-speaking people constitute a majority of population and we should fight to the last by peaceful means, by constitutional means, and by every possible means and strive and get back at least those three taluks so that we may have complete control over the Tungabhadra project area. The complete control should be with us because it is intended for our use, it was constructed at the cost of the composite State when Mysore State was a different State altogether Why should we not have it and claim it as our legitimate right ? So with these few remarks, I suggest that the Legislative Council may be decided upon, High Court should be at Hyderabad and then we should not give up our fight so far as Bellary is concerned. With these few observations I support the passing of this Bill with the modifications indicated above.

Mr. DEPUTY SPEAKER —ప్రేక్షకులు కరతాళధ్వనులు చేయకూడదు. అట్లు చెసినయెడల వారిని బైటకు పంపవలసివస్తుంది.

SRI M. NAGI REDDI ·—ఉపాధ్యక్షా! ఎన్నో సంవత్సరములనుంచి ముక్కోటి ఆంధ్రులు కలలుకంటూయున్న విశాలాంధ్ర నిర్మాణం జరగబోతూయున్నందుకు సంతోషపడని ఆంధ్రులు ఎవరూ ఉండరనుకుంటాను. అంతేకాదు. భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణమునకై మనము అకుంఠితదీక్షతో కృషిచేసి, ఆంధ్రరాష్ట్రం సాధించడమేకాకుండా భారతదేశమంతటికీ మనం ఆదర్శప్రాయులమైనాము. కేంద్రప్రభుత్వం ఫజులాలీ కమిషన్ నియమించింది. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడానికి మనం నాందిగా ముందుండి పనిచేశాం. ఇది మనం గర్వించవలసిన విషయం. విశాలాంధ్ర అనే పేరు లేకపోయినప్పటికీ తెలుగు ప్రజలందరితో కలసిన ఒక రాష్ట్రం సాధించుకోగల్గడం మనం గర్వించదగిన విషయము. మొదటినుంచీ కేంద్రప్రభుత్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖత చూపడంలేదు.

Sri M. Nagi Reddi] [3rd April 1956

మరల ఈ Zonal Councils అని పేరుపెట్టి, ద్విభాషారాష్ట్రాలని పేరుపెట్టి, పూర్వపరిస్థితినే తీసుకురావడానికి చూస్తున్నారు. మనం ఈ భాషాప్రయుక్త రాష్ట్రాలు కావాలని ఎందుకు పట్టుబట్టామంటే మనభాష, విజ్ఞానం, సారస్వతం, కళలు, సంస్కృతి ఇవన్నీ రక్షించుకుంటూ, projectల విషయంలోగాని, ఇతర రంగాలలో పురోభివృద్ధి సాధించడానికి ఇటువంటి రాష్ట్రాలు ఏర్పడాలని పట్టు పట్టాం. బ్రహ్మాండమైన ఉద్యమం నడచినతర్వాత భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణావశ్యకతను విచారించడానికి ఫజులాలీకమిషన్ వేసిన తరువాత, వారు report తయారుచేసి, భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడే సమయంలో, మళ్లీ ఈ Zonal Councils అని పేరుతో అటువంటిరాష్ట్రాలు ఏర్పడినా లాభంపొందకుండా చేయ డానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు కొన్ని ఇబ్బందులు వివరిస్తాను. ఇప్పుడు మన రాష్ట్రంలో ఎరువుల factory స్థాపించాలని మనం కోరాం, మనం ఎరువులు విస్తారంగా ఉపయోగిస్తున్నాం కనుక ఆ factory మన రాష్ట్రంలో స్థాపింపబడుతుందని ఆశించాం. బొగ్గు బాగా దొరుకుతుంది కనుక మా రాష్ట్రంలో ఏర్పర్చమని హైదరాబాదువారు కోరారు. తమిళనాడు వారుగూడా అక్కడ స్థాపించవలసిందని పట్టుబడుతున్నారు. ఇట్లా తగవు లాటలు, పేచీలువచ్చినప్పుడు, ఈ పరిశ్రమలు స్థాపించడంలో Zonal Councils ఏమైనా పరిష్కారంచేయగలవా ? ఏ రాష్ట్రానికి ఏఏ పరిశ్రమలు ఇవ్వాలో, అవి ఎక్కడెక్కడ స్థాపించాలో Planning Commission వారు చర్చిస్తున్నారు. అలాంటప్పుడు ఈ Zonal Councils ఎందుకు ? రాష్ట్రాలమధ్య సుహృద్భా వానికిబదులు తగవులు భేదాభిప్రాయాలు, మనస్పర్థలు పెంచడానికి ఇవి దారి తీస్తాయి. ఈ ద్విభాషారాష్ట్రాల నిర్మాణప్రయత్నం కేంద్రప్రభుత్వం విరమించు కుంటేతప్ప, మరల అనవసర ద్వేషములకు అన్నిరాష్ట్రాలవారు లోనుకావలసి యుంటుంది. ఈ Bihar, Bengal విలీకరణ విషయంలో అప్పుడే అభిప్రాయ భేదాలు వస్తున్నాయని పత్రికలలో చూస్తున్నాం. తెలంగాణానాయకులు మన నాయకులతో సంప్రదింపులకై వచ్చారు. మన రాష్ట్రానికి ఆంధ్రప్రదేశ్ అని పేరు పెట్టాలా, తెలుగుప్రదేశ్ అనిపేరు పెట్టాలాఅనే విషయంమీద సంప్రదింపులు జరుగుతాయని తెలుస్తోంది. ఆంధ్రప్రదేశ్ అనేపేరు వినసొంపుగాఉన్నది. తెలుగు ప్రదేశ్ అంటే మళ్లీ ప్రదేశ్ సంస్కృతం అవడంవల్ల ఆ మాటకూ, ఈ మాటకూ అతకడంలేదు విశాలాంధ్ర కావాలని ఆందోళనచేశాం. ఆ పేరువదలిపెట్టాం. ఇప్పుడు ఈ ఆంధ్రప్రదేశ్ అనేపేరుకు అందరూ అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. అలాగే High Court సమస్య విషయంలో నాగినేని వెంకయ్యగారు గుంటూరులో ఒక Bench ఉండాలన్నారు. కాని నేను ఎరుగున్నంతవరకూ Lawyers ఎవరూ

ఒప్పుకోవడంలేదు. దావాలు దాఖలుచేయడం. numbering the case అనేవి Chief Justice ఎక్కడుంటే అక్కడ జరగాలి అనుకుంటాను. అక్కడనుంచి మళ్ళీ ఈ బెంచికి విచారణకు రావాలి. హైదరాబాదులోఉన్న Vakils కొన్ని అనవసర అనుమానాలు పెట్టుకుని బాధపడుతున్నారు ఈ అభిప్రాయ భేదాలు లేకుండా ఒకటే High Court ఒకేచోటఉంటే దాని గౌరవం ఎక్కువగా ఉంటుంది.

రాయలసీమ, సర్కారు జిల్లానుంచివచ్చే వకీళ్లు, leading lawyers ఇంగ్లీషు బాగా తెలిసినవాళ్లు అవడంచేత file అంతా వారికే పోతుందేమో, తమకుఏమి మిగులదనే భయం తెలంగాణాలోకొంతమందికి ఉన్నప్పటికీ, మొదట్లో రాష్ట్రనిర్మాణం విషయంలో భేదాభిప్రాయాలు ఎట్లాఉన్నా, తరువాత ఎట్లా ఒప్పుకున్నారో అలాగే ఒప్పుకొంటారు అక్కడ భాష, సంస్కృతి, సంబంధాలు అక్కడ ఉంటాయి; ఇక్కడవి ఇటు ఉంటాయి. అందుచేత హైకోర్టును విడగొట్టడం ఎవరూ అంగీకరింప తగిన విషయంకాదు. ఈ విషయమై తెలంగాణా నాయకులతో మాట్లాడి, ఒకే హైకోర్టు ఉండేటట్లు ఏర్పాటు చేయాలని చెబుతున్నాను. Capital లో పని ఉండివెళ్ళిన ప్రజలు కోర్టులలోకూడా తమకు పనిఉంటే సమన్వయపరుచుకొనడానికి వీలుఉంటుంది. ఈ వేళ అనుభవిస్తూనే ఉన్నాము. కర్నూలులో Capital, గుంటూరులో హైకోర్టు, మద్రాసులో కొన్నిముఖ్యమయిన ఆఫీసులు ఉండడంవల్ల ప్రజలకు ఇన్నిచోట్లు తిరగడంవల్ల దుబారాఖర్చు ఎట్లా అవుతుందో చూస్తూనే ఉన్నాము. హైకోర్టు ఒక చోట, Capital ఒకచోట ఉండడం సరిఅయినదికాదు. Capital High Court ఒకేచోట పెట్టాలని కోరుతున్నాము. ఎన్నికల విషయంలో ఒక విషయం ప్రభుత్వదృష్టికి తీసుకురావాలి. 1957 లో తెలంగాణాలో ఎన్నికలు జరిగినపుడు ఇక్కడకూడా జరిపితే 5 సంవత్సరాలు ఉండవలసిన వాళ్లకు 3 సంవత్సరాలే అవుతుంది. అలాకాకుండా 1960 లోనే ఒకేసారి పార్లమెంటుకు ఎసెంబ్లీకి ఎన్నికలు జరిపినప్పటికి సరిఅయిన విషయంకాదు. 1957 లో ఎసంబ్లీకి పార్లమెంటుకు ఎన్నికలు జరిపి 1960 లో ఎసెంబ్లీకి ఎన్నికలు 1962 వచ్చిన తరువాత పార్లమెంటు ఎన్నికలుజరిపినా సరిఅయిన విషయంకాదు. దీనికి ప్రత్యేకమైన Amending Act తీసుకువచ్చి 2 సంవత్సరాలపాటు extend చేసి 7 సంవత్సరాలవరకూ పొడిగించవలసి వస్తుంది. Constitution ప్రకారం 5 సంవత్సరాలు తరువాత పదవులు పోతాయిఅని ఉన్నది. దీనిని మార్చాలంటే 1962 కు రెండు సంవత్సరాలు extend చేయవలసిన అవసరం ఉంటుంది. 1957 లో అన్నింటికీ ఎన్నికలు జరిగేటట్లుచేయాలని 1962 లో అంతా కలుసుకోడానికి సరిపోతుందని ప్రభుత్వం దృష్టికి తీసుకు

వస్తున్నాను Boundaries విషయంలో, మనకు కొన్ని ప్రాంతాల విషయంలో అన్యాయం జరిగిందిఅని నాకంటెముందు మాట్లాడిన సభ్యులు ప్రభుత్వ పక్షంనుంచి ప్రతిపక్షంనుంచి మాట్లాడిన వారు చెప్పారు. S.R.C. రిపోర్టులో తాలూకాను ప్రాథమిక Unitగా తీసుకోవాలని ఒకచోట, జిల్లాను Unitగా తీసుకోవాలని ఒకచోట, మరొకచోట ఆర్థికంగా సంబంధాలున్నాయని, వేరొకచోట ఎన్నాళ్లనుంచో ఉన్నదని చెబుతూ ఆంధ్ర దేశానికి వచ్చేసరికి అనేక విధాలుగా అన్యాయాలు జరిగాయి. ఇప్పటికైనా ప్రభుత్వం వెంటనే పునరాలోచించి Boundary Commission వేయించి ఒక ప్రాంతానికి ఆనుకొని ఉన్నప్పుడు కలవడానికి అవకాశాలున్నప్పుడు గ్రామాన్ని ప్రాథమిక unit గా తీసుకొని ఆ ప్రాంత జనాభానుబట్టి Boundary Commission పునర్విభజన చేయించి రాష్ట్రాలలో కలపాలనే విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. Boundary Commission ను వేసి గ్రామాలను unitగా తీసుకున్నట్లయితే మనకు రావలసిన భాగాలువచ్చే అవకాశంఉన్నది. Deputy Speaker సుబ్బారావుగారు మాట్లాడుతూ చెప్పారు. ఈ విషయం పరిష్కారం చేయకపోతే తప్పనిసరిగా అనేకగొడవలకు దారితీస్తుంది. ఆరనిచిచ్చుగా తయారవుతుంది, ఈ పరిస్థితులలో వైషమ్యాలు పెరిగిపోతాయి. వీటిని ప్రభుత్వం దృష్టిలోనికి తీసుకొని అమలు చేయాలని చెబుతూ Zonal Councils వేసే ప్రయత్నం విరమించుకోవాలని High Court ను రెండు బెంచీలుగా పెట్టే ప్రయత్నంకూడా విరమించుకోవాలని కోరుతున్నాను.

SRI T. JIYYAR DAS :—ఉపాధ్యక్షా, మన తెలంగాణా ఆంధ్ర నాయకులందరూ సమిష్టి కృషిచేసి ఇప్పుడు విశాలాంధ్రను సంపాదించినందుకు అభినందించవలసిన విధి మనపై ఉన్నది. మొదట కొన్ని సందేహాలతో ప్రారంభించి ఆ సందేహాలు హెచ్చుపెరిగి మనం, వారుకూడా దూరస్థులమయిన ఘట్టాలుకూడా లేకపోలేదు. సాధారణంగా ఒక రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నప్పుడు ఒక సమస్యను పరిష్కరించుతున్నప్పుడు వాదోపవాదాలు ఉండవచ్చును. వీటిని మంచి నిశితమయిన దృష్టితో ఈ సమస్యను పరిష్కరించిన పండిట్ గోవిందవల్లభపంత్ గారిని ముఖ్యంగా మనం అభినందించవలసిన విషయం, నామకరణం చేసినప్పుడే విశాలాంధ్ర అనే పదంతో పెద్దలు ప్రారంభం చేసినారు. అందులో సాంప్రదాయానికి చెందిన బ్రాహ్మణుడు, వృద్ధుడు, కొంచెం ఉపనిషత్తులలో అభ్యాసంఉన్న శ్రీ కాళేశ్వరరావు గారు కూడా విశాలాంధ్రము అనే పదాన్ని ముందు పెట్టుకొని ఈ ఉద్యమాన్ని ఇంతవరకు తీసుకువచ్చారు. ఈ పదం లక్షణ యుక్తంగా ఉన్నది. ఆంధ్ర అనే పదంగురించి ఉపాధ్యక్షులవారు చెప్పారు భారతభాగవతాల్లో ఈ పదప్రయోగం ఉన్నది. విశాలాంధ్రం అనేపదం విశాల దృక్పథానికి తోడ్పడేది కనుక సభ

ష్ఠణంగా ఉందని చెబుతున్నాను. అయితే కొంతమంది వాస్తు శాస్త్రజ్ఞులు, జ్యోతి శ్శాస్త్రజ్ఞులు దీనిలో కొంచెం అశ్లీలం ఉన్నదని మనవిచేస్తున్నారు. దీనిలోనికి వెళ్ళకుండా తెలుగుభాష నే ప్రాతిపదికగా తీసుకొని ఈ రాజ్యాన్ని సంపాదించాము కనుక తెలుగునాడు అని అంటే బాగుంటుంది. తెలుగు, నాడు, రెండూ తెలుగు పదాలే, పూర్వకవులు చెప్పారు. "దేశభాషల కెల్ల తెలుగులెస్స" అని. తెలుగుయందు మోజు ఉంటే, మురిపెం ఉంటే ఈ దేశం తెలుగు ప్రాతిపదికమీద సమ్మతిస్తే తెలుగు నాడు అనే పదం సర్వ అంగీకారంగా ఉంటుందని ఆశిస్తున్నాను పేరు పెట్టుకునే టప్పుడు ముద్దు ముచ్చటకోసం పెట్టుకుంటాము. మన బిడ్డలకు పేరు పెట్టినప్పుడు ముద్దు ముచ్చటకోసం పెట్టుకుంటాము. మన బిడ్డలకు పేరు పెట్టినప్పుడు పిల్లవాడు ఎంత మురికిగా ఉన్నా పేరు మాత్రం శుభ్రంగా, మనోహరంగా ఉండేటట్లు పెట్టుకుంటాము. దీనిలో ఎవరి అడ్డంకు రాదని మనవిచేస్తున్నాను. తెలుగునాడు అనే పేరులో రెండు పదాలు తెలుగువే అవడంవల్ల ముద్దు ముచ్చట తీరేట్లు ఉంటుందని ఇరుగువారికి పొరుగువారికి అంగీకారంగా ఉంటుందని మనవి చేస్తున్నాను. అభ్యుదయమండలి లేక ప్రాంతీయమండలిఅని మనవారు చెబుతున్నారు. తెలుగు ప్రాంతాలను ఒకరి కొకరు దగ్గరగా చేర్చారు. ఈప్రాంతాలను చేర్చి నప్పుడు ముందుగా ప్రభుత్వంవారికి ఇతరులకు దృష్టిలో ఉండేవి రెండింటిని కలప డానికి bridge, road, రవాణా సౌకర్యాలు ఇటువంటివి చేయడానికి ముందుగా పూనుకుంటారు. కాని ప్రదేశంకంటే ప్రజలు ముఖ్యమని మనవిచేస్తున్నాను. మన కవులు చెప్పారు, ప్రదేశమంటే మట్టికాదు; ప్రజలు అనుకోవాలని, ప్రజలలో వెనుకబడిన ప్రజలున్నారని మనవిచేస్తున్నాను. వారిలో హరిజనులు ముఖ్యం. ఆంధ్ర దేశంలోని హరిజనుల ప్రసక్తి నాకు తెలుసు; అందరికీ తెలుసు. తెలంగాణా ప్రాంతంలో మరింత నికృష్టమైన స్థితిలో ఉన్న హరిజనులున్నారు. ఈ సోదరు లను పైకి తెచ్చి మనతో పాటు సమానమైన ప్రతిపత్తిలో ఉంచడానికి సాముదాయక మైన హరిజన సమస్యపై ఈ ప్రాంతీయ కమిటీలో statutory rules లో వాళ్లనుకూడా సముద్ధరణ చేయడానికి ఒక సూత్రాన్ని ప్రయోగించాలని శాసనసభద్వారా మనవిచేస్తున్నాను. తెలంగాణా నాయకులు ఆంధ్ర నాయకులను ఏ వరాలు అడిగినా ఆ వరాలు ఇచ్చారు. ఏ వసతి కావా లంటే ఆ వసతి ఇచ్చారు. ఈ వితరణశక్తి, ఔదార్యం ఆంధ్ర నాయకులకు తగినదని నేను కోరిన కోరికలు అడిగితే ఆంధ్ర నాయకులు వెనుకబడరని ఇటువంటి కోరికలు ప్రసాదించేటప్పుడు తెలంగాణా ప్రజలు మీతో సహకరిస్తారని అను కుంటున్నాను. అందుచేత ఈ యాచన ఈ సభలో చేయవలసివచ్చింది. "యాచనా మోఘా వ్యాం అధిగుణేన అధమే లబ్ధకామా" అన్నట్లు కలిసిపోయిన తరువాత ఇటు వంటి యాచనచేస్తే లభిస్తుందో లభించదో అనే నిరాశతో ఈరోజున ఆంధ్ర శాసన

Sri T. Jiyyar Das] [3rd April 1956

సభా ముఖాన ఈ కోరికను మనవిచేస్తున్నాను. మనపై గురుతరమైన బాధ్యత పడింది. ఒక రకమైన నాగరికతలో ఒక విశిష్టమయిన చరిత్రలో మనం ఉన్నామని, తెలంగాణా ప్రజలు భాషలోకాని, ఆర్థికంగాకాని, సాంఘికంగా, కాని వెనుకబడి ఉన్నారని ఈ సంఘాలవల్ల మండలులవల్ల తెలుస్తోంది.

మన సంస్కృతిని తెలంగాణా వారి సంస్కృతిని సమన్వయపరచవలసిన గురుతర బాధ్యత మనపై ఉన్నది. ఇటీవల "సంస్కృతి" శబ్దమును గురించి మన మిత్రులు శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారు వారికి ఇష్టము వచ్చిన ధోరణిలో ఒక ఉద్గ్రంథమును వ్రాశినారు. వారు ఏమి వ్రాసినప్పటికినీ ఉభయ ప్రాంతముల ప్రజలను సమైక్యపరచి ఒకేసంస్కృతిగల వారుగా రూపొందించవలసిన బాధ్యత మనపై ఉన్నది. ఇందుకు దోహదమిచ్చునది భాష ఒక్కటేనని నేను మనవి చేస్తున్నాను. ఆ భాషే తెలుగు భాష. మన తెలుగు భాషను నిర్దుష్టమయిన భాషగా మనము రూపొందించుకొనలేకపోయినట్లయితే ఈ నాడు గొప్పగా మనము చెప్పుకొనుచున్న మన సంస్కృతి మనలను వెనుకకు నెట్టివేయునేమోనను భయము నాకు ఉన్నది. మన రాష్ట్రమును "ఆంధ్ర ప్రదేశ్" అని పిలువవలెనని కొందరు బహుముఖాల సూచనలు చేస్తున్నారు మరికొందరు దీనిని "ఆంధ్ర ప్రదేశ్" అని పిలువవలెనంటున్నారు. ఐతే ఈ ప్రదేశ్ అనే శబ్దము హిందీ భాషలోని పదము అయిఉండవచ్చును. ఆంధ్ర అనేపదమును ప్రదేశ్ అనేపదమును కలుపగా వచ్చేది సంకర సమాసమే ఆంధ్ర ప్రదేశ్ అనునది. ఇట్టి సమాస ప్రయోగం మరే భాషలోనూ జరుగదేమో. ఐతే శ, ష, స, వర్ణముల ఉచ్చారణలో గల భేదాలను తెలుసుకొనక పోవుటచేతనే ఇట్టి సంకర సమాసాన్ని కొందరు సూచించి ఉండవచ్చు. కాబట్టి ఇటువంటి మాటలను ప్రయోగించక చక్కటి తెలుగు మాటలలో మన రాష్ట్ర నామమును పేర్కొని ఉభయ ప్రాంతాలలోని ప్రజలను చారిత్రకంగా, రాజకీయంగా, సాంఘికంగా, భాషా విషయకంగా, సమైక్య పరచుటకు ఇతోధికంగా అందరూ సేవ చేస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

[At this stage Mr. Speaker resumed the Chair.]

Sri T. JALAYYA:—అధ్యక్షా, రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ బిల్లుపై మాట్లాడుటకు నాకు సావకాశ మిచ్చినందులకు మీకు ధన్యవాదము లర్పిస్తున్నాను. ఆంధ్ర దేశముయొక్క నలు మూలలు ఇరుగు పొరుగు రాష్ట్రములలో కలసిపోయి పేరు ప్రతిష్ఠలు లేకుండా పోయిననాడు, మొట్టమొదట 1916 వ సంవత్సరంలో గుంటూరులోనే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ఆవశ్యకతను ఆ నాటి ప్రభుత్వము వారికి ప్రజలకు తెలియచేయుటకుగాను ఒక కమిటీని శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు

గారు ఏర్పాటు చేశారు. తదాది ఆంధ్ర రాష్ట్రము కావలెననే కోరిక దేశములో పెరిగినది. తరువాత దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఆంధ్ర రాష్ట్ర స్థాపనకుగాను ఎంతో కృషి చేశారు. 1939 వ సంవత్సరములో గుంటూరులో ఇందుకుగాను ఒక మహా సభను జరిపినాము. ఆ సభకు నేను ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా ఉంటిని. అప్పుడు మదరాసులో రాజాజీ ప్రభుత్వము ఉన్నది. ఆ ప్రభుత్వములో ఉన్న తెలుగు మంత్రులను సభకు రమ్మనమని ఆహ్వానిస్తే, రాజాజీగారు వారిని హాజరు కానవద్దని అనడంవల్ల ఎవరూ సభకు రాలేదు. శ్రీ ప్రకాశం పంతులు గారుకూడ మొదట సభకు వస్తామని చెప్పి తరువాత రాజాలకపోయిరి. అందులకు మేము ఎంతయో విచారపడితిమి. ఐతే అంతటితో ఆగక ఆంధ్ర రాష్ట్రము కావలెననే వాంఛ ప్రజలలో ఎక్కువై మహోద్యమముగా పరిణమించినది తరువాత 1946 వ సంవత్సరములో అప్పుడు ఒరిస్సా రాష్ట్రములో మంత్రిగా ఉన్న నేటి బొంబాయి గవర్నరు శ్రీ హరేక్రిష్ణ మెహతాబ్‌గారి అధ్యక్షతను తిరిగి గుంటూరులోనే సభ జరిపి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు ఎక్కువగా ఆందోళన చేసినాము. ఈ సభలు జరిగినందువల్ల ఆశీర్వచనములు లభించినవేగాని ఆశలు ఫలించ లేదు. తుదకు అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మబలిదాన ఫలితంగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. తదాది ఈ రెండు మూడు సంవత్సరములు మనము మన శక్తివంచన లేకుండా పరిపాలనను కొనసాగించుకొంటూ పోతున్నాము. ఐతే ఈ రెండు మూడు సంవత్సరములలో రాయలసీమ అభివృద్ధికి మనము ఎంతగానో కృషి చేయవలసి వచ్చింది. రాయలసీమ వాసులు తాము వెనుకబడి ఉన్నామని వారికి ఎన్నో వసతులు కల్పించవలసి ఉన్నదని ప్రభుత్వాన్ని కోరుతూవచ్చారు. రాయలసీమ అభివృద్ధికిగాను శ్రీ సంజీవ రెడ్డిగారు కంకణం కట్టుకొని పని చేస్తున్నారు. శ్రీ కృష్ణదేవరాయల కాలం నాటిచెరువులు, బావులు, ఈ నాడు వారు బాగు చేయించారు. అందుకు వారిని అభినందించవలసి ఉన్నది. వెనుకటి రోజులలో "సర్కారు ప్రాంతాలలో ధాన్యం పండితే వాటిని రాయలసీమవారు కొని భోజనం చేయవలసి ఉంది" అనే సామెత ఉండేది. అది ఈనాడు తారుమారయింది. ఈ సంవత్సరం కంభం, మార్కాపురం, చెరువులక్రింది భూములలో పండిన ధాన్యము దాదాపు రెండువేల బస్తాలవరకు గుంటూరు మార్కెట్టుకు అమ్మకానికి వచ్చినసంగతి తమకు మనవిచేస్తున్నాను. అంటే వెనుకబడిన రాయలసీమనుండి ఈనాడు ధాన్యం సర్కారుజిల్లాలకు అమ్మకానికి వచ్చేటటువంటి పరిస్థితులు ఏర్పడినవనే విషయాన్ని మనము గమనించవలసి ఉన్నది. అంతేకాకుండా దీనివల్ల రాయలసీమ ఎంతో వృద్ధి లోనికి వచ్చినదనికూడ మనకు తెలుస్తున్నది. సర్కారుజిల్లాలవారిని ఎవరూ చూడ లేదు. అందరూ రాయలసీమ మత్తులో పడిపోయినారు. అదికూడా సంతో

పించవలసిన విషయమే. ఈ రెండుమూడు సంవత్సరముల తరువాతయినా సర్కారు జిల్లాలు బాగుపడతాయి అని మేము అనుకొంటూఉంటే ఇప్పుడు తెలంగాణా వచ్చి మనమీద పడ్డది. వెంటనే తెలంగాణా అభివృద్ధి పరచవలసిన బాధ్యత మనందరి పైన ఉన్నది. సర్కారు ప్రజలు "గత రెండుమూడు సంవత్సరములు రాయల సీమను వృద్ధిచేసినాము; యికముందు తెలంగాణాను వృద్ధిచేయవలసి ఉన్నది; అట్టి స్థితిలో మన పరిస్థితి ఎట్లా ఉంటుందో అని ఈనాడు భయపడుతున్నారు. ఆంధ్ర రాష్ట్రము పెద్దది అవుతున్నకొలది సర్కారుజిల్లాలు వెనుకపడవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నవేమోనని భీతి చెందుతున్నారు. అయితే గట్టిగా చెప్పలేకుండా ఉన్నారు తమ్మునియిల్లు బాగుకోసమై అన్నయ్యయిల్లు పడగొట్టడంకంటే అన్నయ్య యింటిని ఇంటిగానే వుంచి తమ్మునికి మంచియిల్లు కట్టడానికి ప్రయత్నంచేయవలె నని నేను మంత్రివర్గమువారిని కోరుతున్నాను. మన ముఖ్యమంత్రి గోపాలరెడ్డి గారు మంచి వర్తకుడని చెప్పవచ్చును. ఐక్య కాంగ్రెస్‌పక్షం ఏర్పాటుచేసే సమ యంలో "ఏమయ్యా, మీ గోపాలరెడ్డిగారు వర్తకునికంటేకూడా ఎక్కువగా బేరమాడుతాడు, అన్నీ యిచ్చినట్లే కనపడుతాడు, కడకు ఏమీ ఇవ్వకుండా మనుష్యు లను వశపరచుకున్నాడు" అని రంగాగారు అంటూ వుండేవారు.

The Hon. Dr. B. GOPALA REDDI.—నేను మంచి వ్యాపారస్థుడను కాను.

Sri T. JALAYYA.—ప్రజాస్వామికానికి సంబంధించిన వ్యాపారంలో బేరమాడగల మంచివర్తకునిగానే మనము గోపాలరెడ్డిగారిని ఎంచుకోవచ్చు. ఏమయి నప్పటికినీ సర్కారుప్రజలకు ఎట్టి యిబ్బంది కలుగకుండా చూస్తారని నేను విశ్వసిస్తున్నాను.

మనము మదరాసునుంచి కర్నూలుకు వచ్చాము. కర్నూలులో కళాభిరుచిని పెంపొందించే సంస్థలంతగా లేవు. సంగీతం లేదు, నాట్యం లేదు, అందువల్ల మన మంత్రులకు మదరాసుమీదనే ఇంకనూ ధ్యాస ఉంటూవున్నది. అందులో మన ముఖ్యమంత్రిగారు కళాప్రియుడు. అందువల్ల వారికి మదరాసుమీద ఎక్కువ ప్రీతిగా ఉంటుంది. మనకు Hyderabad రాబోతున్నది కనుక మద్రాసుమీద ప్రీతితొలగి Hyderabad మీద మనసు లగ్నమవడానికి అవకాశముంది. మనము మద్రాసువైపు చూడకుండా మనరాష్ట్రంలోనేవుండే హైదరాబాదువైపు చూస్తే మన కళలను మనసాహిత్యాన్ని, పెంచుకోవడానికి ఎక్కువఅవకాశం ఉంటుంది. మన కళారంగాన్ని మనము వృద్ధిచేసుకోవడానికి ఎక్కువగా ప్రయత్నిస్తామని నేను నమ్ముతున్నాను. మన రాష్ట్రంలో ఏకమిటీ వేసినప్పటికికూడా మన-ఛీఫ్ మినిష్టరే

గారు మద్రాసువారిని ఆ కమిటీలలో ఉంచడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఐతే మద్రాసువారికంటే తెలివయినవారు ఆంధ్రరాష్ట్రంలో లేరా? వారికంటే మహానుభావులు ఆంధ్రరాష్ట్రంలో లేరా? మద్రాసువైపున్న ధ్యాసను Hyderabad వైపు మరలించుటకు ప్రయత్నించవలెనని కోరుతున్నాను.

SRI S. RANGANADHA MUDALIAR:—I request the Hon. Member not to be so harsh with Madras.

SRI T. JALAYYA:—నేను మద్రాసుపై ఎట్టి కఠినతా చూపడం లేదు. "అంపకాలలో తిన్న పిండివంటలు లంకణాలలో జ్ఞాపకం వస్తవి." అన్నట్లుగా నిన్న మొన్నటివరకు మద్రాసులోవున్న సౌఖ్యాలు అనుభవించి ఉన్నాము కనుక ఈనాడు వాటిని ఒక్కసారిగా మరచిపోవడం కష్టమని నా అభిప్రాయము.

హైకోర్టు విషయంగురించి చాలమంది పెద్దలు మాటలాడుతూ మన రాష్ట్రమునకు ఒకే హైకోర్టు వుండాలని రాజధానీ నగరంలోనే హైకోర్టు వుండడం అవసరమని తెలియచేశారు. ఆవిధంగా వుండకపోయినట్లయితే పరిపాలనకు సంబంధించినయిబ్బందులు వస్తాయని మనరాష్ట్రానికి ఒక ప్రధానన్యాయమూర్తి వుండాలా, లేక ఇద్దరు ప్రధాన న్యాయమూర్తులు వుండాలా అనేసమస్యలు ఉత్పన్నమవుతాయని చెప్పారు. ఎంతోకాలంగా సంయుక్తరాష్ట్రంలో లక్నోలో ఒక హైకోర్టు అలహాబాదులో యింకొక హైకోర్టుఉన్నాయి. ఈ విధంగా రెండు హైకోర్టులు ఉండడంవల్ల ఒక హైకోర్టుయిచ్చే తీర్పులకన్న యింకొక హైకోర్టుయిచ్చేతీర్పులు బాగుగా ఉండాలని జడ్జీలలో ఎక్కువ ఉత్సాహంఉంటుందేతప్ప రెండు హైకోర్టులు ఉన్నందువల్ల ఎప్పటికీ కష్టముండదు. అంతేకాకుండా కడప, అనంతపురము, జిల్లాలను హైదరాబాదు హైకోర్టుయొక్క జూరిస్‌డిక్షన్‌లో చేర్చినట్లయితే పరిపాలనకు తదితర విషయాలకుకూడ సౌలభ్యం చేకూరుతుందని నా అభిప్రాయము. కనుక గుంటూరులోఉన్న హైకోర్టును గుంటూరులో ఉంచితేనే క్షేమమనిన్నీ, ప్రజలకు సదుపాయముగా ఉంటుందనిన్నీ, పరిపాలనా విషయములో కూడ ఎంతో సౌలభ్యం కలుగుతుందనిన్నీ నా అభిప్రాయం.

మన రాష్ట్రంలో చిన్న ఉద్యోగస్థులు పెద్ద ఉద్యోగస్థులు చాలామంది ఉన్నారు. వారికిఇచ్చే జీతాలు చాలా తక్కువగా వున్నాయి. హైదరాబాదులోని ఉద్యోగస్థులకు యిచ్చేజీతాలు ఎక్కువ కనుక మన రాష్ట్రంలోని ఉద్యోగస్థులకు హైదరాబాదు రాష్ట్రంలో యిస్తున్న జీతాలనే ఇచ్చేటట్లు చేయవలెనని కోరుతున్నాను. లేనియెడల ఉద్యోగస్థులలో అసంతృప్తి ఏర్పడుతుందని మనవి చేస్తున్నాను. మన సేవకునికి కడుపునిండా అన్నంపెట్టి ఉత్సాహవంతునిగా చేస్తేనే

Sri T. Jalayya] [3rd April 1956

గాని అతడు పని సరిగా చెయడు. కనుక మన ఉద్యోగస్థులకుకూడ జీతాలుపెంచి, హైదరాబాదులోని ఉద్యోగస్థులతో సమానహోదాను కలుగచేయవలెనని కోరుతున్నాను.

దప్పికయిననాడే బావితవ్వుకొనుటకన్న ముందుగానే జాగ్రత్తపడుట మంచిది అన్నట్లుగా అక్టోబరు 2వ తేదీకి నూతనరాష్ట్రం ఏర్పడుతుంది. కనుక మనమందరము హైదరాబాదుకు పోవలసివున్నది. కనుక ఈ లోపలనే మన ఛీఫ్ శక్రటరీగారు, హైదరాబాదు ఛీఫ్ శక్రటరీగారు సమావేశమై మన ఆఫీసులకు కావలసిన భవనాలు, సిబ్బందికి కావలసిన సౌకర్యాలు ఏర్పాటుచేసుకోవడం మంచిదని నా సలహా. ఐతే నేను చెప్పదలచుకున్న విషయాలనుగురించి కొద్దిగామాత్రమే చెప్పగలిగినందులకు అధ్యక్షులవారు నన్నుమన్నిస్తారని ఆశిస్తూ నాకు ఈ అవకాశం యిచ్చినందులకు వారికి వందనములనర్పిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

* Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఆంధ్రుల స్వయంకృషి ఫలితంగా విశాలాంధ్ర ఏర్పడపోతున్నదన్నప్పుడు ప్రతి ఆంధ్రుడు సగర్వంగా సంతోషిస్తాడు. అందుకై కృషిచేసిన దేశభక్త కొండా వెంకటప్పయ్య, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, శ్రీ పొట్టి శ్రీరాములుగార్లకు నా ధన్యవాదాలు. మనము ఆంధ్రులము. ముక్కోటికిపైగా ఉన్నాము. ముక్కచెక్కలుగా మూడు భాగములల్లా, అయిదు భాగములు అయపోయినాము. కాకతీయుల సామ్రాజ్యమునాడు వరంగల్లులో ప్రారంభించిన కుండికలు, విభజన జరిగింది. ఈనాడు అంతే ఒకచోటుకుచేరే అవకాశంవచ్చింది. చాలా సంతోషమైన విషయము. ఆంధ్రప్రాంతములో ఉన్న తెలుగువారు అందరు అక్టోబరు ఒకటిన మహోన్నతమైన తెలుగుపండుగ చేసుకొంటామని అనుకుంటున్నారు. 1947 August 15న దేశములో స్వరాజ్యంవచ్చిందని అనుకొంటూవుంటే నైజాము ప్రజలు వారి ఖర్మము ఇట్లాకాలిందని సంస్థానాధిపతులక్రింద ఉండడమేనా, మాకు స్వరాజ్యములేదా అని విచారించవలసివచ్చింది. ఇది మనము జ్ఞాపకంఉంచుకొని వారందరినీ తీసికొనివచ్చినపుడే నిజమైన విశాలాంధ్ర అగుతుంది. ఇది దృఢపరచుకొనవలెను. వారందరినీ తీసుకొనివచ్చి ఉత్సవము చేయకలిగే రోజు రావలెను. ఈనాడు ఆంధ్రప్రభుత్వం హైదరాబాదులోఉన్న మంత్రివర్గం కేంద్రప్రభుత్వం మీాద తమ బలాన్ని వినియోగించి ఇంతకుముందు చేసినదానికన్న ఎక్కువ చెయ్యవలసిఉన్నది. ఆంధ్రకు అనుకొనిఉన్న ప్రాంతములు ఉన్నవి. 100 కి 50 వంతున ఎక్కువైతేఉన్నారో అక్కడఅంటే సిరివంచి, South baster, కోరాపుట్టు పర్లాకిమిడి, బరంపురం, వీటి గురించి Dhar Committee నివేదికలో

3rd April 1956] [Sri Vavilala Gopalakrishnayya

"The Telugus also claim in the north some portions of Chanda and Bastar in the Central Provinces, the latter being also counter claimed by Orissa and Maharashtra". అని వ్రాశారు.

ఆంధ్రులు ఈ ప్రాంతాన్ని కోరేరు. అంతే కాకుండా దానిని మహారాష్ట్రులు కూడా కోరేరు. ఈనాడు శిరివంచ మహారాష్ట్రులకు పోయింది. బస్తరును, మహారాష్ట్రులు, Orissa వారు కోరేరు. కాని కొత్తగా ఏర్పడిన మధ్య ప్రదేశ్ కుపోయింది. ఏ విధముగా జరిగిందో నాకు తెలియదు. Claim లేని వారికి ఇచ్చేరు. Claim ఉన్నవారిని Disclaim చేశారు. తరువాత Berhampore. Koraput ఇవి అన్నీ గూడఉన్నవి. వాటిని గురించి ఈ విధముగా చెప్పేరు

"The northern boundary is also in dispute and may be the present boundary of Orissa and the Central Provinces or it may be a line drawn from some point near Rishikulya River in Orissa upto the south of Indravati in the Central Provinces carring through portions of the present Ganjam and Koraput Districts of Orissa and of the Bastar and the Chanda Districts of Central Provinces as a future Boundary Commission may decide".

అని ఒక నిర్ణయముచేసి ఈ ప్రాంతాలను వారు Claim చేస్తున్నారు అనే అనుమానంఅయినా చెప్పకలిగినారు. గాని ఈ ప్రాంతాలను మార్చబోతున్నారు. కోరాపుట్టు మొత్తం ఆంధ్రప్రాంతము. అది రాకుండా పోవడానికి కారణం, ఆనాటి జయపురం మహారాజాగారు ఆయనకు రాజ్యంవస్తుందని సంతకం పెట్టడమే తరువాత మళ్ళి కలవడానికి అవకాశంవుంటే నేను తప్పకుండా ప్రయత్నంచేస్తాను అన్నారు. ఆయన ఇక పర్లాఖిమిడి గుణుపురం గురించి Atlee గారు ఈ విధముగా చెప్పారు.

"We have great sympathy with the desire of the Rajah of Parlakimidi for the inclusion of the Estate in the new Province, but in view of the racial on a linguistic Composition of the population therein contained, we are unable to recommend that his desire should be acceded to".

అని చివరికి పర్లాకిమిడిలో సగంమాత్రమే వారికి ఇచ్చేరు. ఆనాడు స్వతంత్ర ఉద్యమానికి వ్యతిరేకంగా ఉన్నందులకు పణాంగా ఇచ్చినట్టి పర్లాకిమిడి

ఈనాడు మనకు రావలయును. ఒకసారి Decision అయిపోయింది అంటున్నారు. అల్లరులు చేస్తే అల్లరి అంటారు. మర్యాదగా అడిగితే Effective voice లేవంటారు. ఈనాడు పర్లాకిమిడిలో ప్రజలు ఏడుస్తున్నారు. వారి కళ్ల నీళ్లు ఎప్పటికైనా తుడవగలమా ?

సత్యవేడు, హొస్నూరి, ప్రాంతాలవారు మనలను కలుసుకోనగలరా ? అని కొందరు అడుగుతున్నారు. మన ప్రాంతానికి అనుకొని 51% జనాభా ఉంటే మనకు రావలెను. హొస్నూరి, తిరువళ్లూరు, గుడియాత్తం, క్రిష్ణగిరి తాలూకాలో వేపనంపల్లి ఫిర్కా మనకు రావలెను. హోసూరు అడిగితే కోలారు రాదు. కోలారు లేదు కాబట్టి మీకు రాదు అన్నారు. కోలారు అడిగితే వారు అడుగడం లేదు. కనుక మీకు లేదు బళ్ళారి ఇస్తాము అన్నారు. బళ్ళారి అడిగితే బళ్ళారి భాషాప్రాంతము కాదు, కనుక మీకు ఇవ్వడానికి వీలు లేదు అన్నారు. చీతలందుర్గ, హిరాయదుర్గ, పావగడా మొలకలమూరు, బిల్లకరే, చౌపనహళ్లి ఉన్నవి. తుంకూరు జిల్లాలో కొదలుగిరి, మధురగిరి, దొడ్డబలాపూరు, బెంగళూరు సౌత్, నార్తు తాలూకాలు ఉన్నవి. ఇంత వరకు మనతో ఉన్న బళ్ళారి విషయములో భాషాప్రాతిపదిక కావలెనా లేకపోతే పరిపాలనా ప్రాతిపదిక కావలెనా అని శ్రీ పణిక్కరుగారు నన్ను అడిగారు. మాకు భాషాప్రాతిపదిక కావలెను, పరిపాలనా ప్రాతిపదిక అక్కరలేదని బళ్ళారి మాకు వస్తుందని బళ్ళారిని ఆనుకొని ఉన్న రూపనగుండ, మోకఫిర్కాలు ఆంధ్రలో చేరవలసి ఉన్నవి. బళ్ళారి మాత్రం ఇస్తాం వప్పుకుంటారా అని అడిగితే వ్యక్తిగతముగా నాకు అక్కరలేదు, మాకు తెలుగుప్రాంతం మాత్రము కావలెను అన్నాను. ఇప్పుడు basis మారిపోయింది. రాయచూరు మనకు రావలెను అప్పుడే నిజమైన ఆంధ్రం అగుతుంది. అంతవరకు మనము నిరంతర ఆందోళన చెయ్యవలెను. ఈ ప్రాంతాలను చేర్చినతరువాత వారికి అనుమానం ఉంటే Map తీసుకొని 50% తీసుకుని కలపండి. అనుమానం ఉంటే అప్పుడు బౌండరీ కమిషను వెయ్యండి.

తరువాత విషయం పేరు ఏమి పెట్టాలని ఆంధ్ర అనేదానికి మహోత్కృష్టమైన చరిత్ర ఉంది. తెలంగాణా వాటికి కూడా చరిత్ర ఉంది. ఇక్కడ 1921 లో No tax campaign ప్రారంభము అయినది. అక్కడ ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు ఆంధ్ర జనసంఘం అనేదాన్ని ప్రారంభించేరు. అప్పటిలో అక్కడ ఉన్న Police Tq. Col. Trench శ్రీ హనుమంతరావుగారిని పిలిపించి తెలుగుసంఘం అని పేరు పెట్టండి ఆంధ్ర అనే పేరు పెట్టవద్దు. మీకు ప్రక్కన పల్నాడు ఉంది అక్కడకు రైలు వేస్తున్నారు మీరు వారు కలిస్తే మీరు నైజామును వారు బ్రిటిషువారిని పడగొట్టగలరు. మీరందరు ఆంధ్రలో రాజ్యం స్థిరపరచుకొంటారు. ఆ మనోభావం బలపడుతుంది కాబట్టి సలహా ఇస్తున్నాను

ఆంధ్ర పెట్టవద్దు అన్నారు. శ్రీ హనుమంతరావుగారు 'ఆంధ్రజాతిని సజీవంచేయ దలచుకున్నాము, బ్రతకతలచుకున్నాం, ఈ బానిసత్వంనుండి బైటపడదలచుకున్నాం, ఆంధ్ర జనసంఘం అనేపేరు పెట్టుకుంటామని' చెప్పేరు. దానికే 1930 లో తెలంగాణా ఆంధ్ర మహాసభ అన్నారు అదే హైదరాబాదురాష్ట్రంలోని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘంగా కాంగ్రెస్ వారు యేర్పరచుకున్నారు. ఈనాటివరకు ఉన్నది, గ్రామాలలోకిపోతే ప్రతిగ్రంథాలయంపేరు ఆంధ్రభాషానిలయం అని ఉంటుందిగాని గ్రంథాలయం అనేపేరు ఉండదు. అక్కడ మహమ్మదీయులు హిందువులను తెలింగీ అంటారు. మహమ్మదీయులు కానివారంతా తెలింగీలే. వారు నవాబును కూలద్రోసి మనతో కలుస్తున్నారు కనుక మన తెలుగుసోదరులు "ఆంధ్ర" అనే పేరును అంగీకరించవలెనని హృదయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను. ఆంధ్ర అనిమాత్రమే ఉంచవలెనని కోరుతున్నాను.

తరువాత రాజధాని హైద్రాబాదులో ఉండడానికి ఎవరికి ఎలాంటి అనుమానాలులేవు. ఒక Office అక్కడ మరొక Office ఇక్కడ ఉండనవసరం లేదు. మనము ఒకప్పుడు విశాలాంధ్ర రావాలని అనుకొన్నాము. అక్కడికి మనము అన్నిటిని తీసికొని పోదాముఅని అనుకున్నాము ఈవాళ అవకాశము వచ్చింది. ఆఫీసులున్నాయా, సౌకర్యాలు ఉన్నాయా, లేవా అని ఆలోచించ నక్కరలేదు. అసౌకర్యాలు కొన్నాళ్లు పడినాకూడా బాధలేదు. కాబట్టి ఆఫీసులన్నింటినికూడా అక్కడికి తీసుకుపోదామని నేను మనవి చేస్తున్నాను.

తరువాత ఇది ఒక democratic Setup. దీంట్లో Legislative Council ఏర్పాటు చేయాలని తెలవిస్తున్నారు ఈ అజాగళస్తనాలు ఎందుకు? వీరు చేయగలిగినపని ఏమిటి? ఏమిలేదు. Constitutional గా ఎవరైన శాసనసభ చేసిన పనిని కాదనడానికి Legislative Council కు హక్కుఉన్నదా ఏమీ లేదు. వారు తీర్మానాన్ని ఆమోదించిన ఆమోదించకపోయిన మనతీర్మానము గెలిచి పోతుంది. ఎవరికి ఉపయోగపడుతుంది అంటే ప్రజలదగ్గరికిపోయి ఎవరికైతే ఎన్నికల్లో నిలబడటానికి దమ్ములేకుండా ఉందో వారు పార్టీ ప్రాబల్యానికో మరి దేనికో అక్కడ Decorative మెంబర్సుగా ఉండటానికి పనికివస్తారు. అంత తప్ప ఇంకొకటేమిలేదు. కాబట్టి ఈ Legislative Council అనేది అక్కర లేదు. ప్రజాస్వామ్యములో రెండవ శాసనసభ అక్కరలేదు. అట్లాంటి ప్రయత్నాన్ని ఆంధ్రులు చేయవద్దు. క్రిందటితడవ ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పుడు ఈ ప్రయత్నము చేయాలని తీవ్రంగా కేంద్ర ప్రభుత్వమువద్దకు వెళ్ళారు. వెళ్ళినప్పుడు అందరుకూడా వ్యతిరేకించారు. ఆంధ్రులుగా ఎవరుకూడా దానిని ఆమోదించవద్దని చెబుతూ నేను వ్యతిరేకిస్తున్నాను.

Sri Vavilala Gopalakrishnayya] [3rd April 1956

ఇక జోనల్ కౌన్సిలు, జోనల్ కౌన్సిలు యథాతథంగా ఉంటే ప్రమాదము లేదుగాని రెండు మూడు రాష్ట్రాలకు ఒక హైకోర్టు ఒక Governor ఉండే ఏర్పాటుతోను మనోతత్వముతోను ప్రభుత్వం జరుగుతున్నప్పుడు ఉత్తరోత్తరా ఈ జోనల్ కౌన్సిల్సునంటివి తీసేసి మొత్తము ఒకటే జోనల్ Provinco అయ్యే స్థితి భాషాప్రయుక్త రాష్ట్రములకు విరుద్ధంగా జరుగబోయ్యే ప్రమాదము దీంట్లో ఉంది గనుక దీన్నిమాత్రము ఒప్పుకోవటానికి వీలులేదు. అయితే Advisory అంటున్నారు. అయితే Constitution లో 262,263 Articles ప్రకారంగా వారికి ఇచ్చినటువంటి హక్కు యేమి దాంట్లోలేదు. తగాదా ఏదైనవస్తే దాన్ని పరిష్కారము చేయటానికి జోనల్ కౌన్సిలుకు హక్కుఏమి ఇవ్వలేదు. వాళ్లకు ఇచ్చిన హక్కులన్ని ఏమిటంటే Minorities తగాదావస్తే విచారించమన్నారు. Border తగాదావస్తే విచారించమన్నారు. అయితే ఈ జోనల్ కౌన్సిల్సు దేనితో ఏర్పడుతుంది? మనకు ఒరిస్సాతో వంశధార సందర్భములో నీళ్లతగాదాఉంది. తగాదాకంటేకూడా నీళ్లసంబంధముంది మహారాష్ట్రులతో గోదావరివల్ల మనకు వారికి నీటిసంబంధమున్నది. పాలారున్నది. ఇట్లాంటివన్ని ఉంటే AD Hoc-Committees ఏర్పడవలసి వస్తుందేగాని మొత్తముగా ఒకసారి జోనల్ కౌన్సిలు ఏర్పడితే సరిపోతుందంటారా. దీనికేమో Rotation President ఒకసారి Secretary, ఒకసారి తిరుగుతూ ఉంటారు. దీనికి memberలు ఎవరు? Chief Minister ఒకరు, మిగతా వారిని Governor వేస్తారు. గవర్నరు వీరిని appoint చేయడానికి మధ్యలో ఎక్కడనుంచి వచ్చారు, ఈ రంగములోకి? వీరిని appoint చేయడానికి ఆయన ఎవరు? అందులోను elected body యా అంటేకాదు. లేదా కాంగ్రెసువారు బలంగా ఉన్నటువంటి శాసన సభలనుంచి proportionate representation ప్రకారం గా ఇద్దరినో ముగ్గురినో వేసుకోమనండి. కాంగ్రెసు వారే రానివ్వండి. ఎవ్వరికి అభ్యంతరములేదు. People's repesentative అవుతారు గవర్నరంటే వ్యక్తిగతంగా నాకేమి అభిప్రాయభేదములేదు. ఆ system మీద నా అభిప్రాయం చెప్పుతున్నాను. అందువల్ల Governor ను నామినేటు చేయడం చాలా తప్పు. ఆ తరువాత Governer అధికారాలు తగ్గించాలి. Nominated member లను వేయడం మార్చాల్సిన అవసరముంది ముఖ్యమంత్రిగారు కూడా రీజనలు కమిటీలో విభిన్నాభిప్రాయం వచ్చినప్పుడు గవర్నరు కాకుండా కేంద్ర ప్రభుత్వమును ఆఖరు నిర్ణయం చేయడం బాగుంటుందన్నారు. కనుక దానిని గురించి ఎక్కువ సేపు నేను deal చెయను. Governor కు ఉండే Nomination అధికారము మనకు వారికి వచ్చేతగాదాను పరిష్కారము చేయ్యడానికి పనికిరాదు.

ఇకపోతే Regional Committees. వీటికి హక్కులు, అధికారాలు ఎంత వరకు ఉన్నాయో మన కింతవరకు చెప్పలేదు. మనమెంతవరకైన ఇవ్వటానికి సంసిద్ధముగానే ఉన్నాము కాని Democratic set up లో Constitutional provisions అన్ని పోగొట్టి మనము మరొక విధంగా తయారవటం మాత్రము నా కిష్టములేదు ఉదాహరణకు చెప్పుతున్నాను. పంజాబుయొక్క తగాదావేరు. మన తగాదావేరు. మనము ఆత్మబంధువులము కొన్నాళ్లపాటు ఎడబాటైనా కలిసేటటు వంటివారము. మన స్పర్ధతప్పితే వేరేమిలేదు. పంజాబులో నిరంతరంగా మీరామేమా అని పోట్లాడుకుంటున్నారు. వాళ్ళకూ Regional Committee వేశాము, మీకు వేశాము అంటున్నారు మిత్రులు చెప్పినట్లుగా హైదరాబాదు సంస్థలనుండి బయట పడిన ఆంధ్ర ప్రాంతానికి, Madras నుండి బయటపడిన ఆంధ్ర ప్రాంతానికి, ఇవతల నున్నటువంటి ఈ ప్రాంతానికి Regional Committeeయొక్క అవసరము లేదని నేను అనుకొంటున్నాను. వారికి Regional Committee పెట్టుతా మంటున్నారు. కాని వాటిహక్కులనుకూడా యిప్పుడే నిర్వచించేటట్లయితే బాగా ఉంటుంది. ఆనాడు రాష్ట్రపతి ఏదో నిర్ణయించవచ్చునని చెప్పినారే అది సరియైనది కాదు. ఇప్పుడే చెప్పితే మాకు ఒక అభిప్రాయము ఉంటుంది. ఇవ్వవద్దని చెప్పటంలేదు. ఎడబాటువల్ల వచ్చినటువంటి మనోతత్వ ఫలితము ఇంకా తరతరాలవరకు నిలవ ఉండేటట్టు చెయ్యవద్దని మాత్రము చెప్పుతున్నాను. ఫజులాలీ కమిషన్ యొక్క రిపోర్టు ప్రకారము 5 సంవత్సరాలే చాలునని ఉన్నది. ఈ నడుమ అనుమానాలను తీర్చుకోగలము. కాబట్టి 5 సంవత్సరాలే దీనికి వ్యవధి ఉండాలని ఆ తరువాత ఈ Regional Committee ఉండకూడదని నేను కోరుతున్నాను. Madras రాష్ట్రములో మన మున్నప్పుడు రాయలసీమకు అభివృద్ధి బోర్డు కావాలని పోట్లాడారు. రాయలసీమ board వచ్చింది. ఆంధ్ర రాష్ట్రము ఏర్పడింది మంత్రివర్గము వచ్చింది. 5 నెలలలో దానిని రద్దుచేసి వేశారు. దూరంగా ఉండడంవల్ల కొంత అనుమానముండవచ్చు. వారిది చాల backward area, వారికన్న మనమంతా కొంత advanced అని చెప్పవచ్చును. ఎవరైన సామాన్య రైతు కొత్త పొలము వస్తే తనకున్న పొలాన్ని అట్లాగే ఉంచి కొత్త పొలానికి ముందు బలముపెట్టి అది బాగా బలపడిన తరువాత దీన్ని దాన్ని రెండింటిని కలిపి అభివృద్ధిపరుస్తాడు. అందువల్ల ఈనాడు తెలంగాణాను అభివృద్ధి పరచడం మన ఆంధ్రజాతి ధర్మము, చేసి తీరవలసినటువంటి అవసరముకూడా ఉంది. అంతేకాకుండా ఈ రోజున వికేంద్రీకరణమువల్ల అభివృద్ధి కావలసిన పరిశ్రమలు అన్నీ అభివృద్ధి కావాలి. అందువల్ల తెలంగాణా అభివృద్ధికి మనమందరము కొన్నాళ్ల వరకు తప్పకుండా, అయితే ఉపవాసము చేసికొకుండా, ఉన్నటువంటి పరిస్థితుల్లో

సమానంగా వచ్చేటంతవరకుకూడా మనము ఎక్కువగాను ఉదారంగాను కృషి చేయవలసిన అవసరముంది. దానికేమి అనుమానములేదు.

తరువాత High Court Judges ను ఇక్కడనుంచి అక్కడికి అక్కడినుంచి ఇక్కడికి మార్పు చేస్తామన్నారు దీంట్లో ఒక ప్రమాదంకూడా ఉందని మనవి చేస్తున్నాను. ఇదివరకు మున్సబులను జిల్లా జడ్జీలను మార్చడానికి వీలుండేది. కాని High Court జడ్జీలు మాత్రము రాష్ట్ర ప్రభుత్వము చేతులో లేకుండా ఉన్నారు ఈవేళ అధికార వర్గానికి వ్యతిరేకంగా ఏదైన ఒక తీర్పు యిచ్చేటట్లయితే కేంద్రము దగ్గరికిపోయి వీరిని, ఇక్కడనుంచి అమాంతంగా transfer చేసే ప్రమాదముకూడా ఉంది.

పరిపాలనంతా మాతృ భాషలోనే జరగాలన్నది. ఈ వేళ నుంచి మనం నిర్ణయించుకోకపోతే లాభంలేదని చెప్పుతున్నాను.

ఎన్నికల విషయము వచ్చింది. ఎన్నికలు ఎప్పుడు జరుపాలని అంటున్నారు. నేను క్రిందటి తడవ ఆంధ్ర రాష్ట్ర మేర్పడినప్పుడు కోరిందదే. మద్రాసు రాష్ట్రము నుంచి మనం డినా ఆంధ్ర రాష్ట్రముగా యేర్పడుతున్నాము. అందువల్ల కొత్త elections పెట్టాలని చెప్పాను. రేపుకూడా మన మందరము కలువబోతున్నాము. అలాంటప్పుడు మన బాధ్యతలను మరువకూడదు. అందువల్ల సరాసరి ఎన్నికలకు పోదాము. ఖర్చవుతుందంటే Democracy లో ఉన్న ఖర్చెప్పటికి మీరు ఒప్పుకోక తప్పదు. Democracy యే చాలా costly affair. దాన్ని వదలిపెట్టేస్తారా Dictatorship ను ఎవరూ ఒప్పుకోరు. Dictatorship దీనికన్న ఖరీదెక్కువైంది. ప్రమాదమైనది. ఇది కంటికి అగుపడుతుంది. అది అగుపడదు. ఖర్చు అవుతుందని నేను Second Chamber పెట్టవద్దని చెప్పడము లేదు. Legislature పెట్టినపుడు ఖర్చు సమస్యలేదు. 30 లక్షల రూపాయలు అవుతుంది ఈ ఖర్చును భరించగలమా అనే సమస్య లేనే లేదు. ఈ వేళ ఒక Stable Government ఉంది గనుక సరిపోయింది. లేకపోతే క్రిందటి మాదిరే ఉన్నట్లయితే ఒక్క ఓటు లో వచ్చేటప్పుడు మంత్రులు, పోయేటప్పుడు మాజీ మంత్రులుగా ఉండే పరిస్థితే ఉంటే ఏమౌతుంది. ఆ విధంగా అయింది తిరువాన్కూరు కొచ్చినులో. 7 సంవత్సరాలు మనము ఎలక్షన్సు లేకుండా ఉంచాము. యుద్ధము వచ్చినప్పుడు, India Government అంతా అల్లకల్లోలంగా ఉన్నప్పుడు, 11 సంవత్సరాలు కేంద్రప్రభుత్వము మంత్రులను అలాగే ఉంచేశారు. మునిసిపాలిటి వాళ్లను 7 సంవత్సరాలుంచారు. శ్రీ జాలయ్యగారికి తెలుసు. మాకోదండయ్యా బాబూ అంటేకూడా ఉండండయ్యాఅని చెప్పారు.

ఆ పరిస్థితులలో ఇంత నూతనోత్సాహములో 7 సంవత్సరాలు మనము మరల ప్రజల వద్దకు ఎన్నికలకుపోకుండా ఉండాల్సిన అవసరములేదని, వెంటనే elections పెట్టాలని చెప్పుతున్నాను

మనము పెద్ద పెద్ద ఇర్రిగేషను ప్రాజెక్టులను అమలు చేయదలచుకున్నాము. వాటిల్లో ముఖ్యమైనది నాగార్జున సాగరు ప్రాజెక్టు. ఈ నాడు, ఈ ప్రాజెక్టుయొక్క నిర్వహణ ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రముల సమిష్టిపాలన క్రింద ఉన్నది. అందుచేత ఉభయ ప్రభుత్వాల ప్రతినిధులచే కేంద్ర ప్రభుత్వంతో సహా కలిపి ఒక కంట్రోలు బోర్డు ఏర్పాటు చేయవలసివచ్చింది. ఇక ముందు అటువంటి కంట్రోలు బోర్డు అనవసరం అవుతుంది. ఉభయ రాష్ట్రములలో ఒకే ప్రభుత్వం ఏ నాడు అయితే ఏర్పడుతుందో ఆ నాటి నుంచి ఈ కంట్రోలు బోర్డుయొక్క అవసరము ఉండదు. అత్యంత అవశ్యకమైన సందర్భాలు ఏవైనా ఉంటే, ప్రత్యేకంగా ఒక Ad-hoc committee ని నియమించి ఆ కమిటీయొక్క సలహాలు తీసుకోనవచ్చును కాని, ప్రత్యేకంగా Control Board అంటూ ఒక సంస్థ అనవసరము అని తెలియజేస్తున్నాను.

ఇక ఉద్యోగుల సర్వీసెస్ విషయము ఒకటి ఉన్నది. ఇది ప్రధానమైన విషయము. ఈనాడు ఆంధ్రరాష్ట్రములోని ఉద్యోగస్థులంతా గడగడలాడిపోతున్నారు. మద్రాసునుంచి మొన్ననీమధ్యనే వచ్చాము. "మాకు ఇంకా stability రాకపూర్వమే మరల అక్కడకు వెళ్లుతున్నాము. వెళ్ళుతున్న పరిణామమునకు మేము భయపడడములేదు. తరువాత మా విషయంలో ఏమిజరుగుతుందో హామీ ఇవ్వండి. అంతేకాని మేము అక్కడకురాము, ఇక్కడే ఉంటాము అనడములేదు," అని అంటున్నారు. ఈ విషయములో ఇంతకుముందు పట్టాభిరామారావుగారు ఒకటి చెప్పారు. అది మన constitution లో ఆలోచించవలసిన అవసరముకూడ ఉన్నది. ఎక్కడ ఉండేవాడు అక్కడే ఇకముందుకూడ ఉంటాడు. హైకోర్టు ఎగిరిపోయిందిగాని, Director of Public Instruction Chief Engineer ఇట్లాంటి అధికారులు అట్లాగే ఉంటారు. కనుక 108 వ క్లాజుకు ఒక మార్పు తీసుకువచ్చి, ఎవరికీ నష్టములేకుండా సవరించాలి.

చిన్న చిన్న భాషలు మాట్లాడేవారు గలిగిన ప్రాంతాలు చాలా ఉంటాయి. మనం అందరం కలసిఉంటే, మధురంగా ఉంటుందన్నారు. నిజమే కాని ఎప్పుడు అయినా జబ్బుగా ఉండగా, అతిమధురపువస్తువును తింటే చేదుపుట్టుతుంది. ఇప్పుడు ఇచ్చినటువంటి మధురమైన ప్రాంతంలోనే వారు, మనం ఉంటున్నాము, వాళ్ల భాష

Sri Vavilala Gopalakrishnayya] [3rd April 1956

మాట్లాడేవారు, సెకండరీ విద్యవరకు, 15, 20 మంది విద్యార్థులు ఉన్నట్లయితే, వాళ్ళభాషలోనే చదువు చెప్పబడుతుందని హామీ మనమిస్తే - భాషావివాదాలు మనలో మనకు రాకుండాపోతాయి. ఆవిధంగా చేసినప్పుడు అధిక సంఖ్యాకులుగా కలిసివున్న ప్రాంతాలవారంతా కలిసి ఒకే రాష్ట్రంగా ఏర్పడినపుడే మధురంగావుంటుంది. ఆంధ్రం మధురం, ఆంధ్రులం మధురం అవుతాం.

Assets and Liabilities లను రాష్ట్రములకు వదలినట్లయితే చాలా ప్రమాదములు వస్తాయని మనవిచేస్తున్నాను. ఉదాహరణకు తుంగభద్రాప్రాజెక్టు నిర్మాణమునకు ఖర్చు పెట్టిన డబ్బు అంతా మనదే. మనకు ఆంధ్రరాష్ట్రము రాకపూర్వము మద్రాసురాష్ట్రములో మనము ఉన్నప్పుడు, దానిక్రింద ఖర్చు అయిన డబ్బు అంతా లెక్కవేసి రివెన్యూ రిజర్వు అంతాకూడా మనం ఖర్చుపెట్టుకొని అప్పులతో ఇంటికివచ్చినాము. 17 కోట్లు కూడబెట్టుకొనిరావలసినది, 17 కోట్ల అప్పులతో వచ్చాము. ఆ డబ్బు అంతాకూడా తుంగభద్రాప్రాజెక్టుమీద ఖర్చు చేశాము. తుంగభద్రాప్రాజెక్టుమీద ఖర్చుచేయుడకు నష్టము అని చెప్పడములేదు. అందువల్ల ఇకమీద ఉమ్మడిరాష్ట్రము అయితే పునర్విభజన చేస్తారో, ఆ రాష్ట్రమునకు సంబంధించిన assets and liabilities మీద కేంద్రప్రభుత్వము బాధ్యత తీసుకొంటే, బాగుంటుంది. ఈనాటిరాష్ట్రంయొక్క ఆస్తి, అప్పులు కేంద్రం తీసుకొని, ఆయా భాగాలలో ఏర్పడిన రాష్ట్రాలకు అక్కడి ఆస్తి అన్వయించేటట్లు చేస్తే సుకరం కాగలదు కొత్తగా ఏర్పడిన రాష్ట్రములలో ఏఏ అప్పులు ఆస్తులు ఉన్నాయో, రిజర్వు ఆస్తులన్నీ వాళ్లకు చెందుతాయి, రాబడి అంతా afresh గా separate చేస్తాము అని చెప్పినట్లయితే తగాదాలు అన్నీకూడ సమసిపోతాయని నేను మనవిచేస్తున్నాను.

మనకు రాష్ట్రం రాబోతున్నది. అటు లేపాక్షినుంచి, పానగల్ వరకు, ఇటు శ్రీకాకుళంలో శాతవాహనగుండంనుంచి నాగార్జునసాగరంవరకు ఉన్న శిల్పకళలను, సంస్కృతిని మహోన్నతస్థాయిలోకి, తీసుకుపోయి, భారతదేశంలో ఒక ప్రధానభాగంగా ఉన్నతమైన ఆశయాలతో, నిజాయితీతో, నిరాడంబరంతో, అమరజీవి పొట్టి శ్రీరాములును నిజమైన స్మారకంగా యెంచుతూ ముందుకు పోయేట్లు ఆంధ్రరాష్ట్రమును నడిపిస్తారని కోరుతున్నాను. ఈనాడు మనకు ప్రాతిపదికగా మన చుట్టుప్రక్కలఉన్న ఆంధ్రులనుకూడా కలుపుకొని, భవిష్యత్తు ఆంధ్రసంపతి పేరుతో, నవ్యాంధ్రను నిర్మించడానికి మనం అందరమూ కంకణము కట్టుకొని, ముందుకునడుస్తారని ఆశిస్తూ, దానిని బలపరుస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

3rd April 1956]

SRI S. K. V. KRISHNAVATARAM :—అధ్యక్షా, చాలాకాలముగా వాంఛితమైన, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము, పూజ్యులు, అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మ బలిదానమువల్ల మనకు సంప్రాప్తము అయినది మరల వెనువెంటనే, ముక్కోటిఆంధ్రులుకూడా ఒకపరిపాలనక్రిందకు వచ్చేట్లు విశాలాంధ్రకూడా ఏర్పడిన ఈ తరుణములో, ప్రతి ఆంధ్రుడుకూడా (బయట రాష్ట్రంలో ఉన్నవారు కూడా) సంతోషించవలసి ఉన్నది. చాలా గొప్ప సంతోషకరమైన సమస్య ఇది. దానితోపాటు ప్రతి ఆంధ్రుని హృదయంలోకూడా ఇంకా కొన్ని ఆంధ్రప్రాంతములు మన ఆంధ్రరాష్ట్రములో అంతర్భాగము కాకపోవడం అనేది చాలా విచారకరంగా యున్నది ప్రత్యేకంగా జస్టిస్ మిశ్రాగారితో వేసిన అవార్డుకు దరిమిలా ఒక హైపవర్ కమిటీని కేంద్రప్రభుత్వంవారు వేశారు. ఆ కమిటీవారు బళ్లారి విషయంలో మనకు అనుకూలంగా తీర్పుచెప్పినప్పటికి ఆ తీర్పును నిరాకరించి బళ్ళారి ప్రాంతాన్ని మనరాష్ట్రంలో కలుపకపోవడం విచారకరమైన విషయము. ఈ విషయంలో శాసనసభ్యులుగాని, శాసనసభ్యులలో ఏర్పడిన మంత్రివర్గంగాని, ఆంధ్రప్రజలుగాని మనయొక్క protest ను record చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. వీటి నన్నింటిని మన ఆంధ్రరాష్ట్రంలో కలపాలని మనం విడువకుండా పోరాటాన్ని జరపాలి. ఈ రాష్ట్ర పునర్నిర్మాణసంఘంవారు సరిహద్దు సమస్యలను పరిష్కరించకపోవడం విచారకరం. ఇప్పుడే తగాదాలకు దారితీసేట్లు కొన్ని విత్తనములను చల్లడం జరుగుతున్నది. మనకు శాంతి ఎప్పుడో, ఈ సమస్యలన్నీ కూడా పరిష్కారం అవడంఅనేది ఆందోళనఅనేది మనలో ఇంకాపోలేదు. కాబట్టి త్వరితగతిని ఈ బౌండరీ సమస్యలను తీర్చడానికి ఒక కమిషను నియమించి, ఎంత త్వరగా సమస్యలను పరిష్కారంచేస్తే ఆంధ్రులకు ఇతర ఆర్థిక, సాంఘిక, సంస్కృతి కలిగి ఎక్కువ అభ్యుదయమునకు పాటుపడడానికి ఎక్కువ అవకాశములువుంటాయి. ఇదివరకుమాదిరిగా మనకు చాలా రాష్ట్రములు కాకుండా 15 రాష్ట్రములతో భారతదేశం అంతా విభజన జరగడముకూడా మంచివిషయము. చాలాసంతోషించవలసిన విషయము. కాని unitory territories కార్యక్రమములు త్వరితగతిగా సాగించాలి. ఈ రాష్ట్రంలో చారిత్రక, భౌగోళిక, సంస్కృతిని కల్పిస్తే, భారతదేశ స్థాపనం తయారవుతుంది.

ఇప్పుడు ఏర్పడిన విశాలాంధ్రకు ఏమి పేరుపెట్టాలా అనే సమస్య తేలకుండా ఉన్నది. ఆంధ్ర-తెలంగాణా అనేపేరు ఈబిల్లులో సూచించబడ్డది. ఈపేరు ఎంతమాత్రము వాంఛనీయముగా లేదు. అది మన ముక్కోటి ఆంధ్రులయొక్క ప్రత్యేకతను అంతాకూడా ఒకయూనిటీగా తీసుకువచ్చినప్పుడు ఇంకా ప్రత్యేకత ఆంధ్ర-తెలంగాణా ఏరియాలో separate tendency చూపించడం అనేది ఎంత

మాత్రం వాంఛనీయముకాదు. "ఆంధ్రప్రదేశ్" అనో "ఆంధ్రరాష్ట్రము" అనో పేరుపెడితే బాగుంటుందని నేను సూచిస్తున్నాను

హైకోర్టును హైద్రాబాద్‌లో ఏర్పాటు చేసినట్లయితే బాగుంటుందని ఈ బిల్లులో ఉన్నది. ఈ బిల్లును పురస్కరించుకుని హైద్రాబాద్ హైకోర్టును రద్దు చేయడం జరిగినది. నూతనముగా ఏర్పడబోయే మన విశాలాంధ్ర రాష్ట్రానికి కేంద్ర స్థానమయిన హైద్రాబాద్‌లోనే హైకోర్టును ఏర్పరచినట్లయితే బాగుంటుందని నేను సూచిస్తున్నాను. హైకోర్టు జడ్జీలయొక్క బదిలీలనుగురించి Constitution లో ఒక provision ఉన్నది. రాజస్థాన్ మున్నగు రెండు, మూడు రాష్ట్రములలో హైకోర్టు జడ్జీలకు జీతములు తక్కువగా ఉండడం జరిగింది. వారికి compensatory allowances యిచ్చేపద్ధతిని బదిలీచేయాలనేది యిందులో చేర్చడమైనది.

పూర్వం A, B, C రాష్ట్రములు ఉండేవి. అప్పుడు హైకోర్టు జడ్జీలను ఒక హైకోర్టునుండి ఇంకొక హైకోర్టుకు Transfer చేయవలసివస్తే A, B, రాష్ట్రాలలోని హైకోర్టులకు బదిలీచేయుటకు అవకాశముండేది. కాని ఇప్పుడు classification of the States అనేది రద్దు అయిపోయినది. ఇప్పుడు States, Union Territories అనేవి రెండు భాగములు క్రింద వచ్చుట వలన ఎలాంటి చిక్కు పరిస్థితులయినా కలుగుతాయేమోనని ఉద్దేశ్యంతోటి దీనిని ఏర్పాటుచేయడమైనది. ఇది ఇట్లాఉండడం మంచిదేనని నేను మనవిచేస్తున్నాను. మిత్రులు సుందరయ్యగారు ఏకారణంచేతనోగాని High Court Judges యొక్క transfers ను వ్యతిరేకించినారు. వారు అక్కడి పరిస్థితులను గమనించక పోవడమే దానిని వ్యతిరేకించుటకు కారణమనుకుంటాను. అయినప్పటికీ inter provincial transfers of high courts ను గురించి చాలా రోజులనుంచి ఉద్యమం ఉన్నది. Law journals చదివిన వారికి దానినిగురించి బాగా తెలిసి ఉంటుంది. ఇట్లాంటివి ఉండుట చాలా అవసరమని నేను 10 సం|| క్రితమే తెలుసుకొన్నాను. హైకోర్టు జడ్జీలు, చాలా కాలం ఒకచోటనే ఉంటేవారు, అన్యాయముగా ప్రవర్తిస్తుంటే వారిమీద చర్యతీసుకోకూడదా" అని సుందరయ్య గారు అడిగినారు. అట్లు చర్యతీసుకుందుకు ఏమాత్రంకూడ అధికారములేదు. రాజ్యాంగచట్టములోని 124 వ ఆర్టికిల్ ప్రకారం హైకోర్టు జడ్జీలను తొలగించుటకుగాని, ఇతర విధంగా చర్యలు తీసుకొనుటకుగాని President యొక్క Order ఉండాలి. President యొక్క Order ఉన్నప్పటికీ, both the Houses of the Parliament లోను హాజరయిన మెంబర్ల సంఖ్యలో మెజారిటీ ఉండాలి. Two Houses లోనూ 2/3 మెజారిటీఉంటే తప్ప

హైకోర్టు జడ్జిమీద క్రమశిక్షణచర్య తీసుకొనడానికి సాధ్యంకాదు. అందువల్ల హైకోర్టు జడ్జీలను బదిలీచేయడం ఎంతైన అవసరం. Justice not only to be done, but appears to be done అనేమాదిరిగా చెబుతున్నారు. సామాన్యముగా జడ్జీలు అందరూ bar లో practice చేసినవారే అగుటవలన, వారి Juniors అంతా వారిముందే appear కావలసివుంటుంది గనుక వారు ఏ విధంగా ఉన్నప్పటికిన్నీ ప్రజలలో మాత్రం ఫలానా advocate ఈ case ను తీసుకొన్నట్లయితే వనకు న్యాయం కలుగుతుంది అనే మంచి భావం కలుగుతున్నది.

ఈ zonal councils అనేవి harmless గా కనబడినప్పటికిన్ని ఇవి కలహాసంఘాలక్రింద ఏర్పడుతున్నప్పటికీకూడ అవి రానురాను "Engines of power and suppression" క్రింద మారతాయని నేను మనవిచేయు చున్నాను. Madras Legislative Assemblyలో ఈ zonal councils ను గురించి కొంతమంది oppose చేసినపుడు దీనివలన రాను రాను ఎటువంటి పరిణామాలు వస్తాయో శ్రీ సుబ్రహ్మణ్యంగారు వివరించిచెప్పినారు. గోదావరి, కృష్ణా, తుంగభద్ర నదులలోని నీరు ఏ ఒక్కరిసొత్తుకాదు. ఆ నీటిని ఉపయోగించు కొందుకు అందరికీ సమానహక్కు ఉన్నది. zonal councils ఉన్నట్లయితే వాటిద్వారా అలాంటి హక్కులను చలామణి చేసుకొనేటందుకు వీలుంటుంది.

SRI G. NARSIMHA MURTY :—వారు మద్రాసు పట్టణంయొక్క హక్కులను గురించి ఏమైనా చెప్పినారా ?

SRI S. K. V. KRISHNAVATARAM — కృష్ణా, గోదావరి, తుంగభద్రలలాంటివాటి నీటిని వినియోగించే నిమిత్తం zonal councils ఉన్నట్లయితే అలాంటి పనులను zone కంతకు ఉపయోగించే చోట్ల చేసుకొనుటకు వీలుగా ఉంటుందని వారు చెప్పినారు. ఇటీవల మనం Composite State లో నుంచి విడిపోయినాము. మనం Composite State లో ఉండగా మన ప్రాంతానికి ప్రత్యేకమయిన శ్రద్ధవహించలేదని, మనకు అన్యాయం జరిగిందని, ఆ ప్రాంతాలు ముందుగా అభివృద్ధిచెందినాయని నేను మీకు చెప్పుతూ నేఉన్నాను, ఇప్పుడు మనం ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పడి అభ్యుదయమునకు కృషిచేస్తున్న సమయంలో తిరిగి zonal councils పెడితే దానివల్ల ప్రతిబంధకాలు ఏర్పడతాయి. Joint family manager గా చాలాకాలం ఆ కుటుంబ వ్యవహారముల నన్నిటినీ చూస్తూ ఆ జాయింటుకుటుంబానికి డబ్బుఅంతా ఖర్చుపెడుతూ Partition వచ్చేసరికి, తానుకూడ ఒక వాటాదారుడుగా ఎట్లాగైతే తయారవుతాడో ఆ విధంగా మనం అనేకకష్టముల ననుభవించిన తరువాత ప్రత్యేకరాష్ట్రంగా

ఏర్పడిన తరువాత, మనదేశమును అభ్యుదయ పథంలోనికి తీసుకురావడానికి ప్రయత్నిస్తున్న సమయంలో zonal councils పెట్టినట్లయితే ఇవి రానురాను అనర్థాలకు దారితీస్తాయని చెప్పి నేను మనవిచేస్తున్నాను. Regional committees పెట్టినట్లయితే ఏమీ ఆక్షేపణలేదు.

Legislative councils లో మంచి అనుభవంగలవారు, Scientists, Engineers, Educationists గొప్ప విజ్ఞానము కలవారు ఉంటారు. ఆ councils అవసరమని కొంతమంది మిత్రులు చెప్పియున్నారు. కాని ఈ అసెంబ్లీలో అనుభవజ్ఞులు చాలామంది ఉన్నారు. ఈ అనుభవములను ప్రభుత్వం తీసుకొంటున్నదా ? మనం ఇంతమంది ఈ అసెంబ్లీలో ఎందుకు ఉంటున్నాము అని ఆలోచించుకుంటే దురూహ్యంగా ఉంటోంది. ముఖ్యమైన విషయాలలో అసెంబ్లీ మెంబరులయొక్క సలహాలను ప్రభుత్వం తీసుకుంటున్నదా ? ఇకముందు Legislative councils ఏర్పడిన తరువాత వాటియొక్క సలహాలను ప్రభుత్వం పాటిస్తుందా ! అని నాకు అనుమానంగా ఉన్నది. మనం ఇప్పుడు ఆర్థికంగా వెనుకబడియున్నాము. కాబట్టి కొన్ని సంవత్సరములవరకు కూడ మనకు ప్రత్యేకమయిన Legislative Councils ఉండడం అనవసరమని నేను అభిప్రాయపడుచున్నాను, మనం ఇప్పుడే bi-lingual, multi-lingual state అనేవాదమునకు ఒక decent burial ఇవ్వకపోయినట్లయితే ఇది ముందుముందు విషమసమస్యగా మారి అనేక ప్రమాదపరిస్థితులు ఏర్పడతాయి. Therefore, now and here only we must express our disapproval about this bi-lingual and multi-lingual States. ఇందాక zonal councils విషయమును గురించి చెప్పినట్లుగానే ఈ bi-lingual states అనేవి ఏర్పడినట్లయితే మనకు చాలా అనర్థకములు కల్గుతాయి. అందుచేత మనం దీనికి unequivocal గా విముఖులమని ఇప్పుడే తెలియపరచవలెనని మనవి చేయుచున్నాను. తరువాత linguistic minorities కు కూడా ఈ బిల్లులో provision ఉన్నది. (Article 350 లో ఉన్నది) ఇదికూడ మనకు అన్ని విధాలా అనవసరమని మనవి చేయుచున్నాను. ఇప్పుడు మనం ఆంధ్ర ప్రాంతంలో elections జరపడం అనవసరం. దీనివల్ల 7, 8 నెలలు administration upset అవడం జరుగుతుంది. మనం ఇప్పుడు deficit finance లో ఉన్నాము. 1960 వ సం॥వరకు మనకు elections అక్కరలేదు. తరువాత పరిస్థితులనుబట్టి చూసుకొనవచ్చును. ఇక ముందు మనం నాయకత్వమును పటిష్టంగా ఉండేటట్లు చేసుకోవాలి. ఆంధ్ర దేశంలో, విశాలాంధ్రలో మంచి కట్టుదిట్టమయిన నాయకత్వమునభివృద్ధి చేసుకొనవలసిన అవసరం ఎంతైన ఉన్నది. దీనికి నాయకులు బాధ్యత వహించాలి. శాసన సభ్యులకుకూడ జవాబుదారీ ఉన్నది.

3rd April 1956] [Sri S. K. V. Krishnavatharam

ప్రాంతీయ దురభిమానములు లేకుండా సమగ్రతగల, పటిష్టమైన నాయకత్వమును మనం ఏర్పాటు చేసుకొని పరిపాలన నిర్వహించినట్లయితే మొత్తం ఆంధ్ర దేశంలో గొప్ప రాష్ట్రంగా పేరు సంపాదించగలమని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI K. PUNNAYYA :—అధ్యక్షా, గత శతాబ్దమునుండి తెలుగు ప్రాంతాలన్నిటితో విశాలాంధ్ర ఏర్పడవలెనని ఆంధ్ర ప్రజానీకంయొక్క కోరిక. ఈ రోజు సఫలీకృతం అవుతున్నందుకు ఆంధ్ర ప్రజలు సంతోషపడుతున్నారు. అయితే విశాలాంధ్ర తోపాటు బళ్ళారి ప్రాంతాలు, ఉత్తరాంధ్రలో ఉన్నటువంటి బర్హంపూర్, పర్లాకిమిడి, కోరాపుట్టి ప్రాంతాలుకూడా ఈ సమయంలోనే విశాలాంధ్రలో కలుస్తాయనే ఆ ప్రజలందరూకూడా ఆశించారు. కాని మన బిల్లులో ఆ ప్రాంతాల ప్రసక్తి లేకపోవడంవల్ల అక్కడి ప్రజలందరుకూడా నిరాశాహృదయులై ఉన్నారనే విషయం ఆంధ్ర ప్రభుత్వం ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోవలసి ఉన్నది. ఇటీవల పర్లాకిమిడి ప్రాంతాలలో జరిగినటువంటి సంఘటనలు, అల్లరులు, దానిపై ఆంధ్రులు శిక్షింపబడడం మొదలైనవికూడా మన ప్రభుత్వం ప్రత్యేకంగా గమనించాల్సినటువంటి అవసరం ఉన్నది. ఆ విషయమై Lakshmana Das గారు ఇదివరకు అనేకసార్లు చెప్పి ఉన్నారు. ఆ ప్రాంతాలకు సభ్యులమైన మేముకూడా అనేకసార్లు చెప్పిఉన్నాను. కాని మన ప్రభుత్వం తగినటువంటి శ్రద్ధ చూపక పోవడం శోచనీయమైన విషయం. ఇకముందైనా ఏమరుపాటు చెందక ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. S.R.C. Report లో పర్లాకిమిడి విషయము, తదితర ఉత్తరాంధ్ర ప్రాంతాల విషయము తిరిగి చర్చించనవసరం లేదని తెలియచేసి ఉన్నారు. ఆ విషయంలో మన ప్రభుత్వంగాని మన శాసన సభ్యులుగాని ఏకీభవించరాదని, దానిని ఎదుర్కొని సాధించవలసి వుంటుందని నా అభిప్రాయం. Boundary Commission ను గాని లేక అటువంటిది ఇంకొక శేడ్డైనగాని ఏర్పాటు చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. పర్లాకిమిడి విషయంలో మనకు చాలా fair case ఉన్నది. Population దృష్ట్యాగాని, territorial contiguity దృష్ట్యాగాని లేక administrative convenience దృష్ట్యాగాని పర్లాకిమిడి తప్పకుండా ఆంధ్ర పాంతానికి చెందవలసిన అవసరం ఉన్నది. ఎందుచేతనంటే, అక్కడ తెలుగువారి జనాభా 60% కంటె, ఎక్కువగా ఉన్నది. Territorial contiguity ఉన్నది. ఇంకా administrative convenience కూడా ఉన్నది. అందువలన మిగిలిన ప్రాంతాల విషయం ఎట్లా ఉండినా పర్లాకిమిడిని ఆంధ్ర ప్రాంతంలో చేర్చవలసిన అవసరం ఉన్నది. ఈ విషయమై మన ప్రభుత్వం boundary question re-open

Sri K. Punnayya] [3rd April 1956

చేయటానికి ఒత్తిడి చేయవలసిన అవసరం ఉన్నది. కాబట్టి ఈ విషయమై ప్రభుత్వం ఎక్కువగా శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. Chief Minister గారు కూడా ఒకసారి ఆ ప్రాంతానికి రావాలని కోరుతున్నాను. ఒక ప్రక్కన తొందర పాటు వహించరాదు, అలజడి పడకూడదని చెప్పుతూ, రెండో ప్రక్కన అలజడి లేదు, ఆందోళన లేదు కాబట్టి ఆ ప్రాంతాలు మీకు రావని కేంద్ర ప్రభుత్వం చెబుతూ ఉంటారు. ఈ విరుద్ధమైనటువంటి అభిప్రాయాలతో ఈ సంవత్సరం కాలయాపనచేసి ఈ సమస్యనుగురించి ఏ మాత్రంకూడా శ్రద్ధ వహించకపోవడం చాల విచారకరం. కాబట్టి Chief Minister గారైనా లేక Deputy Chief Minister గారైనా, లేకపోతే ఇంకా ఎవరినైనా ప్రభుత్వం ప్రతినిధిగా పంపించి ఈ విషయం పరిశీలింప జేయించాలని ప్రభుత్వాన్ని, ముఖ్యంగా Chief Minister గారిని కోరుతున్నారు.

Zonal councils ను ఏర్పాటుచేసే సందర్భంలో ఒక విషయం చెప్ప దలచుకున్నాను. ఈ zonal councils వల్ల ఉత్తరోత్తరా చాల ప్రమాదకరమైనటువంటి సమస్యలు ఉత్పన్నమౌతాయేమోననే భయాందోళనను కొంతమంది మిత్రులు వెలిబుచ్చారు. Bilingual areas లో ఉన్నటువంటి ప్రజలయొక్క సాంస్కృతిక, వైజ్ఞానిక హక్కులను, వారికి సంబంధించినటువంటి Public Services హక్కులను సంరక్షించుటకు ఏదో ఒక council ను కేంద్ర ప్రభుత్వ అజమాయిషీ క్రింద ఏర్పాటు చేయడం అవసరం. Zonal Council అటువంటి హక్కులను సంరక్షిస్తుందనే నా అభిప్రాయం. ఉత్తరాంధ్రలో ఉన్నటువంటి ఆంధ్రులకు, ఒరిస్సాలోనూ, Public Services విషయంలోనూ, చాల అన్యాయం జరుగుతున్నది ఆ విధంగానే ఇతర ప్రాంతాలలో ఉన్నటువంటి ఆంధ్రులు minorities గా ఉండడంవల్ల, Public Services విషయంలో వారికి చాలా అన్యాయం జరుగుతోంది. ఈ అన్యాయాన్ని నివృత్తిచేసి వారి హక్కులను సమగ్రంగా రక్షించవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది. అక్కడ ఉన్నటువంటి రాష్ట్ర ప్రభుత్వమా. శ్రద్ధ తీసుకొనదు. మన రాష్ట్రానికా, అధికారంలేదు. కాబట్టి ఈ zonal council వేసినట్లయితే ఈ విషయమై శ్రద్ధ వహించి ఇటువంటి హక్కులు రక్షింస్తుదనే నా అభిప్రాయం. అయితే zonal councils ను ఏర్పాటుచేసే సందర్భంలో అందులో Chief Minister తో పాటు గవర్నరుచేత nominate చేయబడిన ఇద్దరు మంత్రులు ఉంటారని చెప్పబడి ఉన్నది. ఈ ఇద్దరు మంత్రులు గవర్నరుచేత ఎందుకు nominate చేయబడవలెనో, ఏ ప్రాతిపదిక ననుసరించి యీ విధముగా చేయడమో వివరించలేదు. అది ఏ మాత్రం మంచిదికాదని నా అభిప్రాయం Zonal councils లో యిద్దరు మంత్రులు Chief Minister

గారిచే ఎన్నుకొనబడినటువంటివారుగా ఉండడం మంచిదిగాని Chief Minister ను మినహాయించి గవర్నరే మరో ఇద్దరు మంత్రులను nominate చేయడం అనేది శోచనీయమైన విషయం. ఈ అభిప్రాయాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. Public Service Commission విషయమై ఒక మాట చెప్పి ముగించ దలచుకొన్నాను. ఏర్పడబోయే విశాలాంధ్రకు ఒక్కటే Public Service Commission ఉంటుందని చెప్పబడింది. మా అనుభవాల దృష్ట్యా Public Service Commission వారు చేసే recruitment విషయంలో ప్రత్యేకంగా హరిజనులకు చాల అన్యాయం జరుగుతోంది. కాబట్టి ముందు ఏర్పడనున్న Public Service Commission లో మా representative ఒకరు ఉండాలని నేను అభిప్రాయ పడుతున్నాను. విశాలాంధ్ర పరిపాలనావిధానంగాని, ఆర్థిక, సాంఘిక రాజకీయ ధోరణులన్నీ కూడా ఈ పద్ధతిలో ఉండటానికి వీలులేదు. పురోగమన దృష్టిలో అభ్యుదయకరమైన పంథాలో ఆర్థిక, సాంఘిక, వ్యవహారాలన్నీ నడుపబడతాయని, అందుకు అనుగుణ్యమైన నాయకత్వంవచ్చి తీరుతుందని ఆశిస్తూ నేను శెలవు తీసు కుంటున్నాను.

°SRI G. YELLAMANDA REDDI:—అధ్యక్షా! ఈ S. R. C. బిల్లు చర్చ విశాలాంధ్ర ఏర్పడబోయే శుభసమయంలో జరుగుతోంది విశాలాంధ్ర ఏర్పాటు చేయాలనే విషయంలో ఆంధ్రజాతికిగాని, తెలంగాణాలోఉండే ఆంధ్రు లకుగాని ఎవరికీకూడా భేధాభిప్రాయంలేదు. మొట్టమొదట కొంత ఇబ్బంది ఉన్నప్పటికీ, విశాలాంధ్ర ఏర్పడపోతున్నందుకు మనం అందరం సంతోషిస్తు న్నాము, అయినప్పటికి విశాలాంధ్ర ఏర్పాటు చేసుకొనే సమయంలో పరిష్కారం కానటువంటి సమస్యలు అన్నికూడా సరైన పద్ధతులలో అనుమానంలేకుండా పరి ష్కారం చేసుకోగలుగుతామని నేను ఆశిస్తున్నాను. ఆంధ్రరాష్ట్రంగాని, విశాలాంధ్ర గాని ఇవన్నీకూడా ఈ రోజున క్రొత్తగా వచ్చినటువంటి సమస్యలుకావు. గత 30, 40 సంవత్సరాలనుంచి మన జాతీయోద్యమంలో ప్రజాస్వామికంగా పరిపాలన సాగాలన్నప్పుడు భాషాప్రయుక్తరాష్ట్రాలు విభాగం అయితే నేతప్ప అటువంటి పరిపాలన నెలకొల్పడానికి వీలుండదు గనుక దేశవ్యాప్తంగా ప్రజలు ఆందోళన చేయబట్టి, ప్రజలందరి అభిప్రాయాలకు అనుగుణమైనటువంటి పరిపాలన స్వరూపం ఈ రోజున భారతదేశవ్యాప్తంగా ఏర్పడుతున్నది. ఒకటి, రెండు మినహాయింపులు ఉన్నప్పటికి మొత్తంమీద భారతదేశం భాషాప్రయుక్తసూత్రంమీద 15 రాష్ట్రా లుగా విభాగించబడుతూఉన్నది. ఇది అందరుకూడా సంతోషించదగిన విషయం. అయితే విశాలాంధ్రకు ఏపేరు పెట్టాలనే విషయంలో ఆంధ్రరాష్ట్రానికి సంబం ధించినంతవరకు ఎలాంటి భేధాభిప్రాయంలేదు "ఆంధ్రప్రదేశ్" అని ఉంటే బాగుం

Sri G. Yellamanda Reddi] [3rd April 1956

టుందని అందరు సూచిస్తున్నారు. అదేవిధంగా తెలంగాణా ప్రాంతంనుంచివచ్చిన సోదరులుకూడా ఆలోచించి అంగీకరిస్తారని, "ఆంధ్రప్రదేశ్" అనేపేరు తప్పకుండా ఉంటుందని ఆశించుచున్నాము. అందువల్ల ఆ సమస్యకూడా సక్రమంగా నెరవేర్చుకోడానికి వీలుఉంది.

తెలంగాణాలో చాలా కాలమునుంచి పాతుకొని ఉన్నటువంటి అనుమానాలు తీరడానికి, ఈ ప్రాంతీయ Council అనేది వారు కావాలంటున్నారు. కాని ఇదివరకు ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన సందర్భములో ఏ విధముగా అయితే కొంతమంది రాయలసీమ వాసులు తమ హక్కులు కుంటుబడిపోతాయని అనుమానిస్తూ ఉండిరో, ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత వాళ్ల అనుమానాలు తీర్చడానికి ఆంధ్ర ప్రభుత్వముగాని, అసెంబ్లీగాని ఏ విధంగా కృషిచేసిందో చూచినట్లయితే, ఇప్పుడు విశాలాంధ్ర ఏర్పడే సందర్భములోకూడ తెలంగాణాలో ఉన్నటువంటి సోదరుల యొక్క అనుమానాలు తీర్చడానికి ఈ ప్రాంతీయ Councils అవసరంలేదని వారు ఆచరణలో గుర్తించేటట్లుగా మనము చేయగలమని, ఆ రకంగా వాటియొక్క ప్రాముఖ్యత భవిష్యత్తులో తగ్గిపోగలదని నమ్ముచున్నాను. అయితే ఈ ప్రాంతీయ Council ను ఏర్పాటుచేసే సందర్భంలో, అది అసెంబ్లీమీద అధికారము చలాయించేదిగా ఉండకుండా, అసెంబ్లీయొక్క అభిప్రాయాలకు అనుగుణంగానే వారి హక్కులను రక్షించే పద్ధతిలో ఉండవలసిందేగాని, దీనికి మితిమీరిన ప్రాముఖ్యతను ఇవ్వవలసిన అవసరంలేదు. ముఖ్యంగా తెలంగాణా సోదరులుకూడా ఆ విధంగా కోరరని నేను భావిస్తున్నాను.

తరువాత Legislative councils గురించి చాలామంది చెప్పారు. ఇది కేవలం కమ్యూనిస్టుపార్టీవారు చెప్పడం కాకుండా, కాంగ్రెస్‌వాదులుకూడ అనేక మంది Legislative council అవసరంలేదని చెప్పడం జరిగింది. బొంబాయి అసెంబ్లీలోకూడ ఈ Legislative Council అవసరంలేదని తీర్మానంచేసినట్లు మన ముఖ్యమంత్రిగారు చెప్పారు. దాన్నిబట్టి మనకు రాబోయేటటువంటి విశాలాంధ్ర శాసనసభకు Legislative council అవసరంలేదని మనవి చేస్తున్నాను. తరువాత, ఈ Regional Councils, Zonal Councils, గురించి, తాత్కాలికంగా వీటియొక్క హక్కుల పరిమితులు కొద్దిగా చెప్పబడినప్పటికీ, మొత్తం మీదచూస్తే భవిష్యత్తులో ద్విభాషారాష్ట్రాలకు పునాదులు వెయ్యడానికిగాను ఇవన్నీ ఏర్పాటు చేస్తున్నారాఅనే అనుమానం అందరికి కలుగుతుంది. ఎందువల్లనంటె బొంబాయిలో ఈ సందర్భంలో ఎప్పుడైతే ఆందోళన జరిగిందో అప్పుడు కాంగ్రెస్ High Command వారు ఈ బహుభాషారాష్ట్రాలను వెనుకకుముఖం పట్టించాలనే ఉద్దేశంతో దేశంలో భాషారాష్ట్రాలు ఉండడం మంచిదని నిర్ణయం

తీసుకోడం, ఆ తరువాత దాన్ని దేశంలో ముందుకు తీసుకుపోడానికి అవకాశం లేనందువల్ల, మరల నిదానంగా భవిష్యత్తులో అలాంటి బహుభాషారాష్ట్రాలు ఏర్పడడానికి అనుగుణంగా ఆలోచనచేస్తున్నారనే అనుమానం తప్పనిసరిగా వస్తుంది. రెండు, మూడు రాష్ట్రాలకు ఒకేగవర్నరును పెట్టడము, ఒకే High Court పెట్టడము, అదేరకంగా ఇలాంటి Councils పెట్టడం ఇదంతా చూస్తే తప్పకుండా అటువంటి అనుమానంకలుగుతుంది. నిజంగా ఒక రాష్ట్రానికి, ఇంకో రాష్ట్రానికి మధ్య ఉన్న సమస్యలు పరిష్కారం కావలసి ఉన్నప్పుడు, ఆయారాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశంలోగాని, తాత్కాలికంగా ఏవైన కమటీలువేసి వాటి మూలకంగా గాని, అవి పరిష్కారం చేసుకోవచ్చు ఆ విధంగా కాకుంటే దేశాన్ని ఈ విధంగా 3, 4, భాగాలు చేసేదానికి ఇటువంటి councils ఏర్పాటుచేయడం ఏమాత్రం సబబుకాదు. దేశాన్ని మరల బహుభాషాప్రయుక్తరాష్ట్రాలుగా చేయడమంటే, దేశంలో ఇన్ని రోజులనుంచి కష్టపడి సాధించినంటి ఈ భాషాప్రయుక్త రాష్ట్రాల విభజన నిరర్థకమవుతుందని మనవి చేస్తున్నాను. కాబట్టి, బహుభాషా రాష్ట్రాలకు తీసుకుపోయ్యేటటువంటి ఏ కార్యక్రమాలనైనాసరే మన మందరము వ్యతిరేకించవలసినటువంటి అవసరమున్నదని చెప్పుచున్నాను. బెంగాల్, బీహారు అవన్నీ merge చేయాలని అనుకొన్నప్పటికికూడ, ఆచరణలో దానిలో వచ్చేసాధకబాధకాలు అన్నీ మనము చూస్తూనే ఉన్నాము ఈ రెండు కలసిపోవాలనే సందర్భంలో, అటు బెంగాల్ ముఖ్యమంత్రి రాయ్‌గారు మనము బీహార్‌తో కలిస్తే కొన్నిలాభాలు వస్తాయిఅనిన్నీ, ఇటు బీహార్ ముఖ్యమంత్రి సినాహాగారు మనము బెంగాల్‌తో కలిస్తే, మనకు కొన్ని లాభాలు వస్తాయిఅని చేస్తూఉండేటటువంటి వారి ఉపన్యాసాలు, statements చూస్తే, ఇది ఏమాత్రంకూడ ఐక్యతకు తోడ్పపద్ధతులలోలేవని, దేశాన్నిముందుకు తీసుకుపోయేపద్ధతులలో లేదని, స్పష్టమవుతుంది. అందువల్ల బహుభాషా రాష్ట్రాలను ఏర్పాటుచేయడానికిగాను వేసిన పునాదులనుగాని, అలాంటి ఉద్దేశాలనుగాని మనము వ్యతిరేకించవలసిన అవసరమున్నది. అందువల్ల ఈ Zonal Councils అనేవి అవసరంలేదని మనవి చేస్తున్నాను.

తరువాత High Court విషయం తీసుకొన్నప్పుడు, ఎప్పటికైనా ఒకే High Court ఉండాలి. రెండవది ఉండనవసరంలేదు. High Court, రాజధాని, ఇవన్నీకూడ ఒకే ప్రాంతములో ఉన్నప్పుడే, మొత్తం ముక్కోటి ఆంధ్రులయొక్క సంస్కృతిగాని, వాళ్ల విజ్ఞానంగాని ఒకేచోట అభివృద్ధి కావటానికి వీలుంటుంది. అందువల్ల ఏదోదగ్గరగా ఉంటుందనే ఉద్దేశ్యంతో రెండు High Courts పెట్టవలసిన అవసరంలేదని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా, భారతదేశంలో ఇక

మీదట రాజప్రముఖులు ఉండరనేది, ఈ S. R. C. Report వల్లగాని, ఈనాడు మనముందు ఉన్నటువంటి ఈ బిల్లువల్లగాని స్పష్టమైపోయింది. భారత దేశ ప్రజలందరుకూడ చాలాకాలమునుంచి ఈ రాజరికానికి వ్యతిరేకంగా, feudalism కు వ్యతిరేకంగా చేస్తున్నటువంటి ఆందోళనకు ఇది ఒక గొప్ప విజయము. ఈ Democratic State లో రాజప్రముఖులకుగాని లేక మరెక్కడ నుంచో వచ్చేటటువంటి వారికిగాని, అధికారము చెలాయించే హక్కు లేదని స్పష్టమయింది. మరి దేశములో ప్రజలు సాధించిన విషయాలలో ఇది చాలా ముఖ్యమైనటువంటిది. ఈ విషయంగురించి భారతదేశములో ఉండేటటువంటి ప్రజలందరు తప్పకుండా హర్షిస్తారని అనుకొంటాను.

తరువాత, ఈరోజు ఎన్నికలుగురించి చాలామంది చెప్పారు. మొన్ననే ఎన్నికలు జరిగాయి కాబట్టి ఇంత తొందరగా మరల ఎన్నికలు జరగాలా అంటె, ఇంత తొందరగా అయినప్పటికీ కూడా ఎన్నికలు జరగకుండా ఉండడంవల్ల వచ్చే ఇబ్బందులుకూడా ఉన్నాయి. ఎందువల్లనంటే, మళ్లీ తెలంగాణావాళ్లు 5 సంవత్సరములకు ఎన్నికలు ఉండాలని కోరినట్లయితే, మనము 7 సంవత్సరాలు ఉండవలసి వస్తుంది. అదేరకంగా పార్లమెంటుకు ప్రత్యేక ఎన్నికలు ఏర్పాటుచేయవలసిన అవసరమున్నదేమో! కాబట్టి వీటన్నింటినీ పునరాలోచించవలసిన అవసరమున్నదనుకొంటాను

ఇది భారతదేశంలో అనేక సంవత్సరములనుంచి సాగిస్తున్న ఆందోళనకు ఇది ఒక విజయమని, దీనివల్ల ముక్కోటి ఆంధ్రులు ఏకంగా ముందుకు పోవడానికి అవకాశముంటుందని మనవిచేస్తున్నాను. ముఖ్యంగా తెలంగాణావాసులకు కావలసిన హక్కులన్నిటికీ మన ప్రభుత్వము guarantee ఇస్తామని చెప్పిందిగనుక ఆ రకంగా భవిష్యత్తులో ఎవరికి ఏలాటి అనుమానాలు లేకుండా మన మందరము ముందుకు సాగిపోగలమని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI SHAIK MAHAMMAD RAHAMATHULLA :—అధ్యక్షా, మొదట మనరాష్ట్రముయొక్క పేరుగురించి రెండు, మూడు మాటలు చెప్పదలచుకొన్నాను. ఆంధ్ర-తెలంగాణా అనడం సరికాదు అది దేవుడు-అల్లా అన్నట్లు ఉంటుంది. అంతేగాక, రెండు ప్రదేశాలయొక్క పేర్లు కలిసి ఉండడంలో, ప్రత్యేకత శాశ్వతంగా ఉండిపోమంది అనేభావము నాకు కలదు. విశాలాంధ్రతోటి విశాలమైన హృదయాలుకూడ ఉండాలి. ఒకరినొకరు నమ్మి ప్రేమించాలిగాని అపనమ్మకాలు, సందేహాలు ఉంటే బాగుపడడం కష్టమవుతుంది. కనుక "ఆంధ్ర ప్రదేశ్" అని పెట్టడం మంచిదనే నేను అనుకొంటున్నాను. ఆంధ్ర-తెలంగాణా

అనేది ఏమాత్రం సమంజసంగాలేదు. రెండవది, వారికి ప్రత్యేక షరతులు అనడంలో అర్థంలేదు. ఒక్కొక్క ప్రదేశానికి ఈవిధంగా ప్రత్యేకషరతులు అన్నట్లయితే ఏ పనీ జరగడము సాధ్యంకాదు. రాయలసీమకు కొన్ని safeguards, తెలంగాణాకు కొన్ని safeguards, ఈ విధంగా వారు కోరినప్రకారము షరతులు ఉండడానికి వీలులేదు. తెలంగాణావారు ఆంధ్రతో చేరినందువల్ల మనరాష్ట్రము పెద్దదైంది. కాని, అనాదిగా మనలో ఒకరుగా ఉన్నటువంటివారిని, రాయలసీమలో ఒక అంగముగా ఉండినటువంటి బళ్లారిని మనం పోగొట్టుకొన్నందువలన మనకు మనమే ద్రోహముచేసినవారమైనాము. రాజకీయంగాగాని, భాషావిషయకంగాగాని, బళ్ళారి మనరాష్ట్రంలో చేరడం న్యాయము. కర్నాటకులు పెద్దగా అరచినందుకు దానిని మైసూరు రాష్ట్రానికి ఇవ్వడం అధర్మము. కనుక బళ్ళారిని ఆంధ్రలో కలిపేటందుకు తగుచర్య తీసుకోవలసిన అవసరమున్నది.

ఇక, High Court విషయములో ఎక్కడైనాగాని High Court అనేది ఒకటే ఉండాలి. దాన్ని ముక్కలుగాచేసి, ఒకటి ఒకచోట, ఇంకొకటి మరొకచోట పెట్టరాదు. High Court ను భాగాలుచేస్తే రాష్ట్రాన్ని భాగించినట్లు అవుతుంది గనుక ఒకే High Court ఉండవలెనని మనవిచేస్తున్నాను.

రాయలసీమవారికొరకు తుంగభద్రప్రాజెక్టు నిర్మింపబడింది. రాయలసీమలో కరువుకాటకాలు అప్పుడప్పుడు వస్తూ ఉంటున్నవి. కాబట్టి యీ ప్రాజెక్టును కట్టించమని యిప్పటికి యాభై అరవైసంవత్సరాలుగా ఆందోళనచేయగా చేయగా, చివరికి తుంగభద్రప్రాజెక్టును మనము నిర్మించుకుంటే, బళ్ళారి, దాని పరిసర తాలూకాలు తుంగభద్రప్రాజెక్టుప్రాంతము, ప్రాజెక్టుతోసహా మైసూరువారికి కట్టబెట్టుతున్నారు. ఈ ప్రాంతాలు వస్తాయని మైసూరువారు కలలోనైనా అనుకోలేదు. తుంగభద్రప్రాజెక్టు, బళ్ళారి, దాని సరిహద్దు తెలుగుతాలూకాలు మైసూరువారికి యిచ్చేటట్లయితే, రాయలసీమవారికి అపారనష్టము కలుగుతుందని ప్రభుత్వంవారికి తెలియదా? కాబట్టి యీ విషయములో మంత్రివర్గమువారు, ఆంధ్రనాయకులు అశ్రద్ధచేయకుండా, యీ ప్రాంతాలను ఆంధ్రరాష్ట్రములో చేర్పవలసిందని కేంద్రప్రభుత్వమువారిని ఒత్తిడిచేయాలని ప్రార్థిస్తున్నాను.

బళ్ళారిజిల్లా మొదటినుంచి రాయలసీమజిల్లాలలోనిదని అందరికీ తెలుసు. ఆనాడు నైజాముకాజ్యమునుంచి విడదీయబడిన నాలుగు జిల్లాలలో యిది ఒకటి. కాబట్టి యిది ఆంధ్రులదనే చెప్పకతప్పదు. దీనికి ఎవరూగూడ కాదనలేరు. బళ్ళారివారికిని తక్కిన రాయలసీమ జిల్లాలవారికిని మధ్య సంబంధబాంధవ్యములు,

వ్యాపారసంబంధములు ఉన్నవి. ఇప్పుడు కేంద్రమువారు వీటిని విడదీయడమువల్ల, ప్రజలకు చాలా యిబ్బందులు కలుగజేసినట్లగును. దీనితో కర్నాటకమువారికి ఎప్పుడూగూడ ఎలాంటిసంబంధము లేదు. ఆ జిల్లాలోని కన్నడతాలూకాలను యిచ్చివేసినప్పటికినీ, తుంగభద్రప్రాజెక్టు, దాని ప్రాంతము, బళ్ళారి, దాని సరిహద్దున ఉన్న మూడు తెలుగుతాలూకాలు, మోకా, గూపనగుడిఫిర్కాలతోసహా మనకు తప్పక రావలసియున్నవి. ప్రభుత్వము అశ్రద్ధచేయకుండా ఈ ప్రాంతాలను మనకు వచ్చేటట్లు కేంద్రప్రభుత్వముపై వత్తిడిచేసి, వీటిని ఆంధ్రలోకలిపేదాకా విడవవద్దని అంటున్నాను ఈ ప్రాంతాలను మైసూరులో కలిపినతరువాత అది కూడదని మనము తగాదా ఆరంభించాము ఈ సంగతి ఎటూ తేలనిపరిస్థితిలో ఉన్నాము. బళ్ళారిని తాత్కాలికంగా కలిపిననాటినుంచి మైసూరుప్రభుత్వమువారు బళ్ళారిలో ఉన్న ఆంధ్రులకు ఏవిధముగా అన్యాయముచేస్తున్నారో చెబుతున్నాను. ఎన్నో విధాలుగా trouble చేస్తున్నారు. అందులో ఒక చిన్న ఉదాహరణ చెబుతున్నాను. ఆంధ్రులకు, కన్నడిగులకు బస్సులవిషయములో ప్యాసువుండాలని ఏర్పాటుచేశారు. తెలుగువారికి ప్యాసులేకపోతే యీ భైరూపాయలు జరిమానా విధిస్తున్నారు. కర్నాటకులకు అయితే రెండురూపాయలే విధిస్తున్నారు. మైసూరువారియొక్క న్యాయాన్యాయములను యీ విషయము రుజువుచేస్తున్నవి. ఆంధ్రులని, కర్నాటకులని భేదములు ఏవిధముగా కనబరుస్తున్నారో అర్థమవుతున్నది. బళ్ళారిలో ఉన్న ఆంధ్రులు యావన్మందికూడా మైసూరువారి చేతులలో ఎన్నోవిధములుగా నలిగిపోతున్నారు. బళ్లారి విషయము, అటో యిటో యింకా తేలనేలేదు. ఇది తేలేలోగా ఆంధ్రులు యింకా ఎన్ని అవస్థలకు గురికావలసియున్నదో మనము ఎవ్వరము కూడ ఊహించలేకుండా ఉన్నాము. బల్లారి విషయములో అక్కడ ఉన్న ఆంధ్రులు ఏరోజుచూచినా యిక్కడ మన ఎసెంబ్లీహాలుచుట్టు, కర్నూలు చుట్టూ దినదినము దేహీదేహీ అంటూ తహతహలాడుతూ తిరుగుచున్నారు. కాబట్టి శాసనసభ్యులందరు బళ్లారి, దాని సరిహద్దుతాలూకాలు ఫిర్కాలు, తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతము అన్నీమనకు న్యాయముగా రావలసినవికాబట్టి యివి రావటానికి తమ ఏకగ్రీవాభిప్రాయమును తెలియచేస్తూ తీర్మానిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI U. RANGABABU :—అధ్యక్షా, ఎన్నాళ్లకో మనము కలగనిన విశాలాంధ్ర నేడు అవతరించడము ముదావహము. విశాలాంధ్రకొరకు ముందడుగువేసి నది శ్రీబూర్గుల రామకృష్ణరావుగారే. దీనిని ఎవరూకూడ కాదనలేరు. విశాలాంధ్రను ఏర్పాటుచేస్తున్నామని పండిట్ నెహ్రూగారు ప్రకటన చేసినతరువాత, తెలంగాణాలో ఏలాంటి దౌర్జన్యచర్యలు జరగకుండా కాపాడినరంగారెడ్డిగారికైతేనేమి చెన్నారెడ్డిగారికైతేనేమి, మరి యితరనాయకులకైతేనేమి, వారందరికి ముఖ్యంగా

ముందడుగువేసిన రామకృష్ణరావుగారికినీ, నాకృతజ్ఞతాభి వందనములు మనము ఆంధ్రదేశములో ఒక క్రొత్తనాయకత్వం ప్రకటిస్తున్నాము. ఇది చాలా తెలివిగల నాయకత్వం అని ప్రతిప్రభుత్వముకూడ గుర్తించగలిగింది ఏపేరు పెట్టాలి అన్నది నిన్న మొన్నటిదాకాకూడా తెలంగాణావారికి, మనకు మధ్య ఏకాభిప్రాయము కుదరకపోవడమువల్ల, ఉభయులపేర్లు కలిసివచ్చేటట్లుగా తాత్కాలికంగా "ఆంధ్ర తెలంగాణా" అని తెలంగాణావారు నామకరణము చేసియున్నారు. దీనికి కారణము ఉభయుల అనిశ్చిత తత్వమనే అనకతప్పదు. ఆంధ్ర అన్నా తెలంగాణా అన్నా రెండూ ఒకటే. ఈదినము ఉదయమున నేను రేడియోలో ఆంధ్ర-తెలంగాణా అనేపేరు వినడములో తప్పువిన్నానేమోనని అనుకున్నానుగాని ఆంధ్రప్రదేశ్ అని అందరూ ఏకగ్రీవముగా ఒప్పుకున్నట్లు వినిపించింది. ఈరోజున మన శాసనసభలో ఆంధ్రతెలంగాణాకాదు, ఆంధ్రప్రదేశ్ అని వుండాలని చెప్పడమువల్ల, రేడియోలోవిన్నది అబద్ధముకాదని నేను అనుకున్నాను. ఇక విశాలాంధ్రకు ఆంధ్రప్రదేశ్ అని ఉండాలో, మరొకపేరు ఉండాలో నేను కొంత యితిహాసముతో చెప్ప నుద్యుక్తుడగుతున్నాను. మన ఆంధ్రదేశమునకు "ఆంధ్ర" అను పదము చాలా ప్రాచీనమైనది. Magasthanes అనే చరిత్రకారుడుకూడా "ఆంధ్ర" అనే వ్యవహరించాడే గాని వేరుపేరున వ్యవహరించలేదు. ఆనాడు మొగల్ సామ్రాజ్యమునుంచి మనదేశము దాటినతరువాత ఆంధ్రదేశము చాలాపెద్దదనియు, గొప్పసైన్యముతో కూడుకున్నదనియు ఆయనవ్రాశాడు. అసలు తెలంగాణా అనే శబ్దమునకు తెనుగు అనె శబ్దమునకు గల భేదముఏమిటి ? ముందు తెనుగుశబ్దమునుగురించి చెబుతున్నాను. తెనుగుశబ్దము కేవలము భాషావిషయకంగా దాని తొలూకు ధాతువు మన తెనుగుభాషలో లుప్తమయిపోయినప్పటికినీ అది దక్షిణదేశమని అర్థమువస్తుంది, తెన్ అనేశబ్దమే తెనుగుగా మారింది. అదే రూపాంతరమయింది. ఇక పోతే తెలంగాణా అనే శబ్దమునకు అర్థము యేమిటంటే, మన తెలుగుదేశములో ఎన్నాళ్లక్రిందనో పశుపాలు ప్రాబల్యమువల్లనైతేనేమి, మరే యితరకారణములవల్లనైతేనేమి, శ్రీశైలం చాలా ప్రధానమైన క్షేత్రం అని అన్నారు. శ్రీశైలక్షేత్రానికి త్రిలింగము అని వాడుకవచ్చింది. అంటే త్రిలింగములలో శ్రీశైలప్రాంతములో ఒక లింగము స్థాపించబడ్డది. త్రిలింగశబ్దమే రానురాను "తెలింగ" అని వాడుకలోకి వచ్చింది. "తెలింగ" అనేది తెలంగాణా అయింది. ఈ విధముగా త్రిలింగశబ్దము తెలంగాణా క్రిందకు మారిందిగాని తెలంగాణా అనేది తెనుగు అనేది వేరువేరుకావు. తెలంగాణా అన్నా, తెనుగు అన్నా రెండూ ఒకటే. కాబట్టి నాయకులు అయినవారు వీటిని వేరువేరుగా ఉంచగూడదని మనవిచేస్తున్నాను. అయితే ఆంధ్రులదేశము పూర్వము నుంచి ఆంధ్రదేశమని, తెనుగుదేశమని, త్రిలింగదేశమని మూడుభాగాలుగా ఉండేది.

Sri U. Rangababu]                                                  [3rd April 1956

ప్రతాపరుద్రుని కాలమునాటినుండియూ సమగ్ర ఆంధ్రదేశానికి త్రిలింగదేశము అని పేరుపెట్టారుగాని, ఈశబ్దము వేరు ఉద్దేశ్యముతో వాడబడడములేదు. కాబట్టి ఈ త్రిలింగశబ్దమును మన కవులు సంస్కృతీకరించి మనదేశము మూడులింగాలుగలదేశము అని చెప్పారు. కాబట్టి యీదేశము త్రిలింగదేశము అయినా, ఆంధ్రదేశముఅయినా, తెనుగుదేశముఅయినా, అన్నీగూడ సమాన అర్థములనిచ్చేవే. అయితే కాలముగడచిన కొద్దీ ఆఖరుకు కృష్ణదేవరాయలవారి హయాములో తెలంగాణా అనే పదమును గూడ యిందులో ఒక ప్రాంతానికి చెందజేసినట్లుగా విష్ణుపురాణములో వ్రాయ బడియున్నది. కాబట్టి అప్పటినుంచి తెలంగాణా ప్రాంతం హైదరాబాదు ప్రాంతముగా వాడుకలోనికి వచ్చింది. కాని అది ఒక గూఢార్థముగా ఉన్న ప్పుడు, మనము త్రిలింగ అనిగాని, ఆంధ్ర అనిగాని, తెలుగు అనిగాని ఏదైనా ఒకపదము స్వీకరించాలని అంటున్నాను. ఆంధ్రదేశమయినా తెనుగుదేశమయినా, రెండూ ఒకటే. వేరేవేరే కాదు. తెనుగు భాషకు నిజమైన గాంభీర్యము రావాలి. దానికి సంస్కృత పదములు అక్కడక్కడ వచ్చుచున్న కారణముచేత నైతేనేమి, "ఆంధ్ర" అనే శబ్దము మీద మనకు మోజుకలిగి మనదేశములో మనయొక్క ఉద్యమములవల్ల నైతేనేమి, మరి యితర కారణములవల్ల నైతేనేమి, వాటి నన్నింటి కొరకుకూడ "ఆంధ్ర" అనే శబ్దమునే హెచ్చుగావాడుతూ ఆంధ్రులు వ్యవహారము చేస్తూ వచ్చారు. గ్రంథములలోకూడ పూర్వము మన కవులు "ఆంధ్ర" అనే శబ్దమునే హెచ్చుగా వాడుతూవచ్చారు. తెనుగు భాషనుగూడ సమా నముగానే వాడుతూ వచ్చారు. "ఉత్తర ప్రదేష్" అని, మధ్య ప్రదేష్" అనే పేర్లకు "ప్రదేష్" అనే పదము విహితమవుతుందేమోగాని, కేవలము మన రాష్ట్రానికి మాత్రము "ఆంధ్ర ప్రదేష్" అనే పేరే సరిపోతుంది. తెలంగాణావారికిగూడ ఈ పేరును ఒప్పుకోటానికి పెద్ద అభ్యంతరము ఉండ కూడదు. "ఆంధ్ర" అనే ఈ పదము, నిజముగా దానియొక్క ఉత్పత్తి, దానియొక్క ప్రభావం చూస్తే ఇది ఒక జాతినుంచి వచ్చింది. ఈ జాతి మొదటి కేంద్రముగా ఉన్నది, తెలంగాణా ప్రాంతము అనే గుర్తుపెట్టుకోవాలని అంటున్నాను. ఎప్పుడైనా నాయకత్వం ఏకచక్రాధిపత్యం క్రిందకు రావా లంటే, అది మన నదీ తీరాంధ్ర రాయలసీమలోగాని దేశములోగాని, రాలేదు. అది అంతాగూడ యిప్పుడు ఉన్న తెలంగాణా ప్రాంతమునుంచే వచ్చింది. మనము దీనిని గ్రహించవలసిన అవసరము ఉన్నది. ఆంధ్రశాతవాహనుల తరువాత, నిజముగా ఏక

ఛత్రం క్రింద, అంటేఒకటే గొడుగు నీడక్రిందకు తేబడినది కాకతీయ సామ్రాజ్యము. అప్పుడు వరంగల్లే దానికి రాజధాని. తూర్పు చాళుక్యుల కాలము నాడు అయితే నేమి, రెడ్డి రాజుల కాలమునాడు అయితేనేమి, ఏ ప్రాంతము అయినప్పటికినీ కాకతీయుల కాలములోవలె ఆంధ్ర దేశముఅంతా ఒక్క గొడుగు నీడ క్రిందకు రాలేదు. అది కాకతీయుల తరువాత గోలుకొండ కుతుబ్ సాహి చేతిలోకివచ్చి అటు తరువాత యిప్పటి హైదరాబాదు నవాబు చేతిలోకి వచ్చింది. కాబట్టి యీనాడు ఆంధ్ర దేశమునకు హైదరాబాదే Capital గా ఉంటూ అంతాకూడా సమగ్రాంధ్ర దేశము, స్వచ్ఛమైన ఆంధ్ర దేశము గనుక "ఆంధ్ర" అనేపేరు ఎందుకు పెట్ట గూడదు ? ఏ రాజకీయ కారణములచేత నైతేనేమి, యింక ఏ యితర కారణముల చేత నైతేనేమి "ఆంధ్రలో మేము కలవబోవడములేదు" అని తెలంగాణా నాయకులు చెబుతుంటే, ఆ విధముగా చెప్పడములోవారు పొరబాటు చేస్తున్నారేమోనని నా నమ్మకము. దానికి ఏమీ ఫరవాలేదు. "తెలంగాణము", "ఆంధ్ర" అనేవి సమాన భాగములు అయ్యేటప్పుడు యిక ఆంధ్ర అనే పదము యింతగా మనము కోరుతున్నప్పుడు వారుకూడ ఎందుకు దానిని అంగీకరించకుండా సంశయిస్తున్నారో నాకేమీ అర్థము కావడములేదు. ఈ కీర్తిగూడ వారికే దక్కాలి కాబట్టి "ఆంధ్ర ప్రదేశ్" అనేదికాకుండా "ఆంధ్ర" అనే పదమే వారు ఆమోదిస్తారని నా విశ్వాసము.

ఇకపోతే హైకోర్టు విషయము ఒకటి ఉన్నది. హైకోర్టుకు బ్రాంచి నొక దానిని ఏర్పాటు చేయాలని చాలామంది అంటున్నారు. హైకోర్టుకు వేరే బ్రాంచి ఎందుకో నాకు అర్థము కావడములేదు. ముఖ్యంగా మన మిత్రులు మంది చెప్పారు. అందులో రమణయ్యనాయుడుగారుకూడ ఉన్నారు. వారు కొంత చెప్పిన మాటలుకాదని చెప్పటానికి నాకు తాహితులేదు. నేను లాయరుని కాకపోయినప్పటికినీ కొద్దో గొప్పో చదువుకున్న వాణ్ణే గనుక తెలంగాణావారు ఎందువల్ల ఆ విధముగా చెబుతున్నారో నేను కనిపెట్ట గలను. హైదరాబాదువారు హైకోర్టుకు వేరే బ్రాంచి పెట్టుకోండి అని ఎందుకు చెబుతున్నారంటే, వారికి యితర కారణములు లేకపోయిననూ, ముఖ్యంగా హైదరాబాదులో ఉన్న లాయర్లకు profession తగ్గిపోతుందని భయము కలిగి, ఆ విధముగా చెబుతున్నారు. Lawyers' Profession లో నిజముగా శక్తి సామర్థ్యములు ఉంటే, అవి రుజువు చేసుకోవలెను. మనకు మాత్రము గుంటూరులో వేరే బ్రాంచి అవసరములేదు, హైదరాబాదువారు ఆ విధమైన సలహా ఇవ్వడము అవాంఛనీయము, పొరబాటుకూడా.

Sri U. Rangababu] [3rd April 1956

తరువాత Regional Council ఒకటి ఏర్పాటు చేస్తామని అంటున్నారు. ఇది ఉండకూడదనే నా భావన. కారణమేమిటంటే. S.R.C. Report లో పంజాబ్ మాదిరిగా తెలంగాణాకు ఒక Regional Council ఉండాలని సూచించారు. పంజాబులో భాషా విషయకంగానే గాకుండా, మత భేదములు ఉన్నవాళ్లు వున్నారు. నిజమే. ఆ కౌన్సిలు అక్కడ అవసరమైతే, కావచ్చు కాని యిక్కడ మాత్రము అందరము తెనుగువారమే గనుక మనకు Regional Council అవసరము లేదు. పంజాబు విషయములో యింకా వాద ప్రతివాదనలు జరుగుచున్నవి. ఆ విషయము యింకా తేలలేదు. అయినా అది అక్కడ సమర్థనీయ మేమోననుకుంటాను. గాని యిక్కడ తెలంగాణాకు ఆంధ్రులకు మధ్య మాత్రము సమర్థనీయము కాదు. ఒకవేళ మనము యిప్పుడు accept చేస్తే ఒకసారి ఒక పొరబాటు చేసినట్లే. ఆ పొరబాటుకు మనము మన అంగీకారము యిస్తే, యిక అది శాశ్వతముగా ఉండిపోతుంది. కాబట్టి నాయకులను యిటువంటి పొరబాటు మాత్రము చేయవద్దని హెచ్చరిస్తున్నాను. మనము యీ కవున్సిలును accept చేసిన రోజున మహారాష్ట్రలో చేరబోయే విదర్భ వారుకూడ Regional Council పెట్టమని కోరుతారు. అది బహుశా ఢిల్లీలో ఆమోదింపబడబోతున్నది. అట్లాగే తెలంగాణాకు ఏర్పడుతుంది. కాబట్టి దీనిని ఎంతమాత్రము ఒప్పుకోకూడదని నా అభిప్రాయము. దీనివల్ల పరస్పర వైరుధ్యాలు పెరుగుతవి. సన్నిహిత సంబంధాలు ఏర్పడవు. అనైక్యతకు గోహదమిస్తుంది. గనుక యిటువంటి పొరబాటు మాత్రము ఎన్నడూ చేయగూడదు. ఆంధ్ర నాయకులను దీనికి ఒప్పుకోవద్దని కోరుతున్నాను. అయితే తెలంగాణా వారు "ప్రస్తుతమునకే" అని అంటున్నారు గనుక, అది ఎటు పరిగణమించబోయినను దానిని యిప్పుడు మనము కాదనడం తప్పు. తరువాత, రోజులు జరిగిన కొద్దీ, మనయొక్క సుగుణములను వారు తెలుసుకొని తరువాత వారంతట వారే యీ Council ను తీసివేయమని చెప్పే పరిస్థితి తప్పక వస్తుందని నా విశ్వాసము. కాబట్టి ప్రస్తుతమునకు యీ కవున్సిలును ఉండనివ్వండి. దాని అవసరము లేకుండా తెలంగాణా వారే చేసుకుంటారు. కాబట్టి ప్రస్తుత పరిస్థితులలో మనము చేయగలిగింది యేమీలేదు రోజులు జరిగిన కొద్దీ దానియొక్క ఫలితము కనబడుతుంది. కాబట్టి నదీతీరాంధ్ర ప్రాంతాలవారు, రాయలసీమ ప్రాంతాల వారు, యిప్పుడు వద్దని అంటే, అది కావాలని తెలంగాణా ప్రాంతమువారు అంటే దానికి బాధ్యత వారి మీదనే ఉంటుంది. ప్రస్తుతమునకు మనము విశాలాంధ్రను సాధించాము. అయితే యిది సమగ్రమైనదేనా, అని అడిగితే, కాదని చెప్పవలసి ఉంటుంది. మహా నాయకులు అయిన కాళేశ్వర రావుగారు అయితేనేమి కల్లూరు సుబ్బారావుగారు అయితేనేమి, వారు చెప్పారు. వారు నిజంగా ఆంధ్ర రాష్ట్రముకొరకు చేసిన పోరాటములో ప్రధాన పాత్ర వహించినవారు. మరల విశాలాంధ్ర పోరాటములో, అది

కావాలని కలలు కన్నారేగాని, వచ్చినదని అనుకుంటే దానికి సరిహద్దులు ఏవి? బళ్ళారి పోగొట్టుకొని, బరంపురం పోగొట్టుకొని, చెన్నపట్టణం పోగొట్టుకొని, మనకు రావలసినవి రాకుండాపోయి, చివరికి ఏవీకూడ సంపాదించ శక్తి లేకుండా, పోయి ఒక్క హైదరాబాదు పట్టణముతో విశాలాంధ్ర మహారాజ్యము వచ్చిందని దీనితోనే సంతృప్తిపడడమేనా? ఇది నాయకుల విజ్ఞానమును సూచించదు.

ఒకవిషయం మనం గుర్తుపెట్టుకోవాలి. ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలంటే, చెన్నపట్టణంమీద సర్వహక్కులూ వదలుకోండి అంటే వదలుకున్నాం. ఈ విధంగా ఒరిస్సారాష్ట్రం ఏర్పడినప్పుడుకూడా మనపక్షాన్ని మాట్లాడేవారు లేక పోయినారు. విశాలాంధ్ర ఏర్పడినప్పుడు ఇతర తెలుగుప్రాంతాలపై మనకున్న హక్కు గుర్తింపబడుతుందని ఆశించాం. బళ్ళారిపైన, కోలారుపైన, ఇంకా ఇతర ప్రదేశాలపై తెలుగువారికి హక్కులేదా? కోలారులో నూటికి 60 మంది తెలుగు వారున్నారు. ఆమాట మనం అడిగితే కొలారు ఆంధ్రలో చేర్చుటకు అచ్చటి ప్రజలే వ్యతిరేకం అంటారు. బళ్ళారిలోమాత్రం హెచ్చుమంది ఆంధ్రరాష్ట్రంలో కలిసివుంటాం అన్నా అది కన్నడప్రాంతం కనుక Mysore లోనే చేరాలి అంటున్నారు States Reorganization Commission వారి report లో బళ్ళారి ఆంధ్రలో చేరాలని స్పష్టంగా వ్రాశారు. కాని మనతరఫున వాదించేవారు ఎవరూ లేకపోతున్నారు. Orrissa రాష్ట్రం ఏర్పడి బరంపురం, కోరాపుట్టి, పర్లాకిమిడి దానిలో కలుపుతూఉంటే ఏమీ ఆందోళనచెయ్యలేకపోయినాం. ఉమ్మడి మదరాసురాష్ట్రంలో ఉండబట్టి మనవిషయం ఎవరూ పట్టించుకోలేదని అనుకున్నాం. ఇప్పుడేమి జరిగింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడి మనహక్కులను గురించి గట్టిగా చెబుతూఉన్నా వినిపించుకునేవారు లేరు. Orrissa border లో ఉన్న వారణాశి మురావారు claim చేయలేదు. మదనాపురం, సింగిడి రిజర్వాయిరు కట్టాలంటే దానివిషయం ఆలోచించవలసియున్నది. ఈవారణాశి మురావిషయం పునరాలోచించి, సమగ్ర ఆంధ్రరాష్ట్రంలో చేర్చే ప్రయత్నం ప్రభుత్వం చేస్తుందని ఆశిస్తున్నాను. ఆ భాగాలు ఆంధ్రరాష్ట్రంలో చేరినప్పుడే మనం చెబుతూయున్న సంపూర్ణమైన ఆంధ్రరాష్ట్రం ఏర్పడినట్లు భావింపవలసియున్నది. ఈ విషయమై నెహ్రూ పండితునికి నచ్చచెప్పి, ఆంధ్రులకు న్యాయంజరిగేటట్లు చూస్తారని ఆశిస్తున్నాను.

SRI SHEIK MOULA SAHEB —అధ్యక్షా, ఇప్పుడు ఏర్పడనున్న రాష్ట్రానికి ఈ ఆంధ్ర-తెలంగాణా అనేపేరు ఎంతమాత్రం సమంజసంగాలేదు. ఈ పేరు పెట్టుటలోకూడా ఉభయప్రాంతాలవారికి భేదాభిప్రాయాలు వస్తున్నవి కనుక ఏరాష్ట్రానికో సంబంధించిన ముఖ్యపట్టణంపేరు పెడితే చాలా బాగుంటుందని మనవి చేస్తున్నాను. తెలంగాణాలో ఇంగ్లీషు, తెలుగుభాషకన్నా ఉర్దు మాట్లాడేవారే

ఎక్కువ ఉన్నారు. అందువల్ల వ్యవహారాలన్నీ త్వరలో ఇంగ్లీషులోనే జరగాలంటే సాధ్యంకానిపని. ఇప్పుడు అక్కడ ఇంకా గవర్నమెంటుపనులు ఉర్దూలోనే జరుగుచున్నవి. ఉర్దూమాట్లాడే చక్రవర్తుల పాలనక్రింద చాలారోజులుండుటవలన అక్కడ ఉర్దూయే ఎక్కువ ప్రచారములోవున్నది. గాంధిమహాత్ముడు సూచించిన ప్రజాస్వామికపద్ధతిలో అన్నిజాతులభాషలకు ప్రాధాన్యం ఇవ్వాలి. ఒక భాషకుచెందిన మతస్థులు ఉన్నప్పుడు వారిమీద లేనిపోని అనుమానాలు పెట్టుకొనడం భావ్యంకాదు.

ఈ రాష్ట్రంలో 22 లక్షల ముస్లిం జనాభా ఉన్నది; అంటే 10 వంతు ముస్లింభాగ స్వాములున్నారు. మొత్తంమీద తెలంగాణాలో ఎంతమంది ఉన్నారో తెలియదు. మత ప్రసక్తిరాజ్యాలను ఖండించి వాటివిధానాలను కాంగ్రెసుప్రభుత్వాలు propakistanis అనే తలంపుతో పోలీసువారిచేత ప్రపంచానికి చాటించే ముస్లింతెగకు ఒకరికొర్కు రహస్యంగా తయారుచేయిస్తున్నారని తెలుస్తోంది. సీటికోత మాదిరిగా తమంతట తాము కృశించేట్లు చేస్తున్నారు. ఇటువంటి దృక్పథాలు లేకుండా గాంధీసిద్ధాంతాలు, మానవజాతి సమానత్వం దృష్టిలోపెట్టుకుని మతాలు, కులాలు, గోత్రాలు రంగు గుడ్డలతో సమానమైనవిగా భావించి ఈ రెండురాష్ట్రాలను ఏకనామంతో వ్యవహరించి భూతభవిష్యద్వర్తమానాలను దృష్టిలో పెట్టుకుని సమంజసమైన దృక్పథంతో ఈ రాష్ట్రం ఏర్పాటుచేసి దాని అభివృద్ధి ప్రపంచానికి చాటింపచేస్తారని ఆంధ్రమహాజనులకు హృదయపూర్వక వందనాలు సమర్పిస్తూ విరమిస్తున్నాను.

SRI G. NARASIMHAMURTY :—అధ్యక్షా, భాషారాష్ట్రాలబిల్లు చర్చలో నాకుముందు మాట్లాడిన శాసనసభ్యులు అనేకసూచనలు చేశారు. నేను ఈ రాష్ట్రంయొక్క పేరునకు సంబంధించిన ఒకసూచన తమద్వారా ప్రభుత్వానికి చేయదలుచుకున్నాను. ఆంధ్రప్రదేశ్ అని పేరుపెడితే బాగుంటుంది అని నాయకులు నిర్ణయించనున్నట్లు పత్రికల్లో చూస్తున్నాము. కేంద్రప్రభుత్వంవారు దీనికి ఆంధ్ర తెలంగాణా అని పేరుపెట్టారు. ఇది అందరితోపాటు నేనుకూడా పేరు సరిఅయినది కాదని ఇది వికృతసమాసమని గేటు-గుమ్మం, అగ్గి-నిప్పు అన్నట్లుగా ఉంటుందని ఆంధ్రతెలంగాణా—ఈ రెండుశబ్దాలు ఒకటేఅర్థం కలిగినశబ్దాలు కనుక ఇది పనికిరాదని అమోదిస్తున్నాను ఆంధ్రప్రదేశ్ అనేపేరు బాగానే ఉంటుంది అని అనుకోవచ్చును. కాని దానిపై భేదాభిప్రాయాలుంటే మహాతెలంగాణా అని నామకరణం చేసినట్లయితే ఇది అన్నింటికంటే సర్వోత్కృష్టమయిన శబ్దమని ఈ శబ్దమునకు మహత్తరమైన భావి ఉంటుందని నేను విశ్వసిస్తున్నాను. ఎప్పుడో High Command వారు కేంద్ర ప్రభుత్వంవారు మహాశబ్దాన్ని ఏ రాష్ట్రాలపేరుకు

3rd April 1956] [Sri G. Narasimhamurty

ముందు ఉపయోగించరాదని అభిప్రాయం విన్నాము. "మహా" శబ్దంపై వారు ఎందుకు ఇటువంటి అభిప్రాయం కలిగించారో తెలియదు. కాని మహాశబ్దం వల్ల ఈ శబ్దానికి గౌరవం పెరుగుతుంది. మహాశబ్దంవల్ల మహారాజులు, మహారాజ్యాలు అని రాజరికాన్ని సూచించే శబ్దమనే ఉద్దేశంతో ఈ మహాశబ్దం ఉపయోగించకూడదని అగ్రనాయకులభావమై ఉండవచ్చును అనుకుంటాను. అలా అయితే ఈ దేశానికి స్వాతంత్ర్యం సంపాదించిన పూజ్యబాపూజీని మహాత్మాగాంధీ అని ఆయన విధానాలనే కాకుండా ఆయన వ్యక్తిత్వాన్నికూడా మహాత్ముడని ఆయనను ఆబాలగోపాలం యావద్భారత దేశంలో ఆరాధించాము మహాత్ముడనిచెప్పి ఇన్నికోట్ల ప్రజలు పిలవడంచేతనే మహాత్ముడవడమే కాక మహోత్కృష్టమయిన కార్యం ప్రపంచ చరిత్రలో కని విని ఎరుగని పద్ధతిలో సంపూర్ణమైన అహింసాసిద్ధాంతంతో, కత్తి, దౌర్జన్యం, రక్తపాతం లేకుండా బ్రహ్మాండమయిన రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యాన్ని మహోత్కృష్టమయిన ఆశయాలవల్ల ఎదిరించి, స్వతంత్ర ప్రపంచం అంతా విభ్రమంచెందేట్లా సాధించిపెట్టారు ఆనాడు మహా, శబ్దాన్ని ఏ విధంగా ద్వేషించలేదో అదేవిధంగా ఈనాడుకూడా ఈశబ్దాన్ని ద్వేషించవలసిన పనిలేదు. ఇందులో చాలామహత్తు ఉందని పండితులుచెప్పగా విన్నాను. ఆంధ్రశబ్దంలో లోపభూయిష్టమయినభావం ఉందని ఆంధ్రప్రభలో పండితులు గతసంవత్సరం 4, 5 రోజులు విమర్శించారు. ఆశబ్దం శుభప్రదమయినదికాదని నిరూపణచేశారు. ఉభయ రాష్ట్రాలనాయకులు ఆలోచించి ఈ శబ్దంయొక్క మంచిచెడ్డల విషయమై పండితుల అభిప్రాయం తీసుకొని నిరూపణచేస్తే బాగుంటుందని మహాశబ్దం మంచిదని అగ్రనాయకులు కాదన్నా దీనిని అనుసరించవచ్చునని మనవిచేస్తున్నాను. రాజుశబ్దం ఉన్నది; రాచరికాన్ని ఒప్పుకోని state లో ఇదికూడా నిషిద్ధమై ఉండాలి. మంతెన వెంకట్రాజుగారిపేరు చివర 'రాజు' అని ఉంటే అది తీసివేసి మంతెన వెంకట అని పిలుస్తారా? మహా వీరత్యాగిగారని మంత్రిగారున్నారు. ఆయనపేరు ముందున్న మహా తీసివేసి వీరత్యాగి అని పిలుస్తారా? High Command కు ఇష్టంలేని కారణంగా ఈ శబ్దం విడనాడటం మంచిదికాదు. తెలంగాణాసోదరులకు కూడా ఆమోదంగా ఉంటుంది. ఈ పదం కనుక మహాతెలంగాణా అని పేరు పెట్టుకుంటే బాగుంటుందని ఈ పేరుగురించి యోచనచేయాలని ఉభయరాష్ట్రాల నాయకులను కోరుతున్నాను. ఇక సరిహద్దులకు సంబంధించిన విషయం. బళ్ళారికి సంబంధించి నంతవరకు బళ్ళారి, హూవనగుడి, మోక ఫిర్కాలు తెలుగు జనాభా హెచ్చుగా ఉన్నటువంటి ప్రదేశాలు. ఇటువంటి ప్రదేశాలనుకూడా మైసూరులో చేర్చడం సమంజసంగాలేదు. అక్కడప్రజలు చాలా ఆవేదనపడుతున్నారు నిన్న కాక మొన్న అక్కడి నాయకులువచ్చి ఇక్కడ ఉన్నారు, ప్రభుత్వానికి నివేదిక

ఇవ్వనై ఉన్నారు. చాలా విచారకరమయిన విషయమిది, చాలా కష్టనిష్ఠూరాలకు పాలవుతామనే ఆవేదనలో ఉన్నారు. ముఖ్యమంత్రి గారు సెలవిచ్చారు—శాంతియుతంగా నిర్మలంగా, సమర్థించుకునేట్లు ఉండాలికాని ఉద్రేకపూరితమయిన వ్యాఖ్యానాలు చేయకూడదని; మాట్లాడకూడదని. అది నిజమేకాని వారి ఆవేదన మన ప్రభుత్వం యోచించి కనీసం ఈ మూడు ఫిర్కాలను అయినా ఆంధ్రలో చేరేట్లు గట్టిప్రయత్నంచేయాలని ప్రభుత్వానికి తమద్వారా మనవిచేస్తూ ఈ అవకాశం ఇచ్చిన మీకు కృతజ్ఞత తెలియజేస్తున్నాను.

SRI N. C. SESHADRI:—అధ్యక్షా, ముక్కోటి ఆంధ్రులు చిరకాలంగా వాంఛించిన విశాలాంధ్రనిర్మాణం స్థిరమయినది. ఆంధ్రుల కోరిక ఫలించబోతున్నది. ఈ సమయంలో రాష్ట్ర పునర్నిర్మాణబిల్లును చర్చిస్తున్నాము. అంతేకాకుండా ఆంధ్రులచరిత్రలోనే ఒక చరిత్రాత్మకమైన ఘట్టం అనికూడా నేను భావిస్తున్నాను. అటు తెలంగాణాలో 9 జిల్లాలు రాయచూరు, గుల్బర్గా, బీదరుజిల్లాల్లోని 6 తాలూకాలు మన క్రొత్తరాష్ట్రంలో చేరడంవల్ల మనసభ్యులు, పార్లమెంటు సభ్యుల సంఖ్యలోనే మనం యావద్భారతదేశంలోను మూడవస్థానాన్ని ఆక్రమిస్తున్నాము. దీనివల్ల ముమ్ముందు మన ఆంధ్రుల ప్రతిభను ఉగ్గడించుకొనడానికి కేంద్ర ప్రభుత్వంలో మనకు కావలసిన అవకాశాలు ఏర్పడుతాయి. ఇది చాలా సంతోషించవలసిన విషయం. అంతేకాకుండా మనభావి అభివృద్ధిప్రణాళికలకు ఇది దోహదకారి అవుతుందని ఆశిస్తున్నాను.

మన రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సమయంలో అటు ఉత్తర సరిహద్దులలోని పర్లాకిమిడి, గంజాము, కోరాపుట్టి, జిల్లాలలోను ఇటు దక్షిణాన మైసూరు రాష్ట్రములోని కోలారు, చితల్‌దుర్గ్, తుంకూర్, బళ్ళారి జిల్లాలలోను మిగిలిపోయిన దాదాపు 35 లక్షల ఆంధ్ర సోదరుల విషయం మనము యీ రోజున ఆలోచించవలసి ఉన్నది. ముఖ్యముగా బళ్ళారి జిల్లాలలోని మన ఆంధ్ర సోదరుల విషయమై చాలా అన్యాయము జరిగినదని చెప్పవలసి వున్నది. ఈ వ్యవహారములో మన నాయకులు చాలా తీవ్రమయిన కృషి జరిపినారనుటలో ఎంత మాత్రము సందేహం లేదు. ఈ వ్యవహారంలో మనము కేవలము నీతి, నిజాయితీ, సత్యాలపైననే ఆధారపడి ఉంటిమి. మనది న్యాయమయిన కోర్కె కాబట్టి కేంద్ర ప్రభుత్వమువారు ఈ విషయమై మనకు న్యాయము చేకూర్చగలరని విశ్వసించితిమి. అయితే రాజకీయ తంత్రాలను మాత్రము మనము ఈ విషయంలో మరచి పోయినాము. కాని, మన ప్రత్యర్థులు డిప్లొమసీని బాగుగా వాడుకొన్నారు. తత్ఫలితంగా వారికి విజయము సిద్ధించింది. మనకు కడకు పరాజయం కలిగింది. బళ్ళారి విషయమును మనము మన దేశ నాయకులైనటువంటి శ్రీ నెహ్రూగారికి స్వయముగా నివేదించుకొన్నప్పుడు వారు దానిని

స్వయముగా పరిశీలించి ఉన్నట్లయితే మనకు ఈ రోజున ఈ అన్యాయము జరిగి ఉండేదికాదు. నెహ్రూగారు అంతర్జాతీయ సమస్యలలోపడి ఈ చిన్న చిన్న వ్యవహారములను తమకు నమ్మకము కలిగినటువంటి కొందరు అనుచరుల చేతులలో పెట్టినారు. ఐతే ఆ అనుచరులు మనకు న్యాయము చేస్తారని మనము అనుకున్నాము న్యాయ దృష్టితోనే వారి సమస్యను పరిష్కరిస్తారని మనమందరము అనుకున్నాము. కాని వారు వారికి సన్నిహితులుగా ఉండేవారి మాటలను నమ్మి చారిత్రక విషయములను గుర్తించక కేవలము నిరంకుశమయిన వైఖరిని అవలంబించి, మన రాష్ట్ర శాసన సభ బళ్ళారి విషయములో ఏకగ్రీవముగా చేసిన తీర్మానమును కూడ పాటించక ముక్కుకు సూటిగా తీర్పుయిచ్చారు. దానిని ఈ రోజున మనలను అంగీకరించమని చెపుతున్నారు. ఐతే ఏ సందర్భంలోకూడ దానిని మనము ఒప్పుకొనకూడదని నేను సభ్యులకందరకూ మనవి చేస్తున్నాను. ఒక గొప్ప న్యాయమూర్తి ఒక గొప్ప రాజకీయవేత్త మరొక గొప్ప చరిత్రకారుడు అన్ని విషయములను పరిశీలించి సలిపిన వివేకమయిన కృషి ఫలితంగా తయారు చేసినటువంటి ఈ నివేదికలోని సిఫారసులను గూడ లెక్క చేయకుండా కేవలం తమ అంతరంగిక మిత్రులు చెప్పినటువంటి సలహాలపైననే ఈ బళ్ళారి విషయములో మనకు తీరని అన్యాయము చేసినారు. అయితే వారి వేదనలతో ప్రజలను మభ్య పెట్టవచ్చునేమో గాని నగ్న సత్యాన్ని మాత్రము దాచడానికి వీలులేదని మనవి చేస్తున్నాను. ఉదాహరణకు రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ బిల్లుయొక్క ఉపోద్ఘాతంలో

"The Commission has recommended the review of the previous decision mainly to ensure the smooth and efficient execution and working of the Thungabhadra Project." అని ఉన్నది. ఇది కేవలం మనలను మభ్య పెట్టడానికి వ్రాసినటువంటి వాక్యమేనని నా అభిప్రాయము. దాని నిజం చెప్పాలంటే, S.R.C. Report లో "What has weighed with us in arriving at the Conclusion to which we have referred is the cumulative effect" అని వ్రాశారు. అందులో Cummulative effect అని వ్రాశారు. ఇవి చాలా ముఖ్యమయిన మాటలు. 'Cummulative effect of three main considerations namely administrative convenience economic links and the importance of the Thungabhadra Project to the Rayalaseema districts of Andhra.' అని వ్రాశారు. కాబట్టి దీనిని మనము ముఖ్యముగా గమనించవలసి యున్నది. కొన్ని దశాబ్దాలుగా తుంగభద్రా ప్రాజెక్టు కావలెనని రాయలసీమ వాసులు ఆందోళన చేస్తూ ఉన్నారు. సమిష్టి మదరాసు రాష్ట్రములో వున్నపుడు ఈ విషయమై మనము గట్టి కృషి చేసినాము.

Sri N. C. Seshadri] [3rd April 1956

ఆ కృషి ఫలితంగానే తుంగభద్రా ఆనకట్ట నిర్మింపబడింది. తీరా మన ప్రత్యేక రాష్ట్రము ఏర్పడునాటికి మనము ఎన్నడూనూ తలచని రీతిగా అది మైసూరు ప్రభుత్వము చేతికి దక్కింది. అందువల్ల వారు ఎగువ కాలువ నిర్మాణానికి ఎన్నో అడ్డంకులు పెడుతున్నారు. ఈనాడు భారత ప్రభుత్వము మనకు ఎన్ని హామీలు ఇచ్చినప్పటికీ కూడ యిక ముందయినా ఈ ఎగువ కాలువ వ్యవహారం సరిగా జరుగుతుందా లేదా అనేటటువంటి అనుమానము కలుగుతున్నది. ఈ విషయంలో ఒకవేళ మన మంత్రులకు ఏమయినా నమ్మకము వుంటే ఉండవచ్చునుగాని నాకు మాత్రము ఈ తుంగభద్ర ఎగువ కాలువ విషయంలో మైసూరు ప్రభుత్వమువారు తప్పకుండా అడ్డంకులు తీసుకువస్తారనే తోస్తున్నది. ఈ విషయంలో మైసూరు ముఖ్య మంత్రి గారయిన హనుమంతయ్యగారి వైఖరినిబట్టి చూస్తే ఇది సాక్షీగా జరిగే వ్యవహారం మాత్రం కాదని నాకు గోచరిస్తున్నది. అంతేకాకుండా రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘము వారి నివేదికలో తుంగభద్ర దిగువ కాలువ గురించికూడ కొంత ప్రసక్తి వున్నది దానిలో

"The Ayacut of the low level canal on the southern side of this Project already sanctioned will have to be brought under cultivation as soon as possible and it has been represented that immigration from the existing Andhra State into the eastern position of Bellary District as it is now constituted is both necessary and desirable for this purpose."

అని స్పష్టంగా చెప్పారు. దీనికి సరియైన సమాధానం చెప్పకుండా తుంగభద్రఎగువ కాలవ విషయంలో హామీలు ఇస్తున్నాము, కనుక మీరు మా నిర్ణయానికి అంగీకరించండి. అనడము ముక్కు పట్టుకొని నడిపించుకొంటూ పోతే నడచి వెళ్లినట్లు ఉన్నది. ఇది చాలా శోచనీయమయినటువంటి విషయము. ఇప్పటికి మించిపోయినదేమీ లేదు. ఈ నాడు బళ్ళారి విషయము ఇటు ఆంధ్ర నాయకులయొక్క అటు తెలంగాణా నాయకులయొక్క సమిష్టి బాధ్యతగా తయారయింది. ఈ సమిష్టి బాధ్యతను గుర్తించి వారందరూ ఏకగ్రీవమయిన తీర్మానమును ఇటు ఆంధ్ర శాసనసభలోను, అటు హైదరాబాదు శాసనసభలోను ఆమోదింప చేసి ఈ బిల్లులోని మూడవ సెక్షనుకు బళ్ళారికి సంబంధించినంత వరకు సవరణలను పాస్‌చేసినట్లయితే కేంద్ర ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయములను కాదనలేరు. తత్ఫలితంగా బళ్ళారి, హాస్‌పేట, శిరిగుప్ప తాలూకాలు మనకు లభ్యమయ్యే అవకాశం ఉన్నదనికూడ నేను అనుకొంటున్నాను. కడప, కర్నూలు,

అనంతపూర్, చిత్తూర్ జిల్లాలను మనము రాయలసీమగా వ్యవహరించుకొంటున్నాము. ఈ రాయలసీమకు హృదయమువంటిది బళ్ళారి. ఈనాడు హృదయములేని రాయలసీమను మనము తీసుకొనడముకన్న మనమంత్రులు ఈరోజు మేము పెద్దలుచెప్పినట్లు ఒప్పుకొనక తప్పదని చెప్పినట్లయితే మేము ఈ విబ్భత్తును ఎన్నటికీ ఒప్పుకొనలేము. అది మా చేతకానితనమని ఈ రోజు నాయకులు చెప్పినట్లయితే ఈ రాయలసీమ జిల్లాలన్నింటినీ తీసుకొనివెళ్లి మైసూరుస్టేటులో చేర్చండి. మేము దానికి ఒప్పుకుంటాము కాని ఏ పరిస్థితులలోకూడ రాయలసీమజిల్లాలను వేరుపరచే ప్రయత్నములను మేము సహించలేమని మనవిచేస్తున్నాము. నేనేకాక మూడుకోట్ల ఆంధ్రులలో ఎవరూకూడా సహించరని మనవిచేస్తున్నాను. అంతేకాకుండా బళ్ళారి, శాసనసభ్యులయినటువంటి ముల్లూరి గంగప్పగారు ఈ సమస్యపైననే రాజీనామా ఇచ్చారు. బళ్ళారి, రూపనగుడి, మోక, ఫిర్కాలలో తెలుగుమాట్లాడేవారు అధిక సంఖ్యాకులుగా ఉన్నారనే విషయాన్ని నిరూపించుటకుగాను వారు రాజీనామా ఇచ్చారు రేపో, మాపో అక్కడ తిరిగి ఎన్నిక జరుగబోతున్నది బళ్ళారి ప్రాంతాన్ని ఆంధ్రలో చేర్చవలెనని మనము హైపవర్ కమిటీవారికి గట్టిగా తెలియ చేయలేక పోయినట్లయితే, కేంద్రప్రభుత్వముపై ఒత్తిడితీసుకునిరాజాలక పోయినట్లయితే కనీసం ఆ ప్రాంతంలో జనవాక్యసేకరణ జరుగునట్లు చూడండి. జనవాక్య సేకరణజరిగి, రేపుజరిగే ఉపయెన్నికలలో ఆంధ్రాభ్యర్థి ఓడిపోయినట్లయితే ఇటు ఆంధ్రశాసనసభలోగాని అటు విశాలాంధ్ర శాసనసభలోగాని ఎవరుకూడ బళ్ళారి ప్రసక్తి తీసుకునిరారు. కాబట్టి కనీసము జనవాక్యసేకరణ జరిపించవలసినదని కేంద్రప్రభుత్వమువారికి మీద్వారా మనవిచేస్తున్నాను. ఈనాడు తెలంగాణా నాయకులు శ్రీ రామకృష్ణారావుగారు, రంగారెడ్డిగారు, చెన్నారెడ్డిగారు ఇక్కడకు వచ్చారు. ఇది ఎంతోశుభసమయము. మన నాయకులందరూ కలసి బళ్ళారి, హాస్పేట, శిరిగుప్పతాలూకాల విషయం సమగ్రంగా చర్చించి అటు హైదరాబాదు శాసనసభలోను ఈవిషయములో ఒకేవిధమయిన సవరణలను ఆమోదింపచేసినట్లయితే కేంద్రప్రభుత్వము వాటిని త్రోసిపుచ్చజాలదని నా నమ్మకము.

పండిట్ నెహ్రూగారు కొన్ని ప్రసంగాలలో రాష్ట్రపునర్వ్యవస్థీకరణలో ఇరుప్రక్కలవారికి రాజీ కుదరకపోయినట్లయితే ఫజులాలీ కమిషనువారి నివేదికను అనుసరింపవలసి వస్తుంది; అని చెప్తూవచ్చారు. నిన్న ఒకసభ్యుడు మాటలాడు చున్నప్పుడు మన ముఖ్యమంత్రిగారు మేము కేంద్రప్రభుత్వము చేసినటువంటి తీర్మానమును ఒప్పుకొనలేదని ఖచ్చితంగా చెప్పినారు. బళ్ళారివిషయంలో రాజీ కుదరలేదు కాబట్టి ఫజులాలీ కమిషను సిఫారుసులను ఆమోదించవలసినదిగా కేంద్ర ప్రభుత్వమువారిని ఒప్పించవలసినదని నేను మంత్రివర్గమువారిని కోరుతున్నాను.

మనది న్యాయమయిన కోర్కె కాబట్టి ఈ విషయములో గట్టిగా నిలబడి పోరాడినట్లయితే మనకు విజయము లభించే అవకాశ ముఉన్నది.

జనవాక్యసేకరణ విషయంలోకూడ శ్రీ నెహ్రూగారు ఒక స్టేటుమెంటు ఇచ్చారు. ఎక్కడయితే వివాదాలు పరిష్కారము చేయవలసి వస్తుందో అక్కడ జనవాక్యసేకరణప్రసక్తిలేదని ఎంచరాదని వారన్నారు. కాబట్టి జనవాక్యసేకరణ చేసినట్లయితే బళ్ళారి, రూపనగుడి, మోక, సిరాగుప్ప మనకు వచ్చే అవకాశాలున్నాయి. కాబట్టి ఈ విషయంలో మన నాయకులందరూ కూడా కృషిసల్పి కేంద్రప్రభుత్వముపైన ఒత్తిడితీసుకుని వచ్చినట్లయితే బళ్ళారి, హోస్పేట, శిరిగుప్ప, మల్లాపురం సబ్ తాలూకాలు మనకు వచ్చే అవకాశం ఉంది. మనము అన్యాయమయిన కోరికలను వేటిని కోరడంలేదు మనము ఇతరులకు పోవలసిన ప్రాంతాలను కావలెనని కోరడంలేదు కాబట్టి మన నాయకులు ఈ విషయంలో ఇదమిద్ధమయిన నిర్ణయమునకు వచ్చి కేంద్రప్రభుత్వముపైన తప్పకుండా ఒత్తిడిని తీసుకుని రాగలరని ఆశిస్తూ యింతటితో శలవుతీసుకుంటున్నాను.

SRI A. VENKATARAMA RAJU.—అధ్యక్షా, ఈరోజున మనము చర్చించుకునే ఈ సమస్యపై అనేక సంవత్సరములుగా ఆంధ్రప్రాంతాలలో అనేక స్వరూపాలలో అనేక దశలలో తీవ్రమైన చర్చలు సాగినట్లు. అనేక సందర్భాలలో మన అభిమతాన్ని ప్రతిబింబించుకున్న ఉత్తమమైన కోరికను సాధించుకున్నాము. ఆంధ్రరాష్ట్ర స్థాపన సందర్భములో రాజధానిసమస్య ఏవిధముగా తీవ్రమైన సమస్యగా తయారు అయినదో, అదేవిధముగా తిరిగి ఈనాడు మనకు ఏర్పడబోయే నూతన రాష్ట్రానికి ఏపేరు పెట్టాలిఅనే సమస్య అనేకస్వరూపాలతో వక్రరూపములతో చర్చకు వస్తున్నదనే విషయము గమనించాలి. అసలు విశాలాంధ్ర ఏర్పడుతుందా లేదా అనే తర్జనభర్జనలు జరుగుతూ కేంద్రములోను రాష్ట్రములోను అసలు పేరుఏమి పెట్టవలెను అనే విషయము అనేక విధాలుగా వచ్చింది. ఢిల్లీలో 12, 14 విధాలైన సూచనలు వచ్చాయి. అఖండ హైదరాబాదు, విశాల హైదరాబాదు, తెలంగాణా, అఖండ తెలంగాణా అని అనేక పేర్లతో ఈ సమస్యను తీసుకొని వస్తున్నారు వీటన్నింటికి పరిష్కార మార్గముగా మనలో తుని తగవు, భట్టిప్రోలు తీర్పుఅన్నట్లుగా చివరకు ఆంధ్ర-తెలంగాణా అని పేరు తీసుకువచ్చారు. అసలు విశాలాంధ్రవాదన భాషా ప్రయుక్తరాష్ట్రోద్యమము. అఖిలభారత దేశములోనే భాషాప్రయుక్త రాష్ట్రవిభజనకు దీనిని ప్రాతిపదికంగా సంపాదించుకున్నాము. ఈ సందర్భములో పేరు పెట్టడములో హీనమైన చర్యలకు దిగజారిపోవడం భారతదేశములో మన ఎడల సంకుచితభావము ఏర్పడింది. మన ఆంధ్రలో ఉన్నట్టి ముఖ్యమైన పార్టీలు, పెద్దలు, మంత్రివర్గము చర్చించి ఆంధ్రప్రదేశ్ అనేది ఉత్తమ నామముగా ఉంటుందని, అది

అందరికీ అంగీకారముగా ఉంటుందని ఆలోచించి ఆ పేరు పెట్టడము జరిగింది. అయితే దాని ఉత్పత్తి అర్థమునకు చరిత్రకు సంబంధించిన అనేక సత్యాలను మనముందు పెట్టేరు. ఈనాడు తెలంగాణాలో మన సోదరులు దానికి తెలుగుప్రదేశ్ అని ఎందుకు పెట్టకూడదు అనిరాద్ధాంతసిద్ధాంతములు తీసుకువస్తున్నారు. దీనిని వేగముగా పరిష్కారము చెయ్యడానికి ఉభయరాష్ట్రాలమంత్రులు, వివిధ పార్టీల నాయకులు కలసి ఒక నిర్దుష్టమైన పేరును తెలుపుకుంటే ఉత్తమముగా ఉంటుంది. అది ఐకమత్యానికి దోహదంగా ఉంటుంది. ఏది శాశ్వతముగా ఉంటుందో, రాష్ట్రముయొక్క ఔన్నత్యాన్ని ప్రతిబింబించేటట్లుగా ఉంటుందో, దానిని ప్రతిష్ఠకు ప్రాకులాడకుండా నిర్ణయించవలెనని శాసనసభాసభ్యులకు నేను సూచిస్తున్నాను. పూర్వము 300 సంవత్సరాలక్రితము బ్రిటిషు పరిపాలకులు జాతీయోద్యమము విజృంభించకుండా చెయ్యడానికి జాతిని విచ్ఛిన్నంచేసినమాట నిజమే. ఆ సందర్భములో చిన్నచిన్న భాగములుకలుపడములో అభిప్రాయభేదములుపొడసూపినవి. అయితే ఇప్పుడుప్రశాంతముగా, సౌమ్యమైనపరిస్థితులలో మనం కలవకల్గినందులకు గర్వంకూడా మనకుకల్గినది. ఇటువంటి సమయములో నూతనరాష్ట్రానికి పెరు విషయములో ఈ తర్జనభర్జనలకు తావు ఇవ్వకూడదని నేను తెలియచేస్తున్నాను.

రాబోయే ఆంధ్రప్రదేశములో Legislative Council ఉండాలి అనేది ఒక సమస్యగా ఉంది. ఈ కవున్సిలు ఆవశ్యకతను గురించి ఉదయం ఉపాధ్యక్షులవారు శెలవిస్తూ 1937 లో మద్రాసుశాసనసభలో ఉన్నప్పుడు మద్రాసు కవున్సిలు ఇచ్చిన సలహాలు, అనుభవజ్ఞులు అయిన పెద్దలు ఇచ్చిన సలహాలనుగురించి చెప్పారు. అక్కడ ఆ సలహాలను ఏ విధముగా శాసనసభ ఉపయోగించుకున్నాదో చూస్తే, దాని అవసరం తెలుస్తుంది అన్నారు. ఈనాడు వెనుకబడిన ప్రాంతములవారు మనతో కలుస్తున్నప్పుడు వారిని పరిపూర్ణమైన స్థాయికి తీసుకురావడానికి demo-cratic గా ఎన్నుకొన్న శాసనసభ కాకుండా, వివిధ దృక్పథాలుకల్గినట్టి పై సభ కూడా ఉండవలసిన అవసరం ఉన్నదని ఉపయోగం ఉంటుందని అన్నారు. అయితే ఈ రెండు ప్రాంతాలనుండి వచ్చిన 300 మంది ప్రతినిధులు అందరుకూడా ప్రజాభిప్రాయాలను ప్రతిబించించ లేకపోతారా అనేది ఆలోచించుకోవలయును. ఏడు సంవత్సరాలుగా ఈ పైసభలు ఉన్నవి. ఈ పైసభలు సలహాలు ఇస్తున్నవని అంటే, అది ఏమిటో చూడవచ్చును. ఉమ్మడి మద్రాసురాష్ట్రములో కౌన్సిలు ఒక steam roller గా ఉండేది. పైసభ సలహాలను సూచనలను ఎంతవరకు పొందినారు అంటే, లేదని చెప్పవలెను. ఈనాడు పైసభలను ఏర్పాటు చెయ్యడములోకూడా మన constitution ప్రకారము local boards నుంచి జరుగుతూ ఉన్నది. ఈనామినేషన్లు కళాకారులు, విజ్ఞానశాస్త్రవేత్తలనుంచి జరుగవలసి ఉన్నది. వారి సలహాలు

అవసరము ఉన్నవని చెప్పవచ్చును. ఇప్పుడు శాసనసభలకు ఎన్నుకోనబడిన వారిలో లాయర్లు డాక్టర్లు, శాస్త్రవేత్తలు మనకు కొదవడలేదు. ఆంధ్రశాసనసభలో ఆయుర్వేదం, ప్రకృతివైద్యం, న్యాచురోపతి, హోమియోపతినిగురించి మాట్లాడే వారు మనకు ఉన్నారు. వారు సూచనలు చేస్తున్నారు. ఈ విధముగానే అనేకమంది లాయర్లుకూడా ఉన్నారు. అలాగే రైతాంగమునుంచి వర్తకుల నుంచి వచ్చినవారు ఉన్నారు అందుచేత తిరిగి పై సభ అవసరం అనేది బలహీనం అయిన వాదనగా ఉన్నది. అందుచేత ఈ కౌన్సిలు కావలెనని చెప్పడము న్యాయము వివిధ రాష్ట్రాలయొక్క అనుభవాన్నిబట్టిచూస్తే అనవసరం అని తెలుస్తున్నది. కాబట్టి దానిని తిరిగి మనము నిర్మించుకోనవలసిన అవసరంలేదు. ఇక జోనల్ కౌన్సిల్సు అనేటటువంటి సూచన నొకదానిని తెచ్చిపెడుతున్నారు. ఈ సందర్భములో పెద్దలు కాశీశ్వరరావుగారు దాన్ని వివరిస్తూ దీంట్లో జాతీయ అహంకారము దురభిమానము అనేవన్నికూడా ప్రతిబింబిస్తాయి, వీటినన్నిటిని అధిగమించి విశాలమైన దృక్పథమునకు ప్రాతిపదిక వేస్తే బాగుంటుందని శెలవిచ్చారు. అసలు జాతీయవాంఛ అనేదితీరి మన జాతీయ పునర్నిర్మాణము పూర్తికానటువంటి ఈ దశలో మనమసలు ఏదో ఒక విశాలమైన దృక్పథము అనే పేరుతో మరల జోనల్‌కౌన్సిల్సును తిరిగి తీసుకరావడం అనేది ఏ మాత్రము సరికాదుఅని నేను అభిప్రాయపడుతున్నాను. ఈ వేళ ఆంధ్ర ప్రజానీకము వెల్లడించే అభిప్రాయాలను జాతిఅహంకారమునో అహంభావమునో జాతీయదురహంకారమననో పేరుపెట్టి పిలువడానికి తగినటువంటి పరిస్థితులు ఇంకా రాలేదు. అలాంటివి ఉత్పన్నమైనప్పుడు మనము పరిశీలించుకొందాము. ఈ వేళ జాతీయవాంఛాదశలోనే మనమున్నామని, ఈ వాంఛలను తీర్చుకొని పునర్నిర్మాణము చేసుకోవాలని, ఆ దృష్టితో పరిశీలించి వీటిని పోటీపెట్టక్కరలేదని, మనముందున్న ఈ బిల్లును ముందుకు తీసికెళ్ళాలని కోరుతూ శెలవుతీసుకుంటున్నాను.

Sri M. R. APPA RAO :—అధ్యక్షా! మనము, ఇన్ని సంవత్సరాలుగా ఆందోళనచేస్తే చివరకు ఇప్పుడు విశాలాంధ్రవచ్చి అందులో మన మందరము పాల్గొంటున్నామంటే గొప్ప అదృష్టవంతులమని చెప్పవలసియున్నది. దాదాపుగా 1913 నుంచి ఆంధ్రరాష్ట్రము రావాలని కోరుతున్నా చివరకు పొట్టి శ్రీరాములుగారి బలిదానమువల్ల మనకు వచ్చింది. దాని తరువాత విశాలాంధ్ర కూడా తత్ఫలితంగానే వచ్చిందని చెప్పడానికి ఏమాత్రము సందేహములేదు. ఈ విశాలాంధ్ర రాష్ట్రము వచ్చినప్పుడు దానికేపేరుండాలన్నది మనలను కొంత

ఆందోళన పరుస్తున్నది. 1913 నుండికూడా ఆంధ్ర మహాసభగాని విశాలాంధ్ర సభగాని ఎవరుగాని దీనికి ఆంధ్రరాష్ట్రము అనేపేరు తప్ప రెండవ పేరు సరిపోదని అభిప్రాయబడ్డారు. కొంతమంది ఆంధ్ర అంటే అదృష్టంగా లేదన్నా దాన్నెవరూ పరిగణించకూడదు ఆంధ్రరాష్ట్రము చాలా అదృష్టంగానే ఉందని అనుకోవాలి. ఎందుకంటే ఆంధ్రరాష్ట్రమువచ్చింది, దాని తరువాత కొద్ది రోజుల్లోనే విశాలాంధ్రవచ్చి భారతదేశములో మనము మూడవస్థానాన్ని ఆక్రమించాము. అందువల్ల ఆంధ్ర ప్రదేశ్ అనేదే చాలా మంచిపేరు అని నేను అనుకుంటున్నాను. మనకు విశాలాంధ్ర వచ్చిన సమయములో రాష్ట్రేతర ఆంధ్రులు కొంతమంది ఉన్నారు. సరిహద్దుల్లో కొంతమంది ఆంధ్రులు ఉన్నారు. బళ్ళారి మనకు ముఖ్యంగా రావలసిఉంది. 1940 సంవత్సరములో నేను బళ్ళారి ఆంధ్ర మహాసభకు వెళ్ళినప్పుడు వాళ్లెంతో ఉత్సాహముతో ఉండిరి. మొదట కేల్కారు అవార్డువల్ల బళ్ళారివారికి అన్యాయము జరిగింది. దాని తరువాత మిశ్రాఅవార్డు వచ్చింది. ఇదంతా పరిశీలించి S. R. C వాళ్లు బళ్ళారి తాలూకావరకు అయినా మనకు రావలసిందని చెప్పారు. అందుచేత బళ్ళారి మనకు వచ్చిందని ఎంతో సంతోషపడుతూఉంటే ఆ సమయములో హఠాత్తుగా బళ్ళారి పోయిదంటే మనము చాలా విచారపడుతూ ఉన్నాము. ఇది ఎప్పటికైనా రాష్ట్రపునర్నిర్మాణ విషయంలో ఏ భాష మాట్లాడేవారు ఆరాష్ట్రములో ఉండాలనేది మనము ప్రాతిపదికగా తీసికొని పనిచేయటం అవసరం కాబట్టి ఎంతవరకు బళ్ళారి తాలూకాలో తెలుగు మాట్లాడేవారున్నారో వారందరినీ ఆంధ్రరాష్ట్రములో చేర్చడం చాలా అవసరం. తరువాత మన ప్రధానమంత్రిగారు ఇదే final కాదనిన్ని తరువాత జోనల్ కౌన్సిల్సు పెట్టినప్పుడు దీన్ని ఆలోచించవచ్చునని చెప్పారు. కాబట్టి పునరాలోచన చేసేటప్పుడు బళ్ళారి ఆంధ్రులను మనలో చేర్చుకోవడం, ఈ ఒరిస్సారాష్ట్రములోని గంజాం జిల్లాలోని కోరాపుట్టి, పర్లాకిమిడి ప్రాంతములో ఉన్న తెలుగువారినందరినీకూడా మనము ఆంధ్రరాష్ట్రములో చేర్చుకోవడం చాలా అవసరం. దీని విషయములో ముఖ్యమైన ప్రాతిపదిక ఏమిటంటే ఏ భాష మాట్లాడేవారు ఆ భాషా రాష్ట్రములో ఉండటం అవసరం కాబట్టి అది చేకూర్చడానికిగాను మన ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వమును ఒత్తిడి జేసి జోనల్ కౌన్సిల్సు ద్వారా కృషి చేయడం అవసరము అందుచేతే జోనల్ కౌన్సిల్సుకూడా ఉండటం చాలా అవసరం. దానికి ఒక Central Minister President గాను ప్రతి రాష్ట్రపు Chief Minister Member గాను ఉంటారని ప్రతి రాష్ట్రము నుంచి యిద్దరు మంత్రులను Governer nominate చేస్తారని వుంది. దీన్ని Governor nominate చేయడమనేది అంత మంచి పద్ధతికాదు. Chief Minister గారు nominate చేస్తే మంచిదిగాని గవర్నరుకు ఈ

Sri M. R. Appa Rao] [3rd April 1956

పరిపాలనలో కొంత స్థానము ఇవ్వటం తోటే అది ప్రజా స్వాతంత్ర్యానికి సమ్మతమైన విషయము కాదు. అంతేకాకుండా ఈ జోనల్ కౌన్సిలుకు ఇద్దరు ప్రతినిధులను ప్రతి శాసన సభనుండి ఎన్నుకోవడం మంచిదనుకుంటాను. కేరళ మద్రాసు ఆంధ్ర కర్నాటక రాష్ట్రాలలోనుంచి ఒక్కొక్క రాష్ట్ర శాసన సభనుంచి ఇద్దరు M.L.A. లను ఎన్నుకుంటే జోనల్ కౌన్సిల్లో అన్ని అభిప్రాయాలను తెలుసుకోవడానికి చుట్టు పట్లలోని ప్రజల విషయాలనుకూడా చెప్పడానికి అనువుగా ఉంటుంది. High Court విషయము మనము ఆలోచిస్తున్నాము. ఒకటే High Court మనకుండటం చాలా అవసరము. ఈ High Court హైదరాబాదులో ఉంటే గాని అక్కడ అభివృద్ధికరమైనటువంటి ఒక బారు తయారుకాదు. ఆంధ్ర రాష్ట్రములోకూడా పెద్దబారు ఒక టున్నట్లయితే చాలా అభివృద్ధికరంగా ఉంటుంది. అందుచేత High Court ఒకటే చోట హైదరాబాదులో ఉండటం మంచిది. భారతదేశములో మన రాష్ట్రము మూడవదిగా ఉన్నప్పుడు కౌన్సిలుకూడా ఉండటం చాలా అవసరం. ఈ కౌన్సిలుకు గ్రాడ్యుయేట్ కాన్సిట్యూయన్సీ నుంచి లోకల్ బోర్డు కాన్సిట్యూయన్సి నుంచి కొందరు నిపుణులను శాస్త్ర వేత్తలను తీసుకోవడం కూడా చాలా అవసరంగా ఉంటుంది. ఎందుచేతనంటే ఈ నిపుణులుగాని శాస్త్రవేత్తలుగాని Elections లో పోటీచేసి నెగ్గడానికి అవకాశములేదు. కాబట్టి వారు ఇచ్చే సలహాలు లేనిగాని, మనకుపయోగకరంగా ఉండవనిగాని అనడం మనకు సామరస్యముకాదు. ఎందుకంటే మన ఉపాధ్యక్షులవారు చెప్పినట్లు పూర్వము C. R. రెడ్డిగారు ఉండిరి. Dr. Lakshmanaswamy Mudaliar లాంటి వైసు ఛాన్సిలర్లు కొంతమంది ఉన్నారు. ఇట్లాగే అనేకమంది పెద్దల్ని, శాస్త్రవేత్తల్ని శాసన సభలో ఉంచడం అవసరం. వారిలో ఎవరినైనా మంత్రులుగా తీసుకుంటారేమో అన్న భయముంటే అందులోనుంచి మంత్రులను తీసోకుకుండా ఏర్పాటుచేసినా ఇబ్బంది లేదుగాని కొంతమంది elections లో గెలవలేని వారిని మంత్రులుగా తీసుకరావడానికి ఉపయోగిస్తున్నారనే భయంలేకుండా అందులోని వారిని మంత్రులుగా తీసుకోకూడదని నేను అనుకుంటాను. ఆ రీతిగా constitution మార్చుకోవచ్చును. అది నిపుణులకోసం ఏర్పడ్డదిగాని దొడ్డిదారిన మంత్రులను తీసికొనిరావటానికి దుర్వినియోగము చేసినట్లయితే అది ప్రభుత్వానికి కూడా మంచిదికాదు. ఇక్కడ ఉన్న మన రామకృష్ణరాజుగారు Madras Council President గా ఉండి గొప్ప సలహాలిచ్చారు. శాసనసభలో ఏదో తొందరగా ప్యాస్ చేసే కొన్ని విషయాలను కౌన్సిలులో వాటికి సరియైన సలహాలివ్వటం, దానిని మళ్లీ అసెంబ్లీలో అమెండు చేసుకొని దాన్ని సరియైన మార్గములో పెట్టడంలో జరిగిన సంఘటనలు చాలా ఉన్నవి. మనం ఇంత పెద్ద రాష్ట్ర

3rd April 1956] [Sri M. R. Appa Rao

మైనప్పుడు కౌన్సిలు మనకుండడం చాలా అవసరం. మనం ఇటువంటి కృషితోటి జోనల్ కౌన్సిల్సుతోటి Second Five Year Plan, Third Five Year Plan లలో మనము భారతలోక్ సభలోకూడా చాలా ప్రాముఖ్యత వహించబోతున్నాను. ఆంధ్రులంటే ఎవరు? ఆంధ్రదేశమంటే ఏమిటి? అని అడిగినటువంటి రోజులు 7, 8 సంవత్సరముల క్రింద ఉండెడివి. అటువంటిది పోయి మనము చాలా ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నామంటే గర్వపడవలసిన విషయము. కావున మనము సర్వతో ముఖంగా అభివృద్ధి పొంది భారతదేశమునకు మన సంపత్తిని తోడ్పాటు చెసి క్రమ క్రమముగా సర్వతోముఖ అభివృద్ధి చెందుతామని నేను ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

MR. SPEAKER :—The House will now rise and meet again at 5-30 p.m. to-day.

AFTER 5-30 P. M.

The House reassembled at half past five of the clock in the evening, Mr Speaker (Hon. Sri Rokkam Lakshminarasimham Dora) in the Chair.

## IV. GOVERNMENT MOTION.

*Re:—Amendment to Schedule* VII *to the Madras District Boards Act*, 1920.

THE HON. SRI A. B NAGESWARA RAO :— Mr. Speaker Sir, I beg to move :

> "That the following draft of a rule proposed to be made by the Governor of Andhra in exercise of the powers conferred by sub-section (1) of Section 201 of the Madras District Boards Act, 1920 (Madras Act XIV of 1920), altering Schedule VII to that Act, be approved."

### DRAFT RULE

In the said Schedule, for clause (mm) the following clause shall be substituted, namely :—

" (mm) selling wholesale or retail, or storing for wholesale or retail trade, or for purposes other than private or domestic - use, rice and broken rice, grain, groundnut,

tamarind, chillies, jaggery, pulses, flour, bran, oil-cakes, or agricultural produce including fruits and other horticultural produce which is likely to attract rats."

28-2-56 న జిల్లా మునిసిపాలిటీచట్టమును amend చేశాము. దాని ప్రకారం పాలకొల్లు మునిసిపాలిటీలో పండ్లకు లైసెన్సు కావాలని అంటే అక్కరలేదని కోర్టులో దావా వేశారు. ఆ చట్టంలోని 5 వ షెడ్యూలులో "పండ్లు" అని లేదని ఆ కేసులో ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీర్పుఇచ్చారు. అందువల్ల పండ్లనుకూడా షెడ్యూలులో చేర్చవలయుననే అభిప్రాయముతో ఈ సవరణ చేయబడింది. మద్రాసు మునిసిపాలిటీ సవరణచట్టం 28-2-56 న pass చేశాము. ఇటువంటిసవరణను అందులోకూడా చేర్చి సవరణ ప్రతిపాదించాము. అందువల్ల దీనిని అంతా ఏకగ్రీవంగా ఒప్పుకోవాలని కోరుతున్నాను.

Madras District Boards Act లోని 7 వ షెడ్యూలులో

"Selling wholesale or retail, or storing for wholesale or retail trade, or for purposes other than private or domestic use, grain, groundnut, tamarind, chillies, jaggery, pulses, flour, bran, oil-cakes, or agricultural produce which is likely to attract rats." అని ఉంది. మరొక దావాలో rice కు లైసెన్సు కావాలన్నప్పుడు, Grain does not include rice. అని కోర్టువారు Judgments చెప్పారు. అందువల్ల "Rice or broken rice" అని Madras District Municipalities Act లోని 5 వ schedule లో include చేశాము. అలాగే పాలకొల్లు మునిసిపాలిటీలో పండ్ల వ్యాపారానికి లైసెన్సుకోసం వసూలుచేసినప్పుడు దానికికూడా కోర్టులో దావా వేశారు. "కోర్టువారు Fruits do not come under agricultural produce" అనడం మూలంగా వాటినికూడా షెడ్యూల్‌లో కలుపవలసివచ్చింది. Madras District Boards Act కు ఇప్పుడు grain అంటే rice అనిగాని, లేక broken rice అనిగాని అర్థంవస్తుందనే సవరణ చేయవలసివుంటే, agricultural produce అంటే "Fruits and other horticultural produce కు" కూడా వర్తిస్తుందని కూడా సవరణ అని amendment చేయవలసి ఉంది! అందువల్ల ఈ సవరణను అందరూ అంగీకరించాలని కోరుతున్నాను.

Mr. SPEAKER :—'Agricultural produce' is generally thought to include horticultural produce. But the court held otherwise, and so they want to make it specific by adding

3rd April 1956] [Sri A. B. Nageswara Rao

two words 'including fruits' after the words ' agricultural produce '.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—A similar amendment was passed by this August Assembly on 28—2—1956 in the District Municipalities Act So this is only a similar amendment.

MR. SPEAKER :—The question is

That the following drafts of a rule proposed to be made by the Governor of Andhra in exercise of the powers conferred by sub-section (1) of Section 201 of the Madras District Boards Act, 1920 (Madras Act XIV of 1920), altering Schedule VII to that Act, be approved.

DRAFT RULE

In the said Schedule, for clause (mm) the following clause shall be substituted, namely :—

" (mm) selling wholesale or retail, or storing for wholesale or retail trade, or for purposes other than private or domestic use, rice and broken rice, grain, groundnut, tamarind, chillies, jaggery, pulses, flour, bran, oil-cakes, or agricultural produce including fruits and other horticultural produce which is likely to attract rats."

The motion was carried and the draft rule adopted.

## V. GOVERNMENT BILLS

### (1) *The Madras Entertainments Tax (Andhra Amendment) Bill* 1956.

THE HON. SRI D. SANJIVAYYA .—Mr. Speaker, Sir, I beg to introduce the Madras Entertainments Tax (Andhra Amendment) Bill, 1956 and move that the Bill be taken into consideration at once.

ఈ బిల్లు ప్రకారం వినోదపు పన్నులు విధిస్తున్నాము. మొట్టమొదట ఈ పన్ను స్థానికసంస్థలకు చెందుతూయున్నది. తరువాత ఈ పన్నును వసూలు చేయడం Sales tax administration కు transfer చేసినారు. అందువల్ల collection

charges నిమిత్తం 10% ప్రభుత్వం తీసుకుంటూ, 90% మునిసిపాలిటీలకు ఇస్తున్నది. కాని collection charges నిమిత్తం ఇప్పుడు ప్రభుత్వం 20% తీసుకొని, మునిసిపాలిటీలకు 80% ఇవ్వవలయునని ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యం. ఈ తీర్మానాను గుణ్యంగా ఎక్కడ 10% ఉన్నదో అక్కడ 20% అనియు, 90% ఉన్నచోట్ల 80% అనియు మార్చినాము. ఇంతకూ వివాదాస్పదమైనది కాదు. అందువల్ల దీనిని అందరూ అంగీకరించాలని కోరుతున్నాను

SRI PILLALAMARRI VENKATESWARLU :—దీనివల్ల ఎంత డబ్బు అదనంగా తీసుకోబోతున్నారు.

THE HON. SRI D. SANJIVAYYA :—2 లక్షల 4 వేలు అని అంచనా వేశాము.

MR. SPEAKER —Motion moved :

> "That the Madras Entertainments Tax (Andhra Amendment) Bill, 1956, be taken into consideration at once".

SRI M. NAGI REDDI —అధ్యక్షా, ఈ బిల్లువల్ల మునిసిపాలిటీలకు వచ్చే ఆదాయం మరల 10% కోస్తున్నారు. ఈ సంవత్సరకాలంలో ప్రభుత్వం స్థానిక సంస్థల యెడల అవలంబిస్తున్న వైఖరిని (బిల్లులు ద్వారా కానీయండి, బడ్జెటు ద్వారా కానీయండి,) ప్రభుత్వ దృష్టికి పదేపదే తీసుకువస్తున్నాము. చెవిటి వాళ్ల ముందు శంఖము ఊదినట్లుగా మేము చెప్పేవన్నీ అయిపోతున్నాయి. ఒక వైపున స్థానిక సంస్థలకు అధికారాలు పోతున్నాయి, ఆదాయము పోతున్నది అని అంగీకరిస్తూ, రెండవ ప్రక్కన వాళ్లకువచ్చే ఆదాయాన్ని తగ్గిస్తూ, ఈ ఒక్క పర్యాయం అంగీకరించండి, ఏకగ్రీవంగా అంగీకరించండి అని చెబుతున్నారు. ఇది చాలా విచారకరమైన విషయము. మేము, ప్రభుత్వపక్షసభ్యులుకూడా ఈ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి పదేపదే తీసుకువస్తున్నాము. దీనికి ఏమీ విలువ ఇవ్వడముగాని, వాటినిగురించి ఆలోచించడముగాని లేనేలేదు. అయినప్పటికీ వాటిని మరల ఒక పర్యాయము ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. "పాడిందే పాడరా పాచిపళ్ల దాసరీ" అన్నట్లు, మేము పాడిందే పాడే పరిస్థితి వస్తున్నది. ప్రభుత్వం అంగీకరించని విషయము వస్తున్నది ఎప్పుడూ మాట్లాడిందే మాట్లాడుతున్నాము. అని అనుకోవలసిన పరిస్థితి మాకు కలుగుతున్నది. మీరు మాట్లాడేది మాట్లాడరండి, మేము కోసేది కోస్తాము, అనేవిధంగా ప్రభుత్వంవారు చేస్తున్నారు.

SRI G. NARASIMHA MURTY :— అధ్యక్షా, సోదర సభ్యులు మాట్లాడేప్పుడు చాలా చెడ్డ ఉపమానాలు ఇస్తున్నారని అనుకొంటున్నాను. చెవిటి

వాడి ముందు శంఖం ఊదడంకంటే, ఏనుగు చెవి ప్రభుత్వంలాగా ఉన్నదంటే ఇంకా బాగా ఉంటుందేమో? పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరీ అంటే, పాడిన వారందరూ పాచిపళ్ళ దాసరులనా ఉద్దేశ్యం? అందుచేత ఇది సమంజసంగా లేదని అధ్యక్షుల వారికి మనవిచేసుకుంటున్నాను.

Sri M. NAGI REDDI :—అధ్యక్షా, మామూలుగా మనం పల్లెటూళ్లలో మాట్లాడుకునే సామాన్యమాటలే ఇవి. వాటికి అభ్యంతరం ఉన్నట్లయితే చర్విత చర్వణంగా అనవచ్చును. మనం ఈ అసెంబ్లీకి వచ్చిన తరువాత ఎన్ని మునిసిపాలిటీలకు, పంచాయితీ బోర్డులకు ఆదాయంలో ప్రభుత్వం కోతకోసినది అనే సంగతి ప్రభుత్వ దృష్టికి మరల తీసుకువస్తున్నాను.

చంద్రమౌళిగారు, స్థానిక సంస్థల మంత్రిగా యుండగా, పంచాయితీ బోర్డులను ఒక నూతన వ్యవస్థలో స్థాపించడానికి 1950 లో ఒక Amendment Act తీసుకువస్తాము అన్నారు. ప్రజలందరూకూడా చాలా సంతోషించారు. ఆ act లో ఉన్నది అమలుజరుపడంలేదు. ఉన్న ఆదాయాన్ని పెంచడానికి ఒక వైపున ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేటాయిస్తూ, అమలుజరుపడం వచ్చేటప్పటికి వారికి వచ్చేటటువంటి ఆదాయాన్ని తగ్గిస్తున్నారు. గ్రామాలను పునర్నిర్మించాలి, దేశం అభివృద్ధి కావలయునని చెబుతున్నారు. రివెన్యూ శిస్తుల ద్వారా వసూలు అయ్యేదానిలో పంచాయితీలకు భాగం ఇవ్వడములేదు.

మన రాష్ట్రంలో 1953 వ సంవత్సరములో చంద్ర మౌళిగారు ఒక Act ను Pass చేసినారు. దానివలన నూటికి 12½ రు॥లు ఇస్తామని ఉన్నది. దానిని ఇంతవరకూ అమలులోనికి తీసుకురాలేదు. ఇంత కాలంనుంచీకూడా ప్రజలు, పంచాయతీబోర్డులు దానినిగురించి ఆందోళన చేస్తూనేఉన్నాయి, అప్పుడు నూటికి 12½ తగ్గించేసినారు. వెనుకటినుంచి ఉన్నటువంటి retrospective effect ఇవ్వనవసరంలేదని చెబుతున్నారు. ఇక ముందైనా దానిని అమలులోకి తెస్తారనే ఆశ ప్రజలలో తగ్గిపోయింది. పల్లపు తాలూకాలలోను, మెట్ట తాలూకాలలోను కూడా ఈ surcharge వలన ఎక్కువ ఆదాయం వస్తున్నది. జిల్లాబోర్డులు ఆర్థికంగా వెనుకబడి, చాల హీనస్థితిలో ఉన్నాయి కనుక వాటికి 2 వంతులు ఇవ్వాలంటున్నారు. ఈ విధంగా ప్రతీ item లోకూడా తగ్గించేస్తున్నారు. మొన్నటి రోజున మన మంత్రి నాగేశ్వరరావు గారు చెప్పిన విషయమును ఒక్కసారి మంత్రివర్గ దృష్టికి తీసుకు వస్తున్నాను.

“ మనకువచ్చే ఆదాయమును తగ్గించేస్తున్నారు. గ్రాంటుల విషయంలో Demands వచ్చినప్పుడు Local Bodies లో ఇదివరకు వచ్చేటటువంటి ఆదాయ

Sri M. Nagi Reddi] [3rd April 1956

మునుకూడ తగ్గించేస్తున్నారు." అని నేను అడిగినప్పుడు "Entertainment tax లో చాలా భాగం పంచాయతీ బోర్డులకు ఇస్తున్నాము. మనం Compensate చేస్తున్నాము. అందువలన మనం ఇతర రాష్ట్రములకంటే కొన్ని విషయములలో మెరుగుగా ఉండవచ్చును. కొన్ని విషయములలో తక్కువగా ఉండవచ్చును. ఆంధ్ర రాష్ట్రం వెనుకబడినటువంటిది, లోటు రాష్ట్రం. ఇందులో చాలా చిన్న గ్రామాలున్నాయి! అని చెబుతూవచ్చారు. ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక మన దేశమునకంతకూ ఉన్నది. ఒక్క మనరాష్ట్రమునకే కాదు. ఈ మధ్యనే ఈ Demand వచ్చినపుడు Entertainment tax లో ఇస్తామని చెప్పిన ప్రభుత్వం మళ్లీ అందులోకూడా కోత పెడుతున్నామంటున్నారు. ఒకవైపున పన్నులు వేస్తూనే ఉన్నారు. ప్రభుత్వమునకు పెద్ద మెజారిటీ ఉన్నది కనుక వారు చేసినటువంటి తీర్మానములు ప్రతిపక్ష సభ్యులు అంగీకరించకపోయినప్పటికీ కూడ Pass అవుతున్నాయి.

ప్రజలమీద ఎక్కువ పన్నులు వేస్తున్నారు. ప్రజలకు ఇవ్వవలసిన దానిలో కోత పెడుతున్నారు. పన్నులు వేయకుండా ఏమైనా కోతలు పెడుతున్నారా? ప్రభుత్వమునకు డబ్బులేదా? అంటే అదికాదు. ఇప్పుడే Pass చేయబోతున్నాము. అంటూ పన్నులు వేయుటకు తయారౌతున్నారు. పన్నులు వసూలుచేయుటకు చేసిన తీర్మానములుకూడ pass అగుటకు సిద్ధంగా ఉన్నాయి. పంచవర్ష ప్రణాళికలను జయప్రదంచేయాలని ప్రజలకు ఇచ్చేదానిలో కోతలు పెడుతున్నారు. నిన్నకాక మొన్న మంత్రిగారు చెప్పినటువంటి మాటను నిలబెట్టుకొనకుండా Entertainment tax లో కోత కోయడమనేది చాలా విచారకరమయిన విషయం ఇదివరకు 10%. తగ్గడమే అన్యాయం, ఆ 10% తగ్గించవద్దని మేము ప్రభుత్వానికి చెబుతునే ఉన్నాము. Statements of Objects and aims లో చెప్పినారు. ఇంతవరకు పంచాయతీలలో వివిధరకాలుగా పన్నులు వేస్తున్నారు. కాబట్టి దానిమీద Entertainment tax లో కోతలు తీసుకొస్తున్నారు కాబట్టి ఇటువంటివన్నీ సామాన్యంగా వేయడం ఎందుకు? దీనిని ప్రభుత్వం తీసుకొని నూటికి 10 రూ॥లు ఖర్చులు తీసుకొని మిగిలిన 90 రూ॥లు పంచాయతీలకు ఇస్తామని చెప్పినారు. ప్రభుత్వమే control చేయదలచుకొన్నట్లయితే పంచాయతీ బోర్డులకు instructions ఇవ్వవచ్చును. ఈ ticket కు ఇంత Entertainment Tax వేయాలి. అని ప్రభుత్వమే నిర్ణయించాలి.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Local bodies కు ఇచ్చినట్లయితే ఈ మాత్రం ఆధాయంకూడా రాధని నా స్వానుభవం వలన చెబుతున్నాను.

SRI M. NAGI REDDI :—ప్రభుత్వం ఆవిధంగా చేసినట్లయితే నూటికి 10 రూపాయిలు మినహాయించుకొనే అవకాశం లేకపోయింది. మంత్రిగారు చెప్పిన దానితో అంగీకరించలేకపోతున్నందుకు నేను విచారిస్తున్నాను. Local Body వారు తమకు వచ్చే ఆదాయమును పోగొట్టుకొని, 2, 3 ఐందలు వచ్చే దానికి 100 రూపాయలు తీసుకొని ఏదో చేస్తామనే ఉద్దేశ్యంలో ఉన్నట్లయితే గ్రామములను అభివృద్ధి చేయాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదని స్పష్టంగా తెలుస్తున్నది.

ప్రభుత్వంద్వారా వచ్చే 100 కి 12½ ఆదాయముచు "రేట్" వేసుకొని రప్పించుకుందామనే ఉద్దేశ్యంలో పంచాయతీబోర్డులున్నాయి. ఆ entertainment tax ను ప్రభుత్వము వసూలుచేయవచ్చు Income tax వారు పుస్తకముమీద ముద్రవేస్తారు, డబ్బు deposit చేస్తారు. ఆవిధంగా ఆ ముద్రను పంచాయతీబోర్డులే వేయవచ్చును.

THE HON. SRI A. B. NAGESWARA RAO.—సినిమాహాలులలో గేటుదగ్గరివారు డబ్బుపుచ్చుకొని tickets లేకుండా పంపించడంవలన ప్రభుత్వమునకు ఎంత నష్టం వస్తున్నదో నాగిరెడ్డిగారికి తెలియదనుకుంటాను.

SRI M. NAGI REDDI :—నేను చెప్పేవటువంటి సూచనలను ప్రభుత్వం వారు పాటించినట్లయితే అటువంటివాటివలన నష్టం రాకుండాచేసికొనవచ్చును. Sales tax officer, Income tax officer 2 తాలూకాలకు ఒకరు ఉంటూ ఉంటారు. ఆయన ఏ పట్నంలోనో ఉంటారు. ఆయన సినిమాహాలుల దగ్గరకు వచ్చి ఎట్లా చూడగల్గుతారు ? ఈ అధికారం పంచాయతీబోర్డులకు ఇచ్చినట్లయితే 6, 7 members ఉంటారు గనుక వారు ప్రతి gate దగ్గరకువెళ్ళి వసూలు చేసుకుంటారు. అట్లా వారు వసూలుచేసుకోలేరు అనేదానితో నేను అంగీకరించను. 2 తాలూకాలకు ఒక officer ను నియమించి correct గా వసూలుచేయాలనుకోడం పొరపాటు. పంచాయతీబోర్డులకు అధికారమిచ్చినట్లయితే వారి staff ఖచ్చితంగా వసూలు చేసుకొనగలరు. పంచాయతీలకు ఇచ్చినట్లయితే లంచగొండితనం జరుగుతుంది అనుకోకూడదు. ఎవరి అధికారంలో ఉన్నప్పటికీ అది ఉంటూనే ఉంటుంది. ప్రభుత్వానికి గొప్ప establishment ఉన్నప్పటికీ commercial tax officers ఉన్నప్పటికీ sales tax కట్టకుండా ఎన్ని tickets sale కావటంలేదు? ఈ విషయం అందరకూ తెలుసును. ఏ సినిమా హాలులో అయినా సరే ఏ "రోజులు మారాయి" లాంటి సినిమాయో వచ్చినట్లయితే 1 st week, 2 nd week, over crowded గా ఉంటుంది. Capacity of the Cinema hall 1000, 1500 ఉన్నట్లయితే 4 రెట్లువరకు వెడుతూ ఉంటారు. Tickets మాత్రం capacity ని

Sri M. Nagi Reddi] [3rd April 1956

బట్టి మాత్రమే అమ్ముతున్నారు. ఆ లాభమును సినిమాహాలు proprietors, distributors పంచుకొంటున్న సంగతి మనకందరకూ తెలుసును. "మేము సక్రమంగా చేయగల్గుతున్నామ"ని ప్రభుత్వం అనుకోడం పొరపాటు.

ప్రభుత్వంవారు ఇస్తానన్నటువంటి 12½% తీసివేసినారు. Surcharge లో కోతపెట్టుతున్నారు. Vehicle tax వేసేందుకు వీలు లేకుండా దానికి concession ఇచ్చి తీసివేయడం జరిగింది. ఈవిధంగా పన్నులను ఎందుకు తగ్గించేశారు? Grants విషయం వచ్చేటప్పటికి తగ్గించేశారు. ఏవిధంగా చూచినప్పటికీ మనకు వస్తున్న ఆదాయమును తగ్గించేశారు. ఉన్నటువంటి ఆదాయమును తగ్గించడం మంచిపనికాదని మనవిచేస్తున్నాను. ఈ sales tax వసూలుచేసే అధికారం పంచాయతీలకు, మునిసిపాలిటీలకు ఇచ్చినట్లయితే ప్రభుత్వంవారు నూటికి 10 రూ॥లు మినహాయించుకునే అవసరంగాని, establishmentకు అయ్యే ఖర్చుగాని తగ్గించుకొనుటకు అవకాశ మేర్పడుతుంది. ప్రభుత్వమునకు రావలసిన ఆదాయము correct గా వసూలుచేసుకుంటే చాలు. పంచాయతీబోర్డులకు ఉన్నటువంటి అధికారములపై ప్రభుత్వంవారు బాధ్యతవహించి వాటిమీద 10% మినహాయించుకుందామనే అభిప్రాయముండడం మంచిదికాదు. ఆ cent percent కూడా పంచాయతీలకే ఉండేటట్లు చేయాలని కోరుతున్నాను. ఒకటి, రెండు పంచాయతీలకు ఒక సినిమాహాలు ఉంటుంది. మా తాలూకాలో మాచర్ల, గురజాల పంచాయతీలకు ఒక్క సినీమాహాలు ఉంది. అప్పుడప్పుడు నడిపూడిలోకూడ ఒకటి ఉంటుంది. ఆ రెండూకూడ major పంచాయతీలే. సినిమాహాలులవల్ల వచ్చే entertainment tax తగ్గినట్లయితే అవి 2nd class పంచాయతీలుగా మారిపోయే పరిస్థితులు వస్తాయి.

డబ్బులేని కారణంగా ఇప్పటికి 3, 4 నెలలనుంచి వారికి జీతాలు ఇవ్వడం లేదు ప్రభుత్వంవారు ఈ విధంగా ఆదాయములను తగ్గించేస్తున్నట్లయితే పంచాయతీలన్నీ 2nd Class పంచాయతీలుగానో, దివాళాకోరు పంచాయతీలుగానో తయారవుతాయి ధనలోపంవలన ఏ కార్యక్రమమూకూడ జరుగదు. అందువలన ఈ act ను సవరణకు పెట్టకుండా ఉపసంహరించుకోవాలని మనవి చేస్తున్నాను. ప్రతిపక్షసభ్యులు మాత్రమేకాక ప్రభుత్వ పక్షసభ్యులు, ఇతర Presidents, M. L. A. లు కూడ దీనినిగురించి అసంతృప్తిని వెల్లడిస్తున్నారు దీనిని ప్రభుత్వం వారు దీర్ఘంగా ఆలోచించాలి.

స్థానికసంస్థలమీద ప్రభుత్వం చూపుతున్న క్రీగంటిచూపును, సవతితల్లి ప్రేమను చూపకుండా స్థానికసంస్థల తరఫున ప్రతినిధిగావచ్చిన A. B. Nageswara Rao గారు దీని విషయంలో పట్టుదలలేకుండా చేయడం చాలా విచారకర

మయిన విషయం. గోపాలరెడ్డిగారు ఎప్పుడూ పన్నులు వేయాలంటారు, లేకపోతే తగ్గించాలంటారు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—చాలామంది పల్లెటూరిమీదనే పన్నులు వేస్తున్నారు, పట్టణములలోని వారిమీద పన్నులు వేయుటం లేదని అంటున్నారు. అందువలన తగ్గేఆదాయం బస్తీలలో తగ్గుతుంది. పంచాయతీల ఆదాయంనుంచి తగ్గేది చాలా తక్కువ.

SRI M. NAGI REDDI.—అదికూడ సరియైనట్టిది కాదనుకొంటున్నాను. అందువల్ల ఇంకా ముందు వచ్చేటటువంటి ఆదాయమునుకూడ ఇవ్వమంటున్నారు. ఈ బిల్లును సవరించుటకు సావకాశమేలేదు. ఈ Entertainment tax ఇచ్చే బిల్లును వెంటనే ఉపసంహరించుకోవాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ బిల్లు తీసుకొచ్చేటప్పుడు దీని ఉద్దేశ్యం ఫలానిదని బహిరంగంగా చెప్పలేదు. కాని III form వరకు free education ఇవ్వాలనే ఆశతోటి తీసుకొస్తున్నామని చెప్పారు. III form వరకు free education ఇవ్వడానికి నిర్ణయించామని చెపుతున్నందుకు సంతోషిస్తున్నాము. అందుకని వారిని అభినందిస్తున్నాము. ఈనాడు III form వరకు చదివేటటువంటి పిల్లలను లెక్కవేస్తే I form లో 51001 మంది ఉన్నారు II form లో 54663 మంది ఉన్నారు. III form లో 54243 మంది పిల్లలు ఉన్నారు. అంటే మొత్తం 1,59,907 మంది పిల్లలు ఉన్నారు. ఇకమీదట ఈ సంఖ్య 2 లక్షలు, 3 లక్షలు కావచ్చు. ఇన్నాళ్లనుంచి చదువుకోవాలనేటటువంటివాళ్లు జీతాలకుకూడా డబ్బులేక వెనుకపడిపోవడం జరుగుతున్నది. ఈ సంఖ్య 3 లక్షలవరకు పోవాలనే మా కోరిక. అందుకేమీ అనుమానంలేదు. అయితే ఇప్పుడు మునిసిపాలిటీలదగ్గరనుంచి తగ్గించిన మొత్తం ఎంత వస్తున్నది? III form వరకు free education కు ఇచ్చేందుకు దాదాపు 20 లక్షలు కావలసియుంటుందని అంచనావేశారు. విద్యార్థుల సంఖ్య సులక్షలు అయినట్లయితే ఇంకా ఎక్కువే కావచ్చు. కాని దానికి కావలసినంత డబ్బు, మునిసిపాలిటీలకు తగ్గించినదాంట్లోనుంచి వస్తున్నదా అని చూస్తే లక్షా 20 వేలు మాత్రమే దీంట్లో వస్తుందని అంటున్నారు. అవతల ఇంకో బిల్లు పాసైవచ్చినపుడు దాంట్లోనుంచి 4 లక్షలు వస్తుంది అంటున్నారు. మొత్తం అంతా కలిసి 5 లక్షలు అవుతుంది. 5 లక్షలతో ఎంతపని జరుగుతుందో ఆలోచించవలెనని స్థానికసంస్థలు సరిగా నిర్వహించలేకపోయాయి గనుక మంత్రిగారు ఇంక ఏమి చెపుతున్నారంటే ఇదివరకు 10% వసూలుచేసినాము, అది ఇంకా కొంచెము ఎక్కువ వసూలు చేస్తామని చెపుతున్నారు. ఇది చాల అన్యాయం. ఈ వసూలుచెయ్యడంలో

Sri Vavilala Gopalakrishnayya] [3rd April 1956

వాళ్లు సరిగా చేయ్యడంలేదు కాబట్టి sales tax officer ద్వారా వసూలుచేయడం వల్లనే ఈమాత్రం అయినా వచ్చిందని అంటున్నారు. అయితే దీనివల్ల వచ్చేడబ్బు చాలా ఖాళీ అవుతున్నదని చెప్పవలసివుంటుంది. Sales tax officers అందరు కూడా వాళ్ల పిల్లలకు చుట్టాలకు కాబోయేటటువంటి బంధువులతో సహా free pass లు ఎల్లకాలము ఉంటాయి

THE HON. SRI D. SANJIVAYYA :—Sales tax officers వెళ్లి అనేకసినిమాహాలులలో తనిఖీచేసి ticket లేకుండా ఉన్నవాళ్లను, అటువంటి Theatre owner ను book చేసినటువంటి కేసులు ఉన్నాయి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అది నిజమే. క్రొత్త సినిమా వచ్చినపుడు మొదటిరోజులలో బాగా డబ్బువస్తుంది. అందువలన అప్పుడు free pass లు చెల్లవు అని రాస్తారు. అందుచేత గేటులోఉన్నవారికి ఏమీ తెలియకుండా tickets లేనివాళ్లనందరినీ వెళ్లగొడతాడు. అందులో బహుశా ఆ ఆఫీసరుగారి భార్యకూడా బహుశా వెళ్ళివుంటుంది. అప్పుడు ఆమెకు అమాంతంగా సత్యభామకు వచ్చినంత కోపము వచ్చిఉంటుంది.

THE HON. SRI D. SANJIVAYYA:—అంత ఊహాగానంలో మనం నివసిస్తే ఎలా?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— పేరు చెప్పడానికి ఇష్టంలేకనే ఊహాగానంగా చెప్పుతున్నాను. కావాలంటే పేరుకూడా చెబుతాను. అందువల్ల తనభార్యను ఎప్పుడైతే వదలలేదో అప్పుడు ఇంకేమి చేయవలెనో తోచక ఆ sales tax officer ఆ సినిమా owner మీద ఈవిధంగా కేసు పెట్టారు. అది జరిగినకథ. Free pass లను మీరు అరికట్టగలిగితే ఎక్కువడబ్బు వస్తుందని ఒప్పుకోవడానికి నాకేమి అభ్యంతరంలేదు. కాని దానికోసం ప్రయత్నం చేయడంలేదు. ఆ argument ఇక్కడ చెప్పడం చాల అసందర్భమని నా మనవి. మరొకసందర్భంలో వచ్చినపుడు వాళ్లను చెక్ చేయడంకోసం వాళ్లకిస్తున్నటువంటి డబ్బులో మేము తీసుకొంటున్నామంటే అర్థం ఉన్నది. ఒకప్రక్క, తీసుకుంటూన్న డబ్బు విద్యావిధానాన్ని అమలుజరుపడానికిగాను అని అంటున్నారు. కాని వాళ్లయొక్క Mal-administration జాగ్రత్తచేసే అధికారం మా చేతిలో ఉన్నదని అంటున్నారు. అందువల్ల మేము మళ్ళీ డబ్బు ఎక్కువతీసుకొంటున్నామని అంటున్నారు. అందువల్ల నిజంగా వాగిరెడ్డిగారు చెప్పినట్లు స్థానికసంస్థలవిషయంలో ఏది వచ్చినా వరుసగా డబ్బుతీసుకోవడమే ఒక పనిగా ఉన్నది. Registration Fees విషయంలో percentage మాత్రామని అంటున్నారు.

పల్లెటూళ్లలో పన్ను వేస్తున్నాము గనుక బస్తీ వాళ్లమీద కూడా పన్ను వేస్తున్నామని చెప్పుతున్నారు. కాని బస్తీ వాళ్లమీద అదనంగా మీరు పన్ను వేయటం లేదు. వసూలు చేస్తున్న దాంట్లో కొంచెం తేడా వచ్చిందేగాని బస్తీ వాళ్లమీద అదనంగా వేసిన పన్నేమీ లేదు. నేను, బస్తీకిన్నీ గ్రామానికిన్నీ తగాదాపెట్టే వాళ్లమీద పన్ను వేయలేదు, వీళ్లమీద పన్ను వేయలేదు అనేటటువంటి ఆర్థిక విధానంమీద వాదించే వాళ్లలో ఒకణ్ణిగాదు. ఎవరి దగ్గర అయితే సత్తా ఉంటుందో వాళ్లమీద వెయ్యాలని చెపుతున్నాను. 'బస్తీల వాళ్లమీద పన్ను వేయడంలేదు. మామీద వేస్తున్నారు కనుక మా భూములు ముట్టుకోకూడదని' గ్రామంలోని వారు అంటూ ఉంటారు. కాని బస్తీ వాళ్లువచ్చి గ్రామాలలో ఆసాములంతా భూములను పెట్టుకొని డబ్బు బాగా సంపాదిస్తున్నారు. ఎక్కువ ధరలు పెట్టి మేము కొనుక్కోలేకుండా ఉన్నాము కనుక మా ఇళ్ల మీదకూడా పన్ను వేయవద్దు, అంతా వాళ్లమీదే వెయ్యమనే వాదం మన శాసన సభలో అప్పుడప్పుడు చూస్తూనే ఉన్నాము. అందువల్ల ఆ రెండు వాదాలుకూడా సరైనవి కావనీ ఎవరికి Taxation capacity ఎంత ఉంటుందనే దాన్ని బట్టి పన్ను వేయడమనేది ప్రధాన సూత్రమని మనవి చేస్తున్నాను. పూర్తిగా బస్తీల వాళ్లమీద వేసేదికాదు. ఇద్దరిమీదా వేయాల్సినదే. కాబట్టి మీరు తీసుకువచ్చినటువంటిది వాళ్ల హక్కులు తగ్గించడానికేగాని ఇదే మాత్రం ఉపయోగపడేది కాదని చెపుతున్నాను. 6 లక్షల రూపాయలని అన్నారు. మనం అందరంకూడా జీతాలలో 10% తగ్గించుకొనేటట్లయితే బహుశా 2 లక్షలు contribute చేస్తామేమో ? ఆ విధంగా చేస్తే గ్రామాలలో ఉన్నటువంటి పిల్లలు అంతాకూడా మా మెంబర్లంతా తగ్గించుకొనుటవల్ల మేము అనుభవిస్తున్నామని చెప్పుకోగలుగుతారు. అదే గనుక మంత్రులు 500 రూపాయలు తగ్గించుకొని మేము T.A, లు తగ్గించుకొన్నట్లయితే తేలికగా 6 లక్షలు వస్తుంది. అందువలన, ఇది తీసుకురాకుండా ఆ విధంగా చేస్తే బాగుంటుందేమోనని మనవి చేస్తున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA :—పోయిన శాసన సభలో 150 నుంచి 100 కి తగ్గించేదానికి Vavilala Gopalakrishnayya గారు ఒక తీర్మానం తెచ్చారు. కాని దానికి seconder కూడా లేక పోయినాడు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, ఈ బిల్లు ఏదో క్రొత్త ఆదాయాన్ని తీసుకువస్తుందని చెప్పుతున్నారు. సాధారణంగా పంచాయతీ బోర్డులకుగాని local boards కు గాని ఏదైన అవసరాలు ఉంటే రాష్ట్ర ప్రభుత్వం భరించాలి. వాటికి సబ్సిడీలు, loans ఇస్తున్నారు. ఆ విధంగా

ఇన్నూ మరొకప్రక్క III Form వరకు Free education introduce చేస్తున్నామని, Municipality ల దగ్గర నుంచి private individuals దగ్గరనుంచి డబ్బు తీసుకొన్నో లేకపోతే పట్టాభిరామా రావుగారి లాంటి వారిమీద పన్ను వేసో దానికి సరిచేస్తామని చెప్తున్నారు. అది సరైనటువంటి పద్ధతి మాత్రంకాదని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఇప్పుడు మనం Local Boards కు వచ్చేటటువంటి ఆదాయాన్ని “ మేము Free Education introduce చెయ్యబోతున్నాము కనుక పంచాయతీ బోర్డులలోను, మునిసిపాలిటీలలోను ఇప్పుడు చేసేటటువంటి పనులన్నిటిని చేయనక్కరలేదు ఆపేసెయ్యండి, ఒక chairman, కొంతమంది Municipal councillors ఒక పంచాయతీబోర్డు ప్రెసిడెంట్, కొంతమంది members ను ఎన్నుకొని కూర్చొండి మీరేమిచేయనక్కరలేదని ” ఒక్కమాట చెపితే సరిపోతుందేమో. అందువల్ల వారికి వచ్చేటటువంటి ఆదాయన్నంతా తీసుకొని మేమేదో మంచిపని చెయ్యబోతున్నాము గనుక ఇవన్నీ తగ్గిస్తున్నామని చెప్పడం సరైన పద్ధతికాదని మనవిచేస్తున్నాను. మంత్రిగారు మట్లాడుతూ 2 లక్షల 54 వేల రూపాయలు మాత్రమే దీనివల్ల వస్తుందని చెప్పారు. ఇంత తక్కువ మొత్తంవచ్చే పంచాయతీ బోర్డులకు డబ్బులేకుండా చేయడం మాత్రం సరిగాలేదు. Drainage Scheme లకైనా Protected water Supplly Schemes కైనా వీటన్నిటికి మనమే తీసుకొచ్చి పెడుతున్నాము. అటువంటప్పుడు Municipality ల ఆదాయాన్నికూడా తీసుకోవడంలో గల అర్థమేమిటో నాకేమీ బోధపడడంలేదు. అందువల్ల ఏ పరిస్థితులలోను ఈ బిల్లును accept చేయకూడదనే నా అభిప్రాయం ఈనాడు మునిసిపాలిటీలలోను, పంచాయతీ బోర్డులలోకూడా Entertainment tax చాలవరకు escape అవుతున్నసంగతి మనకందరికీ తెలుసు. అది ఖచ్చితంగా వసూలు కావడంలేదు. ఇందాక మంత్రిగారు చెపుతూ Municipality లకు ఇస్తే అసలు వసూలు కావేమోననే అభిప్రాయం వెలిబుచ్చినట్లు అర్థం చేసుకొంటున్నాము. అది సరైనది కాదని నేను అనుకొంటున్నాను. Corruption అంతా ఎక్కడ ఉన్నది అంటే అదంతా పంచాయతీ బోర్డుక్రింద ఉండేటటువంటి ఉద్యోగస్తులలో ఉంటున్నది.

THE HON. SRI A. B. NAGESWARA RAO:—నేను అలా చెప్పలేదు. Local Bodies చేతులలో ఉన్నదానికంటే Department లో preferable అని చెప్పాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— Local Bodies లో ఉండేటట్లయితే పంచాయతీ బోర్డు area లో పంచాయతీ Members, పంచాయతీ బోర్డు presidents ఖచ్చితంగా పనిచేసేటట్లయితే

ఇంతకంటే ఎక్కువగా వసూలు చెయ్యగలుగుతారు. అట్లాకాకుండా వాళ్లలోనే Corruption ఉన్నదని మనం భావించినట్లయితే వాళ్లు 3 సంవత్సరాలకంటే ఎక్కువ ఉండరు. వాళ్ల corruption ను ప్రజలు రోజురోజు అర్థంచేసుకుంటారు వాళ్లను prosecute చెయడానికి కూడా అవకాశం ఉంటుంది. అందువల్ల పంచాయతీలకే Entertainment tax వసూలుచేసే అధికారం ఇవ్వటం మంచిదని నేను అనుకుంటున్నాను పంచాయితీ రాజ్యమని చెపుతున్నారు. అధికారాలన్నీ తీసేసి ఊరికే Member లను chairman ను దిష్టిబొమ్మల్లాగా కూర్చోపెట్టడంవల్ల పంచాయతీ రాజ్యం అవుతుందా ?

ఒక ప్రక్కవాళ్లకు ఆదాయములేకుండా, వాళ్లకు అధికారాలు లేకుండా చేస్తూ, మరొకవైపు పంచాయితీ రాజ్యమును అమలుజరుపుతున్నామని, రామ రాజ్యంలో మొదటిమెట్టు వేస్తున్నామని చెప్పడం ఎవరిని మోసంచేయడానికో నాకు అర్థంకావడంలేదు Entertainment tax లో 10 Percent తీసుకోకుండానే, పూర్తిగా దాన్ని వసూలుచేసేటటువంటి అధికారంకూడ వాళ్లకే వదలివేస్తే బాగుంటుందని నేను సూచనచేస్తున్నాను ఒకవేళ పంచాయితీ ప్రెసిడెంట్లు, మెంబర్లు corrupt అవుతారని అనుకొంటె, వారిని prosecute చేయడం చాలా తేలిక. ప్రజలు ఇది అర్థంచేసుకొని మరునాడే ఈ బాధలను తొలగించుకోడానికి వీలుగా ఉంటుంది. ఏ పార్టీకిచెందినా, దీనికి పార్టీప్రమేయాలతో సంబంధంలేదు. ఏ పార్టీవాళ్లయినా corrupt గా ఉంటే పోవలసిందే. ఇప్పుడు ప్రభుత్వము పంచాయితీలనుంచి, ఈ tax లో 10 percent వసూలు చేసేందుకు, కొంతమంది ఉద్యోగస్తులను నియమించి వారి జీతాలు మొదలైనవాటికి ఖర్చు పెట్టవలసియుంటుంది అంటే ఈ 10 percent వసూలుచేసేది, ఈ లంచగొండి ఉద్యోగస్థులను మేపడానికి సరిపోతుందన్నమాట. ఆవిధంగా దానివల్ల ప్రయోజనమేమిలేకపోగా, పంచాయితీలకు ఆదాయములేకుండా చేస్తున్నాము. అందువల్ల ఇప్పుడు మాకు డబ్బుచాలదు గనుక 10 percent తీసుకొంటామని చెప్పేవాదన ఏ మాత్రము సరిగాలేదని చెప్పుచున్నాను. పంచాయితీలకు, మునిసిపాలిటీలకు వచ్చేటటువంటి ఆదాయంలోనుంచి, తీసుకోవడం State Government కు ఒక source of income ఎట్లా అవుతుందో నాకు అర్థంకావడంలేదు. ఏ Economics లోనైనా సరె, దేశంలో ఏక్కడైనాసరే ఈ విధంగా ఉన్నదేమో నాకు బోధపడడంలేదు వాటికి complete గా autonomy ఇచ్చి, వాటికి అధికారాలు ఇవ్వడానికి మారుగావాటికి ఏలాటి అధికారాలు లేకుండా చేస్తున్నారు. కనుక ఈ బిల్లును మేము accept చేయలేకుండా ఉన్నాము అని తెలియచేస్తున్నాము.

SRI A. YERUKU NAIDU :—అధ్యక్షా, ఈ Madras Entertainment Tax సవరణ బిల్లును నేను బలపరచలేకపోతున్నాను. మొదట 10 percent ప్రభుత్వము తీసుకోవలెననే ఉద్దేశంతో పెట్టారుఅంటే, వసూలుఖర్చు ఎత్తివేయడానికేగాని, 10 Percent హెచ్చించుకోడానికి అవకాశములేదు. అది చట్టబద్ధముకూడ కాదనుకొంటాను. Local bodies కు income రెండు విధాలుగా ఉంటున్నది, Direct revenues అని, indirect revenues అని Local bodies కు, indirect revenues లో, Entertainment tax, Compensation, and motor vehicles compensation అటువంటివి ఉన్నాయి. అటువంటిదాన్ని ప్రభుత్వము తగ్గించినట్లయితే స్థానికసంస్థలలో ప్రజలపైన ప్రభుత్వమే direct గా పన్నువేయాలని ప్రభుత్వముయొక్క ఉద్దేశమా ? అలాకానప్పుడు, స్థానికసంస్థలు direct గా ప్రజలమీద ఇంకా వేరేపన్నులు వేసినట్లయితే, ప్రజలకు ఇచ్చుకోనేది చాలాకష్టమవుతుంది. అంతేగాక, ఈ Quasi Governments కు, Local bodies కు, ప్రభుత్వము తల్లిసంస్థవంటిది. తల్లి ఆహారమేదైనా తెచ్చుకొంటే, పిల్లలకు ఇస్తుందిగాని తనకులేదని పిల్లలనుంచి తీసుకోదు. ఏలాగూ పిల్లలకు ఇచ్చినది తల్లితీసుకోదు, ఆ విధంగానే మన స్థానికసంస్థలకు ఇచ్చినది ప్రభుత్వము తీసుకోవడం ఏ మాత్రము సవ్యంగాలేదు. తరువాత ఇటువంటిది వచ్చినప్పుడు, స్థానికసంస్థలు నిర్వహించలేవని, వాటికి revenue లేదని చెప్పుతున్నారు. అదేవిధంగా జిల్లాబోర్డులకు రాబడిలేదని జిల్లాబోర్డు ఎన్నికలు ఆపుదలచేశామన్నారు. కాని ప్రభుత్వము స్థానికసంస్థల రాబడిని తగ్గించివేసి క్రమేణ ఈ బాధ్యతవాళ్లమీద పెట్టినట్లయితే, చాలా కష్టంగా ఉంటుంది. ఇటువంటిది ప్రభుత్వము విరమించుకోవలెనని ప్రార్థిస్తున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—అధ్యక్షా, ఇప్పుడు మాట్లాడినటువంటివారిలో, శ్రీ ఎరుకునాయుడుగారు తప్ప కొదమవారందరూ పంచాయితీబోర్డులకు సంబంధించినటువంటివారే. వారు ఒకరుమాత్రము మునిసిపల్ area కు సంబంధించినటువంటివారు. ఈ వినోదపుపన్నులో 10 percent తీసుకొనే విషయములో కొన్ని అపోహాలు ఉన్నట్లు కన్పిస్తున్నాయి. అసలు దీని ఉద్దేశమేమిటో తెలియజేస్తాను, ఇప్పుడు మునిసిపాలిటీలకు ఇస్తున్నటువంటి Toll compensation వారికి లేకుండాచేస్తే, 6½ లక్షల రూపాయలు గవర్నమెంటుకు మిగులుతుందని—దీనికి తరువాతబిల్లు ఒకటి రాబోతుంది—తరువాత ఈ Entertainment tax లో 10 percent తీసుకోవడంలో, ఈ సంవత్సరం లెక్కలుబట్టి దాదాపు 4 లక్షల రూపాయలు వస్తుందని అంచనా వేసుకొన్నారు. అంటే, ఇప్పుడు ఇస్తున్నటువంటి Compensation కానివ్వండి, లేక Statutory గా ఇచ్చేటటువంటి Grant కానివ్వండి, ఇది ఇవ్వకపోవడంవల్ల 10½ లక్షల రూపాయల్లు

గవర్నమెంటుకు మిగులుతుంది. III From వరకు free education ఇచ్చే ఉద్దేశంతో ఈ విధంగా చేయబడుతున్నది. III from వరకు free education ఇస్తే, 12 లక్షల రూపాయలు ఇప్పుడు ఖర్చుఅవుతుంది. తరువాత 2,3 సంవత్సరాలకు, 15 లక్షలు కావచ్చునని ఒక అంచనా వేసుకొన్నారు. అయితే, ఆ సంస్థలకు ఇస్తున్న compensation తీసుకోవడంవల్ల, 10½ లక్షలుమాత్రమే వస్తుంది దాని జతకు ఇంకొకలక్షో, రెండులక్షలో గవర్నమెంటు పెట్టుకోడానికి సంసిద్ధంగాఉన్నది. Second Five Year Plan లో లేకపోయినప్పటికే III From వరకుఅంటే 13, 14 సంవత్సరములవరకు free education ఇవ్వాలంటే, ఏదో ఒక రకంగా మన ఆదాయం పెంచుకొని లేదా ఖర్చులనైనా తగ్గించుకొని ఇవ్వవలెనా లేదా అనేది consider చేయవలసియున్నది. ఈ విధంగా ఏదో ఒక ఏర్పాటు చేయకపోతే, ప్రభుత్వము ఇప్పుడు ఉచిత విద్య యిప్పించుటకు వీలులేదనుకొంటాను. ఎక్కడనుంచో ఆదాయము తెచ్చి చేయండి అంటే ఇప్పటి పరిస్థితులలో అది చేయడానికి వీలులేదు. కాబట్టి, శాసన సభ్యులు ఈవిధంగా III Form వరకు Free education ఇవ్వ వచ్చుననో, లేక ఇప్పుడు ఎట్లున్నది అట్లే ఉంచుకోవచ్చుననో నిర్ణయము చేసుకోవచ్చు. స్థానిక సంస్థల పట్ల ప్రభుత్వము సవతి తల్లి ప్రేమ చూపుచున్నదని నాగిరెడ్డిగారు చెప్పుతున్నారు. అదే క్రీగంటి చూపు అంటున్నారు. అదే అనుకోండి, అది పొరబాటు అంటున్నాను. ఇప్పుడు పంచాయితీలకు 12½ per cent ఇస్తామను కొన్నది తీసివేసినాము. అది ఇస్తాము అని చెప్పామేగాని ఇప్పుడు ఇచ్చిందేమిలేదు, కనుక దానివల్ల మీకు వచ్చే నష్టమేమిలేదు. ఏ సంవత్సరమైతే ఈ విధంగా పంచాయితీలకు ఇస్తామని Act pass చేసినామో, అదే సంవత్సరం, ఇప్పుడు ఉన్నటువంటి పరిస్థితులలో Land Revenue లో నుంచి రూపాయికి రెండు అణాల చొప్పున, పంచాయితీలకు ఇవ్వలేమని ఒక G.O. pass చేసినాము. ఆవిధంగా ఒకే చేతితో Act, మరొక చేతితో G.O. pass చేసినాము. ఆనాటినుంచి ఈనాటి వరకు ఏమీ ఇచ్చిండి లేదు. అందువల్ల ఏదో ఇస్తున్నారు. దాన్ని తీసివేసినారనే మాటలేదు. జిల్లా బోర్డులు మరీ అధ్వాన్న స్థితిలో ఉండి, స్కూళ్లు మొదలైనవి maintain చేయలేకుండా, వాళ్ల సిబ్బందికి జీతాలుకూడ ఇవ్వలేనటువంటి పరిస్థితులలో, పంచాయితీలకు అంతకు ముందు ఇస్తున్నటువంటి 4 per cent ను 5 per cent చేసి దాంట్లో 3 per cent పంచాయితీలకును 2 per cent జిల్లా బోర్డులకును ఇచ్చినారు. స్థానిక సంస్థలమీద మాకు సవతి తల్లి ప్రేమ అయితే, జిల్లా బోర్డులకు ఈవిధంగా ఇవ్వవలసిన అవసరమేమిటి? స్థానిక సంస్థలకు సహాయము చేయడానికే ఈ విధముగా 4 per cent ను 5 per cent కు హెచ్చించామేగాని మరేమీకాదు. ఈ స్థానిక

సంస్థల విషయము మేము చూచినాము. ఇప్పుడు ఎక్కువ భాగము మునిసిపాలిటీలకే నష్టమని చెప్పవలసియుంటుంది. ముఖ్యంగా ఈ entertainment tax లో గాని, abolition of compensation విషయంలో గాని, మునిసిపాలిటీలలో ఉన్నవాళ్లు అభ్యంతరం పెట్టితే అందులో అర్థమున్నదిగాని పంచాయితీలు అభ్యంతరం పెట్టడమంటే నాకు అర్థం కావడంలేదు. ఎందువల్లనంటే, దీనివల్ల మునిసిపాలిటీలకు 3, 4 లక్షల రూపాయలకు పైగా ఆదాయం పోతుంది. ఇన్ని పంచాయితీలు కలిపినా, వాళ్లకు వచ్చేటటువంటి entertainment tax బహుశా లక్ష రూపాయలుకూడా ఉండదు. గుంటూరు, విజయవాడ, విశాఖపట్టణం, రాజమండ్రి, కాకినాడ, ఇటువంటి పెద్ద మునిసిపాలిటీలలో entertainment tax ఎక్కువ వస్తున్నది. కాబట్టి వాటికి ఎక్కువపోతుంది. అందువల్ల మునిసిపాలిటీలే నష్టపడతాయిగాని, పంచాయితీలకు అలాంటి నష్టము ఉండదు కాని దానివల్ల corresponding advantage ఎంత ఉన్నదో చూడండి. III Form వరకు free education ఇచ్చేదానివల్ల, మునిసిపాలిటీలలో ఉన్నవారు, అక్కడ దగ్గర దగ్గర స్కూళ్లు ఉండడంవల్ల, ఎక్కువ ఉపయోగము పొందుతారు. పల్లె సీమలలో ఉన్నవాళ్లుకూడ ఎక్కడ Middle School ఉన్నదో, High School ఉన్నదో అక్కడకుపోయి ఉచిత విద్య సంపాదించుకోడానికి ప్రయత్నం చేస్తారు. కాబట్టి corresponding advantage ఎక్కువగా ఉన్నప్పుడు ఎవరు అట్టే ఆక్షేపణ చేయనవసరం లేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—పంచాయితీ బోర్డులకు ఆదాయము తగ్గితే, మిగిలిన ఖర్చులకు వాళ్లు ఇబ్బంది పడతారంటారా, [illegible] ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇప్పుడు దీనివల్ల పంచాయితీలకు పోయేదేమీ చాలా కొద్దిగా పోతుంది. కాని మాకు అన్నీ కలిసి లక్ష రూపాయలు ఒక నిండు మొత్తంగా వస్తుంది. ఒక major పంచాయితీ బోర్డుకు 10 per cent అంటే, అయిదో పదో మాత్రమే పోతుంది. కాని మాకు మొత్తంగా ఒక లక్ష రూపాయలు వస్తుంది. కాబట్టి వాళ్లకు అట్టే నష్టముండదు.

మరొక విషయము చూడండి. పోయిన సంవత్సరమునకు యీ సంవత్సరమునకు [illegible] 4 లక్షలు entertainment tax క్రింద ఎక్కువ వస్తున్నది. [illegible] ఉన్నాయి. 1954-55 సంవత్సరము కంటే 1955, [illegible] entertainment tax ఎక్కువ వచ్చింది. అది రెండు విధ[illegible] Commercial Tax Department వారు theatres

నుంచి వచ్చే tax ను ఎక్కువచేసి, కొంచెము కఠినముగా చర్యలు తీసుకుని వసూలు చేస్తున్నందువల్ల, యీ tax ద్వారా కొంచెము ఆదాయము ఎక్కువగా రావడము కన్పిస్తున్నది. ఇది ఒకవిధము. ఇంకొక విధము ఏమిటంటే, generalగా national income మనకు పెరుగుతున్నది. ఈవిషయమై లెక్కలువేసిచూచారు మొత్తముమీద national income ప్రథమపంచవర్ష ప్రణాళికవల్ల ఎక్కువఅయిందని, ద్వితీయ పంచవర్ష ప్రణాళికవల్ల దాదాపు 25% దాకా పెరుగుతుందని అంచనాలువేస్తున్నారు. National income ఎప్పుడైతే ఎక్కువ అవుతున్నదో, మంచి మంచి సినిమాలు వస్తూంటే జనులు చూడడమునకు పరుగెత్తుతూ ఉంటారు. కాబట్టి దానివల్ల entertainment tax కూడ ఎక్కువకావటానికి అవకాశాలు ఉన్నవి. దీనినిబట్టి income ఎక్కువగా ఉబుకుతూ ఉంటుంది. పోయిన సంవత్సరము 37 నుంచి 38 లక్షలదాకావస్తే, యీసంవత్సరము 43 లక్షలదాకా entertainment tax రాబోతుంది. మంచి మంచి సినిమాలు రావడమువల్ల entertainment tax ఎక్కువగా వస్తూ ఉంటుంది. ఇందులోనుంచి 10% తీసుకున్నప్పటికినీ పంచాయతీలకు net loss అట్టే ఎక్కువగా ఉండదు. బహుశ loss అనేది ఉండనే ఉండదు అనుకుంటాను. ఒకవేళ ఎక్కడైనావస్తే బెజవాడ, గుంటూరు, యిటువంటి పెద్ద పెద్ద మునిసిపాలిటీలు ఉన్నచోట, ఆ మునిసిపాలిటీలకు కొంచెము నష్టముగా ఉంటే ఉండవచ్చు. అయినప్పటికినీ, ఎక్కువ entertainment tax వస్తూందికాబట్టి ఆ నష్టము భరించ వీలు అవుతుందనికూడ నేను అంటున్నాను. ఇది గాక ఇంకొక విషయము చూడండి. మనము మద్రాసులో ఉన్నప్పుడు 1926 వ సంవత్సరములో Public Resorts Act అని ఒకటి మద్రాసుగవర్నమెంటువారు ప్యాసుచేశారు. ఈ యాక్టు ప్యాసుచేసినప్పుడు మునిసిపాలిటీలకు యిష్టమైతే యీ యాక్టుక్రింద పన్ను విధించుకుంటే విధించుకోవచ్చును అని ఒక option కూడ మునిసిపాలిటీలకు యిచ్చారు. కాని అప్పుడు మద్రాసు ప్రెసిడెన్సీలో ఉన్న అన్ని మునిసిపాలిటీలలోను 18 మునిసిపాలిటీలు మాత్రము యీ పన్ను విధించారు. తక్కినవి విధించలేదు. దానిమీదట రాజగోపాలాచారిగారి హయాములో 1939 వ సంవత్సరములో prohibition ప్రవేశపెట్టినప్పుడు, మునిసిపాలిటీవారు entertainment taxను ఉపయోగించలేకుండాపోయారు. కాబట్టి ఆయన దీనిని provincialise చేసి, అప్పటికి పన్ను విధించి వసూలుచేసుకున్న 18 మునిసిపాలిటీలకు, వారు వసూలు చేసిన సొమ్మును 3 సంవత్సరములకు average కట్టి, అది compensation గా యిచ్చివేద్దామని ఉద్దేశించి, యింకను వచ్చినసొమ్ముతో prohibition వల్ల వచ్చే లోటునుగూడ పూర్తిచేసుకోవచ్చునని ఆలోచించి 1939 వ సంవత్సరములో Madras Entertainment Tax Act అనేది ఒకటి ప్యాసుచేయించారు. ఈ entertainment tax అనేది రాష్ట్రములో ప్రప్రథమముగా వచ్చింది. అప్పుడే

Dr. B. Gopala Reddi] [3rd April 1956

అంటే Public Resorts Act మూలముగా, entertainment tax act రావడము సంభవించింది. అప్పటినుంచికూడా స్థానికసంస్థలకు యేదీ యివ్వలేదు. కాని Public Resorts Act క్రింద వసూలుచేసిన 13 మునిసిపాలిటీలకు 3 years average కట్టి compensation యిచ్చారు. ఈ 13 మునిసిపాలిటీలకు compensation మాత్రమే యిచ్చారుగాని, అప్పటినుంచి స్థానికసంస్థలకు ఒక దమ్మిడీకూడ యివ్వలేదు. తరువాత 1945 వ సంవత్సరములో యుద్ధము జరిగేకాలములో ఉద్యోగులకు dearness allowance అనేది ఇవ్వడము ఆరంభించినప్పుడు, మునిసిపాలిటీలకుకూడ కొంతవరకు ఖర్చులు ఎక్కువ అవుతున్నవనే విషయము దృష్టిలో పెట్టుకుని అప్పుడు ప్రభుత్వానికి advisor గా ఉన్న స్ట్రాథీగారు యీ entertainment tax లో నూటికి 90 వంతులు మునిసిపాలిటీలకు యిస్తాము, తక్కిన 10% మేము ఉంచుకుంటామని అన్నారు. 1939 లో రాజగోపాలాచారిగారు యిది అంతా provincialise చేసి, 1913 మునిసిపాలిటీలకు compensation యిస్తామని చెబితే Strathie advisor గావున్నపుడు entertainment tax లో నూటికి 90 వంతులు మునిసిపాలిటీలకు local bodies కు యిస్తామని చెప్పారేగాని, 1945 వరకు ఒక దమ్మిడీకూడా యివ్వలేదు, 1945 నుంచి మాత్రము ఈనాటి వరకూ, మొదట చెప్పినప్రకారము 90% మాత్రమే యిస్తూవస్తూన్నారు. ఆ 90%ను 80% గా చేసుకుని, 10% బదులు 20% గా మాకు యివ్వండి, దానివల్ల మాకు దాదాపు నాలుగలక్షలదాకా వస్తుంది. యీ నాలుగులక్షలలో దాదాపు మూడు లక్షలదాకా మునిసిపాలిటీలలో ఖర్చులక్రింద సరిపోతుంది. తక్కిన లక్షరూపాయలు మండలాలలో ఉన్న పంచాయితీలకొరకు ఖర్చులకుసరిపోతుందిఅని అనుకొని అడిగాము. 1931 వ సంవత్సరములో మునుస్వామి నాయుడుగారు tolls అన్నీ abolish చేసిన తరువాత, అంతకు ముందు tolls మీద మునిసిపాలిటీలకు ఎంతవస్తూ వున్నదో, అంత సొమ్ము compensation గా యిప్పటివరకూ యిస్తూవస్తున్నారు. ఆ compensation అంతా లెక్కచూస్తే, అది సుమారు 6, 5 లక్షల దాకా అవుతున్నది. ఇది యిప్పటికి 25 సంవత్సరాలుగా జరుగుతూవస్తున్నది. ఇప్పుడు యీ Compensation అంతా తీసివేస్తే, ఒక్క మునిసిపాలిటీలకు నష్టము అయితే కావచ్చుగాని, పంచాయితీలకు మాత్రము నష్టము కాదు. దానిమీద 6.5 లక్షలు, దీనిమీద 4 లక్షలు, అంతాచేసి మొత్తము 10.5 లక్షలు అవుతుంది. ఇప్పుడు ఈ సొమ్ముతో ప్రభుత్వము III Form వరకు ఉచిత విద్యావిధానము అమలు పెట్టుతున్నది. కాబట్టి [illegible] రెండు మూడు లక్షలవరకూ కొంచెము ఎక్కువగా ఖర్చు అయినప్పటికిన్నీ, [illegible] క్రమ క్రమేణా ఆ భారము కొంతవరకూ తగ్గించుకోవచ్చును. కాబట్టి [illegible] ప్రభుత్వానికి Local bodies మీద సవతి తల్లి ప్రేమ [illegible] [illegible] ఒక్కటే శాసనసభలో కొంతమంది సభ్యులతో కలిగినప్పటికిన్నీ,

3rd April 1956] [Dr. B. Gopala Reddi

అటువంటిది నేమీలేదని మాత్రము చెబుతున్నాను. ప్రభుత్వము ఏ పన్నులు వేసినప్పటికినీ, యిప్పుడు యీ పన్ను అయినను రైతులమీదనే పడుతున్నది గాని పట్టణములో ఉండే వారిమీద పడడములేదు. అనేది నా అభిప్రాయము కాదు. ఇది మన ఎసెంబ్లీ సభ్యులలోనే ఏర్పడింది. కాని ఒక్క విషయము మాత్రము చెప్పవచ్చు. మునిసిపాలిటీలకు యింతవరకూ యిస్తున్న statutory grant యికమీదట యివ్వకుండా తీసివేస్తున్నాము. దానివల్ల మునిసిపాలిటీలకు యిచ్చే యీ పది లక్షలున్నూ, యికమీదట యివ్వకుండా, యీ సొమ్ముతో III form వరకూ ఉచిత విద్యావిధానము ప్రవేశపెట్టాలని ప్రభుత్వము నిర్ణయించింది. ఈ సొమ్ము ఆ విధముగా ప్రభుత్వము సద్వినియోగము చేస్తున్నది. నాగిరెడ్డిగారు పంచాయితీల మీద ప్రభుత్వము కఠినముగా వజ్రాయుధముతో కొట్టాలని చూస్తున్నదని అన్నారు కాని, అటువంటిది ఏమీలేదని అంటున్నాను. ఇందులో ప్రమాదకరమైన విషయము యేమీ ప్రభుత్వము చేయలేదు. పంచాయితీలకు సక్రమంగా ఎన్నికలు జరిపించాలనే ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము. ఎప్పుడైతే III form వరకూ పిల్లలకు ఉచితముగా విద్య బోధన ప్రభుత్వము యివ్వదలచిందో, అప్పుడే పల్లెలలోనూ, పట్టణములలోనూ ఒక నూతన శక్తి, ఉత్సాహము ప్రజలకు వస్తుంది. అందు ముఖ్యంగా వెనుకబడిన తరగతుల వారిలోనూ, వెనుకబడిన ప్రాంతాల వారిలోనూ తప్పకుండా కలుగుతుంది. వాళ్ల పిల్లలందరూ వచ్చే జూలై నుంచి III form వరకూ ఉచితముగా విద్య నేర్చుకోవటానికి అవకాశము కలుగుతున్నది. వాళ్లు ఎంతో ఉత్సాహముతో చదువుకుని ఉత్తీర్ణులు కావటానికి అవకాశము కలిగింది. ప్రభుత్వము నిజముగా చేసిన సాహస కృత్యములలో యిది మొదటిది అని గట్టిగా చెప్పగలను. ఇటువంటి సాహసకృత్యము, ఉత్తర హిందూస్థానములోగాని, Bihar లో గాని, బెంగాల్‌లోగాని ఎక్కడనూ చేయలేదు. ఈ విధముగా చేసింది మొదటిసారిగా మన రాష్ట్రములోనే. మద్రాసు రాష్ట్రములో మాత్రం కొంతవరకూ చేశారు. ఈ Entertainment Tax మూలముగా 10 లక్షలు ప్రభుత్వము సంపాదించి, సుమారు 12, 18 లక్షల దాకా ఉచితవిద్యక్రింద ప్రభుత్వము ఖర్చుచేయదలచుకున్నది. దీనివల్ల మునిసిపాలిటీలకు net loss ఏమాత్రమూ ఉండదు. ఎందుకంటే, కొత్త కొత్తవి, మంచి సినిమాలు వచ్చినప్పుడు, National Income పెరగడమువల్ల ప్రజలు ఆ సినిమాలు అన్నీ చూడడమువల్ల Entertainment Tax ఎక్కువగా వస్తున్నది. అంతేకాని, మునిసిపాలిటీలకు ఏ విధముగాను నష్టమనేదే లేదు కాబట్టి సభ్యులందరూ యీ బిల్లు విషయములో ఎక్కువగా చర్చ లేకుండా, యీ బిల్లు, రాబోయే బిల్లు, రెండూకూడా, ఆమోదిస్తారని ఆశిస్తున్నాను. (Laughter).

SRI PILLALAMARRI VENKATESWARULU :—మునిసిపాలిటీలకు దీనివల్ల net loss ఏ మాత్రము ఉండదని మంత్రిగారు అంటున్నారు. అలాంటప్పుడు ఏ ఏ పంచాయతీ బోర్డులకు, ఏ ఏ మునిసిపాలిటీలకు ఎంతెంత వస్తున్నదో అంతా కూడా ప్రభుత్వము గ్యారంటీ చేస్తూన్నట్లుగా, యీ బిల్లును పాసు చేద్దామా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— అటువంటిది అవసరం లేదు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మన రాష్ట్రములో National Income జాస్తి కాబోతున్నది. అప్పుడు యిప్పటికంటే యింకా ఎక్కువమంది సినీమాలకు పోబోతారు. మునిసిపాలిటీలకు యింకా ఎక్కువగా Entertainment tax రాబోతుంది కాబట్టి నష్టముఅనేది ఏమీఉండదు.

MR SPEAKER —The question is :

> "The Madras Entertainments Tax (Andhra Amendment) Bill 1956 be taken into consideration."

The motion was declared carried. Sri Pillalamarri Venkateswarlu pressed for a division. Voting by counting of heads took place, 56 voted for the motion and 13 against the motion and neutrals nil. The motion was carried.

MR. SPEAKER :—We shall now proceed to the consideration of the clauses.

## CLAUSE 2

MR. SPEAKER :—Motion moved :

> Clause 2 do stand part of the Bill.

SRI S. VEMAYYA :—Sir, I beg to move :

> In sub-clause (1) of clause 2, for the word 'twenty' substitute the word 'five'.

ఈ Amendment లో ఒక విషయము చేసి చెప్పదలచుకున్నాను. రాష్ట్రములో ఉచిత విద్యకు సంబంధించి ప్రభుత్వానికి డబ్బు కావాలి కాబట్టి, అధికారము తీసుకుంటున్నామని మంత్రిగారు చెబుతున్నారు. అయితే యీ డబ్బు Entertainment tax ద్వారా రావాలని ప్రభుత్వము ఉద్దేశిస్తుంటే, [illegible] Entertainment tax Act యొక్క Provisions [illegible], honest గాను ఉద్యోగస్థులు apply చేసి, కఠినముగా అమలు

జరిపితే, ప్రభుత్వము కోరేటటువంటి డబ్బు అంతా కూడ వస్తుందని నా గట్టి నమ్మకము అదిన్యాయముగా Local bodies కు చేరవలసిన సొమ్ము. అది తీసుకో వాలని ప్రభుత్వము ఆశపడడము సబబుకాదు. ఇదిగాక మరొక విషయముఉన్నది. సినిమాల బుక్కింగు ఆఫీసువద్దయిచ్చే టిక్కెట్లకు కొన్నింటికి నెంబర్లు ఉండవు. జనము జాస్తిగా వస్తే హాలులో చోటుఉన్నదా లేదా అనే విచక్షణలేకుండా, ఒకసారి అమ్మిన టిక్కెట్లు గేటువద్ద వసూలుచేసి, మరల అనేటిక్కెట్లనుఅమ్మడం జరుగు చున్నది. దీనినిబట్టి ticket issue books serial number ఎంతవరకు అయితే ప్రింటుచేసి ఉంటారో, ఆ నెంబరువరకేనని సినీమాహాలు మేనేజర్లు లెక్క చూపిస్తారు. అమ్మినవే, తిరిగి అమ్మిన టిక్కెట్లు లెక్కలోనికిరావు. అటువంట ప్పుడు Tax వేయటానికి ఎన్నిటిక్కెట్లు అమ్ముడుపోయినవో. ఎంతమంది జనము వచ్చారో లెక్కచూస్తే, నిజస్థితి బైటపడుతుంది. కాబట్టి యీ విషయము నేను ప్రభుత్వానికి హెచ్చరికచేస్తున్నాను. ఇక్కడే ప్రభుత్వాన్ని సినీమాహాలు ప్రొప్రై టర్లు మోసము చేస్తుండడము, ప్రభుత్వానికి రావలసినసొమ్ము ఎంతో రాకుండా పోతున్నది, ప్రభుత్వము యీ విషయములో ఎప్పుడైనా చర్య తీసుకున్నదా అని అడుగుతున్నాను. ఈ విధముగా జరగడము, దీనిని ప్రభుత్వము నోటీసుకు తీసుకుని రాకపోవడము జరగడమువల్ల, యిందులో ప్రభుత్వోద్యోగస్థులకు, సినీమా హాలువారికి ఏదో లావాదేవీలు, ఒప్పందాలు ఉన్నవని ఖండితముగా చెప్పాలను. Check చేయండి, యిక్కడ మోసముజరుగుతున్నది. చూడండి అని Check చేసే అధికార్లకు చెబితే, వారువచ్చి Check చేయరు. దీనినిబట్టి, ప్రభుత్వమే గ్రహిం చాలని అంటాను. సినీమా టిక్కెట్ల బుక్కింగుకు సరియైన checking లేదు. ప్రభుత్వానికి రావలసిన Tax సక్రమంగా వసూలుకాకుండా మోసము అయిపో తున్నది అని ఖచ్చితముగా తేలుతున్నది. కాబట్టి యికమీదటనైనా, tickets ను check చేయటాని proper steps తీసుకుంటే, ప్రభుత్వానికి యింకా ఎంతో సొమ్ము రావటానికి అవకాశము ఉంటుంది. పంచాయితీలకు 10% ప్రభుత్వం యివ్వకుండా పోవటానికి అవసరము ఉండదు. Proper steps తీసుకుంటే, అనుకున్న ఆదాయముకంటే, ఎక్కువే వస్తుంది గనుక, పంచాయితీబోర్డులకు యిచ్చే 10% ఇచ్చివేయటానికి అవకాశము ఉంటుంది. అటువంటి అవకాశము లేకుండా ప్రభుత్వము చేస్తున్నది కాబట్టి, యీ బిల్లును నేను వ్యతిరేకిస్తూ, నా సవరణ ఆమోదించాలని కోరుతున్నాను. నా సవరణ అంగీకరిస్తే Local bodies కు యిచ్చే డబ్బుకూడా వారికి లాభకరముగా ఉంటుంది. ఈ సొమ్ము తీసుకోవడము సబబుకాదని చెబుతూ, నా సవరణను ఆమోదించమని కోరుతున్నాను.

The amendment was duly seconded.

THE HON. SRI D. SANJIVAYYA :—I am opposing it.

MR. SPEAKER :—The question is :

In sub-clause (1) of clause 2, for the word 'twenty' substitute the word 'five'.

The motion was lost.

SRI VAVILALA GOPALAKRISHNAYYA : –Sir, I am not moving my amendment.

MR SPEAKER :—The other amendments are consequential and so they do not arise. The question is :

Clause 2 do stand part of the Bill.

The motion was carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

THE HON SRI D. SANJIVAYYA :—Sir, I beg to move,

"That The Madras Entertainments Tax (Andhra Amendment) Bill, 1956 be passed into law."

MR. SPEAKER :—The question is: 'That the Madras Entertainment Tax (Andhra Amendment) Bill, 1956 be passed into law'

The motion was put and carried and the Bill was passed into law.

## VI. MESSAGE FROM THE GOVERNOR:

Re :—*The Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill,* 1956.

MR. SPEAKER :—I have to announce to the House that the following message has been received from the Governor :—

In pursuance of Article 207 (1) of the Constitution of India I. Chandulal Madhavlal Trivedi, Governor of Andhra, hereby recommend to the Andhra Legislative Assembly the introduction of the Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill, 1956.

## VII. GOVERNMENT BILLS.

(3) *The Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill,* 1956.

THE HON. SRI D. SANJIVAYYA :—Mr. Speaker, Sir, I beg to introduce the Madras Motor Vehicles Taxation (Andhra

Amendment) Bill, 1956 and move that the Bill be taken into consideration at once.

ఈ బిల్లును ప్రతిపాదించడానికి గల కారణాలు చాలా విశదంగా ముఖ్యమంత్రి గారు ఈ శాసన సభలో వివరించారు. 1931 వ సంవత్సరానికి పూర్వం Motor Vehicles మీద tax ఉండేదికాదు. అప్పుడు toll gates పెట్టి స్థానిక సంస్థలు పన్ను వసూలుచేస్తూ ఉండినాయి. 1931 వ సంవత్సరంలో వాటిని abolish చేసి The Madras Motor Vehicles Taxation Act అనేటటువంటిది ఆమోదించి 1931 కి పూర్వం వరుసగా మూడు సంవత్సరములలో వచ్చిన ఆదాయంలో సరాసరి తీసుకొని అంత ఆదాయం నష్టపరిహారంగా స్థానిక సంస్థలకు ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. కాని ఈనాడు ఈ బిల్లు ప్రకారం Municipalities కు ఇస్తూ ఉండేటటువంటి ఆ మొత్తాన్ని ఇవ్వకుండా చేసి దానివల్ల దాదాపు సంవత్సరానికి 6 లక్షల రూపాయిలు ప్రభుత్వానికి ఆదాయం వచ్చేటట్లు చేస్తున్నాం. ఆ నిర్ణయం ప్రభుత్వం తీసుకున్న కారణంగా ఈ Motor Vehicles Taxation Act లో consequential amendments చేయబోతున్నాము. ఇది వివాద గ్రస్తమైన అంశంకాదు. దీనిమీద చర్చలేకుండా తప్పకుండా — ముఖ్య మంత్రిగారు అన్ని విషయాలు చెప్పారు కాబట్టి-శాసనసభ్యులు సంతృప్తిపడి దీన్ని ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

MR. SPEAKER.—Motion moved—

"That the Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill, 1956, be taken into consideration at once".

SRI G. JAGANNADHA RAJU :—అధ్యక్షా, ఈ Amendment నేను మనస్ఫూర్తిగా oppose చేస్తున్నాను. దానికి కారణం ఏమిటంటే ఇంతకుముందు ఉంటే Toll gates వల్ల చాలా income District Boards కే కాకుండా Municipalities కి కూడా వస్తూండేది. భీముడి పట్నం మ్యునిసిపాలిటీకి రాబడంతా toll gates వల్లనే. ఆ toll gates abolish చేసినప్పుడు గవర్నమెంటు మ్యునిసిపాలిటీకి చాలా సొమ్ము pay చేసింది. ఇప్పుడిది తీసేసినట్లయితే భీముడి పట్టణం municipality రేపు సాయంత్రానికి insolvency petition తో ready కావడానికి ఏమీ అభ్యంతరం ఉండదని నా పూరా నమ్మకం. దానికి ఇంకో source of income లేదు. అందుచేత దానికివచ్చే రాబడికి బదులుగా ఈ tax లో నుంచి ఇస్తామని promise చేసి toll gates abolish చేసి, ఇప్పుడా tax ఇవ్వం అనడం ఏమీ న్యాయంకాదు. ఇప్పుడు ఆ రెండో tax ని గురించి మాట్లాడుతూ

Sri G. Jagannadha Raju] [3rd April 1956

గోపాలరెడ్డి గారు పంచాయితీ బోర్డులకు 12½% ఇస్తామన్నామేగాని, ఎప్పుడూ ఇవ్వలేదు కాబట్టి ఇప్పుడది ఎగవెయ్యడం ఏమీ తప్పుకాదని వాదించారు. ఇదే సబబైనట్లయితే ఎవరు ఎవరికి బాకీ ఉండి promissory note వ్రాసినా ఆ తరువాత ఇస్తామని చెప్పి తరువాత ఇవ్వకపోతే తప్పులేదని ఉన్నట్లుంది, వారు చెప్పినటువంటి సంజాయిషీ 12½% Panchayat Boards కు ఇస్తామని చెప్పి అది ఇప్పుడివ్వం అని cancil చేయడం, promise ను break చేసినట్లు కాదని వారి అభిప్రాయంగా చెప్పారు. ఇది చాలా అసందర్భంగా ఉన్నదని నా అభిప్రాయం.

THE HON. SRI D. SANJIVAYYA :—ఎన్నో సంవత్సరాలుగా ఆ provision Act లో ఉంది. ఈ సంవత్సరాలలో పంచాయితీలకు ఏమైనా ఇచ్చారా ? ఊరికే provision పెట్టి ఆశ కల్పించడం ఎందుకని దాన్ని తీసివేశాం.

SRI G. JAGANNADHA RAJU :—గవర్నమెంటు ఏదో చెబుతారు. Agricultural Debt Relief Act ను introduce చేశారంటే సబబు ఉంది కాని గవర్నమెంటు Debt Relief Act ను introduce చెయ్యడం న్యాయం కాదని నా అభిప్రాయం. Agricultural Debt Re'ief Act బదులుగా మీరు ఒక Act తీసుకువచ్చారు. Government must pay that amount to the Panchayat Boards. అది మానేసి debt relief కోసం ఒక amendment తీసుకురావడం చాలా అసందర్భమని నా అభిప్రాయం. దీనివల్ల financial గా చాలా Municipalities effect అవుతాయి ఈ income తోనే కాలక్షేపం చేసే Municipalities ఉన్నాయి. అవన్నీ పాడయిపోతాయి. Local Boards Minister నాగేశ్వరరావుగారు చాలా అమాయకులు. ఆ advantage తీసుకుని Cabinet లోని అతిరధులు, మహారధులు, యోధానయోధులూ కలిసి plan చేసి తినుంచేశారు. ఆయన అమాయకులు కాబట్టి ప్రతి Minister అయన్నే తిన్నేస్తున్నారు.

ఈ resolution ను oppose చేయవలసిన మనిషి A. B. Nageswara Rao గారు. మేము కాదు. oppose చేయవలసింది. It is a matter of adjustment between local boards and the Government. కనుక ఆయన oppose చేయవలసినవారు వారే. Cabinet stage లోనే oppose చేయవలసింది.

3rd April 1956]

THE HON. DR. B. GOPALA REDDI .—In the larger interests of education.

SRI G. JAGANNADHA RAJU .—"You are anyhow bound to give it and you want to take advantage of it.

While you are making him suffer you are making administration go bad, and you want to take the credit that you are giving the money for the uplift of the people by way of introducing elementary education. That is bad. Anyhow you are bound to give it Please give it. Don't cancel this and that for the sake of your giving the money. That is the bait you are giving We are giving you this and therefore give up this. You ought to have opposed it in the Cabinet. But most probably you don't know the point at this stage. He is all alone in the Cabinet and this is the result of all that."

THE HON. SRI D. SANJIVAYYA .—I don't think he is all alone there. He is along with so many other members.

SRI G. JAGANNADHA RAJU .—It looks like that.

SRI A. KALESWARA RAO :—అధ్యక్షమహాశయా, నన్ను ఘాటుగా మాట్లాడవలసిందని కమ్యూనిస్టుపార్టీ ఉపనాయకులు చెబుతున్నారు. ఘాటుగానే మాట్లాడుతున్నాను. నేను దీనిని మనస్పూర్తిగా బలపరుస్తున్నాను. నేను విజయవాడ మునిసిపాలిటీకి కొంతకాలం chairman గా పనిచేసినాను. ఇప్పుడు విజయవాడ మునిసిపాలిటీకి ప్రతినిధిని. నేను మునిసిపాలిటి తరఫున చెప్పేది ఏమిటంటే విజయవాడ మునిసిపాలిటీకి 25 వేల రూపాయలు నష్టంవచ్చేమాట నిజమే. కాని కావలిసినన్ని సినిమాలు 12 సినిమాలు ఇప్పటికే ఉన్నాయి. వెళ్ళేవారి సంఖ్యచూస్తే ఎక్కడికిపోతామో తెలియకుండా ఉంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—సినిమాల బిల్లు pass అయిపోయినది. ఇంకా సినిమాల్లోనే ఉన్నారు కాళేశ్వరరావుగారు. Motor vehicles మీద మాట్లాడుతున్నాము ఇప్పుడు.

SRI A. KALESWARA RAO :—రెంటికీ కలిపే చెబుతున్నాను Tollgates మూలంగా 25 వేల రూపాయిల నష్టం వస్తుంది. సినీమాలవల్ల కొంత నష్టం వస్తుంది. ఈ నష్టం కాకుండా ఆదాయం 5 వేలు పోతుంది. మొత్తం మీద 35 వేలవరకు పోయినా ఆదాయం అనేకవిధాలుగా పెరుగుతుంది. దీని వల్ల లాభంపొందేది ఎవరు? 3 వ ఫారంవరకు ఉచితవిద్య అనేది మహత్తరమైన కార్యం. దానిని ఆంధ్రప్రభుత్వం తలపెట్టినందుకు మనమే కాకుండా తరతరాల వారు అభినందిస్తారు. ఎప్పటికో అప్పుడు high schools వరకు ఉచితవిద్య చేయాలని సదుద్దేశం మనకు ఉంది. ఎవరు లాభం పొందుతున్నారో వారు దీనిలో కొంత భాగం భరించవలసి ఉంది. ముఖ్యంగా మునిసిపాలిటీలు చాలా లాభం పొందుతాయి. 3 వ ఫారంవరకు ఉచితవిద్య అంటే అక్కడ వుంటే వారి అందరిపిల్లలు-కార్మికుల పిల్లలతోసహా-వెళ్ళి చక్కగా చదువుకుంటారు. మునిసిపాలిటీలకు major పంచాయితీలకు ఇది చాలా లాభకరమయిన విషయం. వాళ్ల ఆదాయం అనేకవేలు ఎక్కువ అవుతుంది. దీనిని గట్టిగా సమర్థిస్తున్నాను. మునిసిపాలిటీలనుంచి కొంత తీసుకోవలసిందే. ఏదో ఒకవిధంగా భర్తీచేయాలికదా! మునిసిపాలిటీలనుంచి తీసుకుంటే వద్దుఅంటారు. పల్లెటూళ్లపై వేయవద్దు అంటారు. Betterment tax అంటే, వద్దు అంటారు. ఏ పన్నును అయినా వెంకటేశ్వర్లుగారు సమర్థిస్తున్నాము అని చెబితే దానినేవేస్తాము. అన్నింటిని వద్దు అంటారు. దేనికో నష్టం వస్తుంది అనడం, నాగిరెడ్డిగారు సెలవిచ్చినట్లు ఎప్పుడూ విచారంపొందడంతప్ప సంతోషం పొందడం అనేమాట వారిదగ్గరనుంచి రావడంలేదు. మీరు విచారపడకండి సంతోషించండి. 3 వ ఫారం వరకు ఉచితవిద్య వస్తుంది. సంతోషించండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—On a point of personal explanation, Sir. అన్ని పన్నులు వ్యతిరేకిస్తున్నాము అని చెబుతున్నారు పంతులుగారు. విచారం వెలిబుచ్చినపుడు వెలిబుచ్చుతాము. Land revenue surcharge కొంత ఎక్కువచేయాలనికూడా చెప్పాము. అటువంటివి తెస్తే బలపరుస్తాము. చిన్నవాళ్లమీద దాడిచేస్తున్నారని చెబుతున్నాను.

SRI V. VESWESWA RAO :—క్రొత్త పన్నులువేయడంలేదు. ఇది వరకు వసూలుచేసే దానిలో grants గా ఇస్తున్న దానిలో cut చేస్తున్నాము [illegible]. కాంగ్రెసుపార్టీ ఉపనాయకులు చాలా ఘాటుగా మాట్లాడుతాము అని [illegible] మాట్లాడినప్పుడు Vehicles మీద Toll tax, Entertainment tax రెండింటిని కలిపారు. 25 సంవత్సరాలుగా ఇస్తూవచ్చాము.

మునిసిపాలిటీలకు 25 సంవత్సరాలనుంచి ఇబ్బందిరాలేదు. ఆంధ్రదేశంలోఉంటే మునిసిపాలిటీలకు ఇచ్చేది 10 లక్షలరూపాయలు. 6.5 లక్షలు Toll gates రూపంలో ఇస్తున్నాము. వీటిని స్వాధీనం చేసుకోవాలని ఈ బిల్లు ప్రవేశపెట్టారు మునిసిపాలిటీలకు చాలా grants ఇస్తున్నాము. అనేకరూపాల్లో ఇస్తున్నాం. మునిసిపాలిటీలకు Hospitals కు Education కు Water కు, Sanitation కు అనేకరూపాలలో ఇస్తున్నాము. వాళ్లదగ్గరనుంచి 6 లక్షల రూపాయిలు ఎందుకు తీసుకోవలసివచ్చింది? 3 వ ఫారంవరకు Free education పెడుతున్నాము అంటున్నారు. అది చాలా రోజులనుంచి కావాలంటున్నాము. దీనిని మునిసిపాలిటీల నుంచి తీసుకుని ఖర్చుపెట్టవలసిన అవసరంలేదు. ప్రభుత్వం చాలా taxes వేశారు. ప్రజలు ఇచ్చుకుంటున్నారు. అవసరమయితే Education cess పెంచి రు. 50 పైన కడుతుంటే కాళేశ్వరరావుగారివంటి వారిమీద ఇంకా పన్నులు వేయవచ్చును.

SRI A. KALESWARA RAO :—అవును. నాకు పెద్ద మార్కెటు ఉంది.

SRI V. VISWESWARA RAO :—మార్కెటుమీద కాదులెండి. అది తెలుసు. Towns లోను పల్లెప్రాంతాలలోను పెద్ద taxes కట్టేవారు కొంతమంది ఉన్నారు. 50 రూపాయిలుపైన కట్టేవారిమీద Education Cess పెంచండి. పెంచుతూ వసూలుచేయడానికి పూనుకోండి. మునిసిపాలిటీలకు ఇస్తుంటే గ్రాంటులను తీసికుందాము అని చెప్పడం న్యాయంకాదు. ఆ రోజుల్లో కాంగ్రెసు నాయకులు Toll gates పోవాలని ఉపన్యాసాలుఇచ్చారు. బ్రిడ్జికట్టినప్పుడు రోడ్డువేసినపుడు proposals వేసి వసూలుచేయడం మంచిదికాదని చెప్పేవారు. 20 సంవత్సరాలక్రితం—మునుస్వామినాయుడుగారి కాలములో అనుకుంటాను—దీనిని రద్దుచేశారు. దీనికి నష్టపరిహారం ఇవ్వడం జరిగింది. దీనికి బదులు పైపెచ్చు మంత్రిగారు free education కావాలంటే ఇది తీసుకుంటామని అడగడం సరిఅయినది కాదని, 3 వ ఫారంవరకు ఉచితవిద్య ఇవ్వడం అవసరమని అనుకుంటే మరొక రూపంలో పన్ను పెంచాలని కోరుతున్నాను. పట్టణాల్లో అనేకమంది ఇండ్లుకట్టుకుంటున్నారు. రైతులమీద ఎక్కువపన్ను వేస్తున్నారు ఈ సమస్యను by pass చేయడం అనేకసందర్భాల్లో జరిగింది. మునిసిపాలిటీలలో taxes పెంచాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. క్రొత్తగావాళ్ల Budget proposals లో పన్నులు 25% పెంచాలని చూస్తున్నారు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అదివరకే 27% వరకుఉంది. విశ్వేశ్వరరావుగారిది పొరపాటు, దానిమీద 25% అనడం సరిఅయినదికాదు.

SRI V. VISWESWARA RAO :—ఈ పరిస్థితులలో మునిసిపాలిటీలలో Taxes పెంచుతున్నారు. అందులో కొంత భాగం Free education కు అని పెంచి దానిని తీసుకోడం మంచిది. మునిసిపాలిటీలు సరిగా పనిచేయడంలేదు; మంచినీళ్లులేవు ; మరికొన్ని సౌకర్యాలు లేవు అని అనేకసందర్భాల్లో చర్చించి వాళ్ల దగ్గరనుంచి డబ్బుతీసుకుంటామనడం దానిని కాశీశ్వరరావుగారివంటి వారు బలపరచడం విచారకరంగా ఉంటుంది. ఇది సరిఅయినదికాదని దీనిని ఉపసంహరించుకోవాలని కోరుతున్నాను.

SRI G. NARASIMHA MURTY :—అధ్యక్షా, ఇప్పుడు ఈ రు. 600,000 పైచిలుకు కలిగిన మొత్తాన్ని Municipality లకు III Form వరకు కుల, మత, వర్గ, లింగ భేదములు లేకుండా సమస్త మానవులకు ఉచిత విద్యానొసంగే ఈ సదవకాశమును కల్పించినందులకు నేను చాలా సంతోషిస్తూ ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. అందువల్ల రాబోయే నష్టాన్ని భర్తీ చేయుటకు ప్రభుత్వంచేసిన ప్రయత్నాన్ని నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. అసెంబ్లీ మొదటి మీటింగులోనే నేనీవిషయమును గురించి ప్రభుత్వానికి మనవిచేసియున్నాను. అప్పట్లో నేను ఈ సౌకర్యములు S. S. L. C వరకుకూడా కలుగచేయవలెనని కోరియున్నాను. ఇప్పుడు III Form వరకైనా చేసినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తూ ఇంకో సంవత్సరంనాటికి ఈ సౌకర్యం S.S.L.C. వరకు కలగజేస్తారని ఆశిస్తూ ఈ మొత్తాన్ని Municipality లనుండి ప్రభుత్వం తీసుకొనడానికి ఆమోదించవలెనని చెబుతూ ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షుల వారికి నా కృతజ్ఞత తెలుపుతున్నాను.

SRI R. B. RAMAKRISHNA RAJU :—ఒక్క విషయం మాత్రం ప్రధాన మంత్రిగారు స్పష్టం చెయ్యాలని వారిని కోరుతున్నాను. ప్రారంభ విద్య ఉచితంగా III Form వరకు చేసినారు; అందుకు సంతోషం. ముఖ్యముగా గ్రామాల వారికి చాలా సంతోషదాయకమైన విషయం. అయితే పట్నాలలో ఉచిత విద్యకయ్యే ఖర్చంతా మునిసిపాలిటీవారె భరిస్తున్నారు. ఇప్పుడు అక్కడ ఈ విద్య ఉచితంచేసే విషయంలో వారికి ఖర్చులేకుండా అవుతుందా ? వారికి వేరే compensation ఇస్తారా? ఒక వేళ motor tax క్రింద వచ్చే నష్టంవారు తగ్గించుకు చేదానికి అస్పదం కలుగచేస్తారా ! ఆ విషయం మాత్రం మంత్రి గారు చెప్పాలి.

THE HON. DR. B. GOPALA REDDI :— ప్రతి జిల్లాలోను జిల్లా బోర్డు మునిసిపల్, ప్రైవేటు మాన్యుల్ల అయ్యే ఖర్చులో కొంత compensation

ఇవ్వవలెననే ఉద్దేశంతో, ఈనాడు income ఎంత పోగొట్టుకుంటున్నారో అంతా లెక్కలువేసినాము. Compensation క్రింద ఇవ్వడానికి సుమారు 12,15 లక్షలు అవుతుంది.

Mr. SPEAKER :—Otherwise where is the loss to the Government by all these taxations?

Sri B. SANKARAIAH :—అధ్యక్షా, ఇప్పుడు క్రొత్త పన్నులేమి వెయ్యడంలేదు. ఇప్పుడున్నట్టి స్థానిక సంస్థలకు ఇచ్చే గ్రాంటులోనించే ఈ ఉచిత విద్యకోసం తీసుకొంటున్నాము. కొత్త పన్నులు వెయ్యకూడదని ప్రతి పక్షం అంటున్నదని పదేపదే చెప్పడం న్యాయంకాదు. ఎవరికి ఎక్కువఆదాయం వస్తుందో వారిమీద ఎంత పన్నులు వేసినా మేము బలపరుస్తాము వాటిని సక్రమంగా వసూలు చెయ్యడానికి మేము సిద్ధంగా ఉన్నాము. పన్నులు వేయడానికి మేము ఎప్పుడూ వ్యతిరేకంగాలేము.

Mr. SPEAKER :—"దీనిలో పన్నులు వెయ్యడం లేదు, పన్నులు పంచుకోవడం మాత్రమే."

Sri B. SANKARAIAH :— స్థానిక సంస్థలకు నష్టం కలుగజేయడం లేదు అంటుంన్నారు. స్థానిక పరిపాలన అభివృద్ధి పొందవలెనని, స్థానిక సంస్థలకెక్కువ ఆదాయం ఉండవలెనని, అధికారములు ఎక్కువ చెయ్యాలెవని కాంగ్రెస్ పార్టి వారుకూడా తీర్మానాలు చేశారు. కానీ ఇప్పుడు అధికారానికి వచ్చిన తరువాత ఈ ఆదాయాన్ని తగ్గించడానికి, వచ్చే ఆదాయాన్ని ప్రభుత్వం తీసుకొనడానికి చూస్తూ ఉంది. ఇప్పుడూ ఏ మునిసిపాలిటీలోనైనా నీటి సరఫరా వసతిగానీ డ్రైనేజి స్కీముగానీ అమలు చేసినదని చెప్పగలరా ? ప్రభుత్వం దగ్గర అప్పులు తీసుకొని వారికి అవసరమైన కార్యక్రమాలు చేసుకుంటున్నారు. ఆంధ్రలో T.B. పెరగకుండా ఉండవలెనంటే తార్ రోడ్లు వెయ్యవలెను. తార్ రోడ్లకి రిపేరు అవసరం లేదు. కాని ఎన్ని మునిసిపాలిటీలు తార్ రోడ్లు వేస్తున్నాయి? ఈనాడు మోయకలిగిన వారిమీద పన్నులు వెయ్యవలెను! ఈ నాడు ఆంధ్రలో ఎన్ని మునిసిపాలిటీలు మంచి నీటి సదుపాయం కలుగజేస్తున్నాయి ? ఉదహారణకు ఒకటి రెండయినా ఉన్నవేమో చెప్పగలరా ? మునిసిపాలిటీల నుంచి వచ్చిన కాశీశ్వర రావుగారు ఈ మాదిరిగా చెప్పడం ఆశ్చర్యంగా ఉంది. ఈ విధంగా మునిసిపాలిటీల ఆదాయం తగ్గించవద్దు 25 సంవత్సరముల నుండి అమలు జరుగు తున్నది. ఈ ధోరణి తీసివేయడం చాలా అన్యాయం. National income

Sri B. Sankaraiah] [3rd April 1956

పెరుగుతూ ఉన్నది. ఈ రోజున జనాభా సంఖ్య పెరుగుతూ ఉన్నది. అనారోగ్యం ఎక్కువ అవుతూ ఉన్నది. 100 రూ. వస్తేగానీ 10 రూ॥ ఖర్చు చెయ్యలేకుండా ఉన్నారు.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా! మన మిత్రులు పాపం చాలా ఆందోళన ప్రకటిస్తున్నారు. ఏవేవో మునిసిపాలిటీలనుంచి ప్రభుత్వం ఏదో డబ్బు తీసుకుంటున్నదని twist చేస్తున్నారు. అది కానేకాదు. ఎప్పుడో 25 సంవత్సరాల క్రితం toll-gate పెట్టుకొనడానికి చట్టంలో అవకాశం ఉండి ఉండవచ్చును. అది రద్దుచేసినందువల్ల మునిసిపాలిటీలకు నష్టపరిహారం ప్రభుత్వము ఇచ్చింది. ప్రభుత్వం ఇంతకాలముగా దీనినిగురించి ఆలోచించలేదు. 25 సంవత్సరాలుగా ఇవ్వడం జరిగింది. ప్రభుత్వం ఈ నష్టపరిహారాన్ని ఇన్ని సంవత్సరాలుగా ఇవ్వవలసిన అవసరంలేదు. ఇప్పుడున్న Local Board Act ప్రకారము toll-gate tax కు మునిసిపాలిటీలకు అవకాశం లేనప్పుడు ఎందుకు ప్రభుత్వం ఇన్ని సంవత్సరాలుగా ఇవ్వవలెనో అర్థంకాకుండా వుంది. ఇప్పుడైనా ప్రభుత్వం వాస్తవపరిస్థితులను తెలుసుకొని ఈ నష్టపరిహారాన్ని మునిసిపాలిటీల కివ్వడం రద్దుచేస్తున్నదని హర్షించుచున్నాను. మనము డ్రెయినేజ్ స్కీములు, ప్రొటెక్టెడ్ వాటర్ సప్లయి లేదంటున్నాము. ఇది నిజమే. మన ఆంధ్రలో 36 మునిసిపాలిటీలున్నాయి. ఈ రోజున 6,85,000 ఇస్తున్నామంటే సగటున 19,000 వస్తూ ఉన్నది. ఈ 19,000 రూపాయలతో మునిసిపాలిటీలు ప్రొటెక్టెడ్, వాటర్ సప్లయిగానీ, డ్రెయినేజ్‌గానీ పెట్టగలరా? బహుశా ఈ సొమ్ము శానిటరీ ఇన్‌స్పెక్టర్ల జీతాలకు, ఊడ్పుపనివారి జీతాలకు సరిపోతుందేమో! అధ్యక్షా! ఈ రోజున కొంప మునిగేది ఏమీలేదు. 50,00,000 ఇవ్వడం మనం మానుకొంటున్నామంటే ప్రతి మునిసిపాలిటీకి 19,000 రూ॥లు తగ్గుతున్నదంటే వారు సునిశితంగా ఆలోచించవలయును.

మనకు వస్తున్నటువంటి ఆదాయం ఇంతకాలంగా వస్తున్నది. ఈవాళ ప్రభుత్వంవారు ఇస్తామన్నది ఇవ్వకపోవడంవల్ల 20 వేల రూపాయలు అదనంగా ఏవిధంగా మనం రాబట్టాలి?' అనేది ఇప్పుడైనావారు జాగ్రత్తగా ఆలోచించడానికి వూనుకుంటారని నేను అనుకొంటాను. 20 వేల రూపాయలు రాబట్టడం అంతపెద్ద [illegible]కాదు. ఈవేళ house taxation చూచినట్లయితే పేదవాండ్లమీద విశే[illegible] చేస్తున్నారుగానీ పెద్దపెద్ద భవనాలున్న వారిమీద వేయవలసినంతగా [illegible] ఇప్పుడైనావారు జాగ్రత్తగా ఆలోచించుకొని వేయవలసిన [illegible] వేయవలసిన పన్ను వేస్తే ఈ 19,000 రూపాయలేకాక ఇంకా

కనీసం మరొకపాతిక వేల రూపాయలను అదనంగా రాబట్టుకొని ఆ ఆదాయంతో వారి కార్యకలాపాలకు ఏలాంటి అంతరాయము ఏర్పడదు. మన సమావేశంలో ఈ డబ్బును మినహాయించుకొంటున్నామంటే దుబారాఖర్చులకోసం కాదు. ఎంత కాలంగానో మనం కాంక్షిస్తున్నటువంటి ఒక మహోన్నతమైనట్టి కార్యక్రమానికి ఖర్చుపెట్టబోతున్నాము. ఏ విధమైనటువంటి తరతమ భేదాలు లేకుండా, ఉన్నవారికి లేనివారికి, మొత్తంమీద III Form వరకు ఉచితవిద్యను ఇప్పించడానికి పూనుకొంటున్నామంటే చాలహర్షించదగ్గ విషయం. కాబట్టి అయినదానికి, కానిదానికి వ్యతిరేకించడం అనే ధోరణిలో కాకుండా నిర్మాణాత్మకంగా మన ప్రతిపక్ష సభ్యులు విమర్శించినట్లయితే బాగుండును.

SRI PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా, ఇన్ని సంవత్సరాలనుంచికూడా అనవసరంగా పరిహారం ఎందుకిస్తున్నారో నాకేమీ బోధపడటంలేదని ప్రగడ కోటయ్యగారు చెప్పారు. వీలుంటే అవన్నీ కూడా ఇప్పించండి అనేటటువంటి విధంగాచెప్పారు. ఆవిధంగాఇస్తే మునిసిపాలిటీలదగ్గరనుంచి ఇంకా ఎక్కువడబ్బుకూడావచ్చి ఉండేదేమో. అసలు కోటయ్యగారుకానీ మిగిలినవారుగానీ ఈనాడు మునిసిపాలిటీలనన్నీ కలుపుకొంటే, వాటన్నిటికొరకు 10లక్షలు పోతుంది, కాని ఒక్కొక్క మునిసిపాలిటీకి చూచినట్లయితే వచ్చేది 18, లేక 20 వేలకంటె ఎక్కువలేదు. అలాంటప్పుడు వారికి అంతగా పోయేదేమిటి, వారు మహోన్నతమైన ఉచితవిద్యను ప్రవేశపెట్టినప్పుడు' అని చెపుతున్నారు. III Form వరకు ఉచిత విద్యావిధానమును ప్రవేశపెట్టినప్పుడు ప్రభుత్వాన్ని తప్పకుండా అభినందిస్తాం. దాన్ని ఇంకా S. S. L. C. వరకు ప్రవేశపెట్టాలని కోరుతాం దాంట్లో కోటయ్యగారితో పూర్తిగా. ఏకీభవిస్తున్నాము కానీ ఇప్పుడు మునిసిపాలిటీల పరిస్థితులన్నీ చూచుకొన్నప్పుడు కొన్ని కొన్ని మునిసిపాలిటీలలో తమ పనివారికి కూడా జీతాలను ఇచ్చుకోలేనటువంటి పరిస్థితులుంటున్నప్పుడు అవన్నీ దృష్టిలో పెట్టుకోకుండా 10 వేలు, 15 వేలు, 20. వేలే గదా అని పోల్చేయడం మాత్రం ఏ విధంగాను సబబుగా లేదని చెపుతున్నాను. అనవసరంగా, మన హౌసులో కూడా పల్లెటూళ్ళవారిమీద పన్ను లెక్కువవేస్తున్నారని కొంతమంది, బస్తీవాళ్ళమీద వేస్తున్నారని కొంతమంది, వేయటంలేదని కొంతమంది చెప్పుకుంటుంటే విన్నాము. ఇటువంటి ఉపన్యాసాలవల్ల పల్లెటూరివారికి, బస్తీలవారికి యేదో ఒక విధమైన పోటీలను కల్పించడమవుతుంది కానీ ఎక్కడైనాసరే పన్ను భరించగల్గినవారిమీద పన్నులువేయాలి అనే సిద్ధాంతాన్ని మేము అంగీకరిస్తాము. పట్టణాలలో కొంతమంది మిల్లుయజమానులున్నారు. లక్ష, 2 లక్షలు, మూడు

Sri Pillalamarri Venkateswarlu] [3rd April 1956

లక్షలు నాలుగు లక్షలురూపాయలు తీసుకొనేటటువంటి డైరెక్టర్లుకూడా ఉన్నారు. అలాంటి వారందరిమీదా వేయండి. ఆ డబ్బంతాకూడా గోపాలరెడ్డిగారు తీసుకో గలిగితే గోపాలరెడ్డిగారిని మనస్ఫూర్తిగా అభినందించటమే కాకుండా పూర్తిగా బలపరుస్తాము. గోపాలరెడ్డిగారు మహోన్నతమైనటువంటి కార్యము తలపెట్టారు. ఈ యజ్ఞములో మన మంతరముకూడా సహాయము చేస్తామని చెప్పేవాండ్లమే కానీ మాకా అవకాశాలు కల్పిస్తారని ఆశమాత్రం కలగటంలేదు. చిన్న చిన్న మునిసిపాలిటీలున్నవి వాళ్లు ఈ చిన్న చిన్న మొత్తాలతోనే కాలాన్ని గడుపుతున్నారు. వాళ్ళేపని చేసినప్పటికీ ప్రభుత్వందగ్గరకు అప్పులకొరకు వస్తున్నారు. ఈవేళ ఒక్కొక్క మునిసిపాలిటీవద్దనుంచి 20 వేలు లాక్కుంటే ఆ లాక్కున్న 20 వేల కోసం గోపాలరెడ్డిగారివద్దకు అప్పులకొఱకు రావాలి లేకుంటే పన్నులు ఆపి వేయడం జరుగుతుంది Drainage కావాలన్నా, protected water supply కావాలన్నా, ఏ కార్యమైనా తలపెట్టాలన్నాకూడా మనం డబ్బిస్తేనే జరుపుకొనేటటువంటి సంస్థలు ఇవి. అలాంటి వాటినుండి మీరీ రోజున 19 వేలే కదా తీసుకుంటున్నామంటే ఎక్కడనుంచో ఎక్కువ ఆదాయం వస్తున్నట్లు అనుకోవడం నాకాశ్చర్యం. అక్కడ ఆదాయాన్ని తీసికొని మళ్లీ వాటికేమైనా ఈ ఉచిత విద్య అమలు జరిపేటప్పుడు వాటికి మదరా ఇవ్వాల్సిఉంటే ఇస్తామన్నట్లుగానే చెపుతున్నారు. ఈనాడు ప్రధానంగా కొన్ని విషయాలను తీసుకొన్నప్పుడు మునిసిపాలిటీలకు తమకాళ్లపై తాము నిలబడే శక్తి ఉన్నదా? ఈ రోజున ముఖ్యంగా drainage లాంటి పనులనే జరుపలేక పోతుంటే మనకు 19 వేలో 20 వేలో ఇస్తే మళ్లీ ప్రభుత్వం చెల్లించుకోవాలి గదా? ఒక చేతితో ఇచ్చి మళ్లీ ఒక చేతితో తీసుకోవడం అనేటటువంటి confused economy ఏమిటి? అని మేము ప్రశ్నిస్తున్నాము. అందువల్ల మునిసిపాలిటీలను పంచాయితీ బోర్డులను ఏ పరాయి సంస్థలక్రింద ఆలోచించకుండా ఉన్నట్లయితే అసలు మన మనలంబిస్తున్నటువంటి పద్ధతి సక్రమమైనదా? మళ్లీ వాటికేదైనా రోడ్డు కావాలన్నా మరేమికావాలన్నా మనమే డబ్బు ఇచ్చుకోవాలి. అలాంటివన్నీకూడా దృష్టిలో పెట్టుకొని ఈ పద్ధతిని విరమించాలని కోరుతున్నాను అందువల్ల ఈ రకమైన economics ఎవరికీ help చెయ్యవు. ఇది సరిఅయినటువంటి budgetting కూడా కాదు. ఒక చేతితో ఇచ్చి ఇంకొక చేతితో తీసేస్తున్నాము. ఇదేమి పద్ధతో నాకేమీ బోధపడటంలేదు. అసలు మన budget-లో ఉంటేటటువంటి, మన budget ను frame చేసేటప్పుడు వచ్చేటటువంటి defects తప్ప మరేమీ కూడా కావని మాత్రము తెలియజేస్తున్నాను. [illegible] పెరుగుతున్నదా అంటే పెరగడంలేదు, National Income

పెరుగుతున్నప్పుడు దానినిబట్టి ఆదాయాన్ని ఎక్కడెక్కడ రాబట్టాలో అక్కడ రాబట్టలేకపోతున్నారు. అలాంటప్పుడు మునిసిపాలిటీల దగ్గరనుంచో లేకపోతే చేనేత పారిశ్రామికులకు ఇచ్చే funds లో నుంచో కొంత తీయడం చేస్తే అప్పుడు కోటయ్యగారితో నేనుకూడా చాలా అసంతృప్తిని వెలిబుచ్చే వాడిని.

SRI PRAGADA KOTAIAH :—ఇప్పుడు వెనక toll gates పెట్టుకోవడానికి వారి కధికారమున్న రోజుల్లో రద్దుచేశారు. కాబట్టి నష్టపరిహారాన్ని ఇచ్చారు. ఇప్పటి చట్ట ప్రకారం అసలు toll gates ను వారు నిర్వహించడానికి అవకాశము లేదు కాబట్టి అనష్ట పరిహారాన్ని ఇవ్వవలసిన అగత్యంలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU — ఈ economy ఏవిధంగా జరుగుతున్నది, అనేది కోటయ్యగారి లాంటివారు, ఆలోచించ గల్గినటువంటి వారుకూడా, serious గా ఆలోచించకపోవటంవల్ల ఆ పార్టీలో ఉండి detective గా తయారైపోయినారు. అందువల్ల ఇవన్నీకూడా మేము ఆమోదించలేకపోతున్నాము, అసలు ఇది bad economy అని, ఇది సరిఅయినటువంటి budgeting కానే కాదని తెలియజేస్తున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA:—అధ్యక్షా, ఇప్పుడు ప్రభుత్వమీ కార్యమునెందుకు తలపెట్టిందనే విషయమందరికీ తెలిసిన విషయమే III Form వరకూ కూడా ఉచితంగా విద్యనిచ్చే నిమిత్తం దీనినేర్పాటుచేసినారు. మనం మామూలూగా వింటూనే ఉంటాము. "ఖర్చుపెట్టుడీ సద్ధర్మ కార్యములకు" అని నిన్ననే చదువుతూ ఉంటిమి ఒక పద్యము. అందువల్ల మంచి కార్యముకోసం సత్కార్యాలకోసం ఖర్చుపెట్టేటప్పుడు, దీనికెందుకు ఇంతగా విమర్శవచ్చిందో నాకేమీ అర్థంకావటంలేదు. 1931 వ సంవత్సరంలో tolls ను abolish చేసినారు. దానిమీద వచ్చేటటువంటి ఆదాయం ఈ మునిసిపాలిటీలకు వస్తూవుండినందున పురపాలక సంఘాలకు నష్టపరిహారంగా 25 సంవత్సరములు డబ్బు ఇస్తూవచ్చినాము. నిన్నగాక మొన్న ఢిల్లీలో ఒక సమావేశం జరిగింది. అది కేంద్రప్రభుత్వంలో రహదారిశాఖకోసం ఏర్పాటు చేయబడినటువంటి ఒక సలహా సంఘసమావేశం. ఆ సలహా సంఘసమావేశంలో చేసిన తీర్మానమేమిటంటే, tolls అనేవి ఎక్కడెక్కడ ఉన్నాయో వాటినన్నిటినీకూడా రద్దుచేయాలిఅని. ఇప్పుడున్న చోట్లలో కూడా "they should not become a source of income" అనేటటువంటి సిద్ధాంతాన్ని అంగీకరించాలి అని. ఆకారణముచేత దేశంలో tolls ఉన్న వివిధ ప్రాంతాలలోకూడా వాటిని రద్దుచేస్తే మునిసిపాలిటీలకు ఏవిధమైనటువంటి నష్ట

Sri D. Sanjivayya] [3rd April 1956

పరిహారముకూడా రావడములేదు. ఇటు చూచినామంటే మన రాష్ట్రములో సంవత్స రానికి, రు, 6,53,000 చొప్పున 25 సంవత్సరాలుగా మునిసిపాలిటీలు లాభం పొందుతున్నాయి ఇప్పుడు దీనిని సత్కార్యంకోసం వినియోగించే నిమిత్తమే రద్దుచేస్తున్నాము. ఇదంతాకూడా విద్యావ్యాప్తి కోసం ఖర్చుపెట్టుతున్నామంటే దీనిమీద ఎందుకింత రభసవచ్చిందో నాకేమీ అర్థంకావడంలేదు. అందువల్ల దీనిని తప్పకుండా ఆమోదిస్తారని నేను ఆశిస్తున్నాను.

Mr. SPEAKER .—The question is :

"The Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill, 1956 be taken into consideration at once.

The motion was carried.

(There are no amendments).

Clauses 2, 3 and 4 were put and carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

THE HON. SRI D. SANJIVAYYA :—Mr. Speaker, Sir, I beg to move :—

"The Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill, 1956 be passed into law."

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, కాశీశ్వరరావుగారు, "మేము ప్రతిదానికీ విచారము తెలియజేస్తున్నాము అంటున్నారు. "నేను సంతోషిస్తున్నాను. III Form వరకు ఉచిత విద్యా బోధన చేస్తాము అంటే దానికి సంతోషం తెలుపుతున్నాను. పన్నులు వేస్తాము అంటే విచారము చూపిస్తున్నాను. కాని సంతోషం మాత్రం ప్రధానంగా చూపిస్తున్నాను. ప్రతిగ్రామానికి కూడా భవనములతో నిమిత్తం లేకుండా III Form వరకు విద్యాబోధనకు పాఠశాలలు ఏర్పాటుచేయాలని, అప్పుడుగాని [illegible] చెప్పుకోవడానికి వీలులేదని నేను మనవి చేస్తున్నాను.

3rd April 1956]

MR. SPEAKER :—The question is :

The Madras Motor Vehicles Taxation (Andhra Amendment) Bill, 1956 be passed into law.

The motion was carried and the Bill was passed into law.

MR. SPEAKER :—The House will now adjourn and meet again to-morrow at 8-30 a.m.

The House then adjourned

# APPENDIX

[*Vide* ANSWER TO STARRED QUESTION No. 498 IN ASSEMBLY AT PAGE 139 SUPRA.]

## List I.

List of Major, Medium and Minor Schemes Investigated in Chittoor District.

| Serial number and district. | Taluk. | Division by which investigated. | Name of scheme. | Major, medium or minor schemes. | Brief description. | Stage and remarks. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| 1 Chittoor. | Vayalpad. | Special division, Anantapur. | Construction of a reservoir across the Bahuda river near Nimmanapalli. Cost of Rs. 38·15 lakhs. | Medium. | The proposal is to form a reservoir across the Bahuda river near Nimmanapalli to irrigate an ayacut of 3,051 acres in the village of Mustur, Nimmanapalli Agraharam, Chintaparti and Godu Bommanahalli. | The proposals with plans and estimates are under scrutiny in Chief Engineer's Office. |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 2 | Do. | Do. | Do. | Constructing a reservoir across the Bahuda river near Madhavarampalli. Cost of Rs. 19 50 lakhs. | Do. | The proposal is to form a reservoir across the Bahuda river near Madhavarampalli, hamlet of Tsakarepalli to irrigate an ayacut of 1,590 acres. | The proposals with plans and estimates received from the Executive Engineer are under scrutiny in the Superintending Engineer's Office. |
| 3 | Do. | Do. | Do. | Constructing a reservoir across the Kusastali river near Anumapalli (Gadanki). Cost of Rs. 24·00 lakhs. | Do. | The proposal is to form a reservoir across the Kusastali river near Anumapalli (Gadanki) to irrigate an ayacut of 1,600 acres and also to feed Alattur and Tunganitta tanks. | The proposals with plans and estimates received from the Executive Engineer have been finalised in Superintending Engineer's Office and they are under submission to the Chief Engineer (Irrigation), by the Superintending Engineer, Anantapur. |
| 4 | Do. | Do. | Do. | Reservoir across Pedda Erunear Kottala. Cost of | Do. | The proposals are to form a reservoir about 3-1/2 miles | The proposals with plans and estimates received |

| Serial number and district. | Taluk. | Division by which investigated. | Name of Scheme. | Major, medium or minor schemes. | Brief description. | Stage and Remarks, |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| | | | Rs. 27·84 lakhs. | | from Kottala village to irrigate an ayacut of 2,000 acres in the villages of Zunzurupenta, Kotala, Banderu and Diguvapalli and to feed Kottala Pedda Cheruvu and Banrevucheru. | from the Executive Engineer are under scrutiny in Superintending Engineer's Office. |
| 5 Do. | Puttur. | Do. | Construction of an anicut across the Nagari river near Satravada. Cost of Rs. 12·44 lakhs. | Do. | The proposal is to construct an anicut across the Nagari river near Satravada village to irrigate an ayacut of 930 acres and to feed 15 tanks. | The proposals with plans and estimates were submitted to Chief Engineer (Irrigation), by the Superintending Engineer, Anantapur. |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 6 | Do. | Chandragiri. | Special division Chittoor. | Formation of a reservoir across the Bheemanadi near Mulapalli. Cost of Rs. 3·43 lakhs. | Do. | The proposal is to form a reservoir across the Bheemanadi near Mulapalli to irrigate an ayacut of 240 acres of 1st crop and 240 acres of 2nd crop in Kondareddi Khandriga, Bhimavaram, Chimaramapuram and Pullaiahgaripalli villages. | The proposals with plans and estimates were submitted to Chief Engineer (Irrigation), by the Superintending Engineer, Anantapur. The Chief Engineer is awaiting Collector's views on the scheme. |
| 7 | Do. | Tiruttani. | Do. | Formation of a reservoir across the Aniar river by combining Nesanur and Paidepalli tanks. Cost of Rs. 7 25 lakhs. | Do. | The proposal is to form a reservoir by combining Nesanur and Paidepalli tanks by a connecting dam and to feed a chain of tanks down to benefit an ayacut of 620 acres. | The proposals with plans and estimates have been submitted to Chief Engineer (Irrigation), by Superintending Engineer, Anantapur. |
| 8 | Do. | Puttur. | Do. | Construction of an anicut across the Aniar river near Savatur (alias Venkateswara project). Cost of Rs. 4·50 lakhs. | Do. | The proposal is to construct an anicut across the Aniar river near Savatur to benefit an ayacut of 960 acres. | A preliminary report on this scheme was submitted to Government. The Special Chief Engineer (Irrigation) |

| Serial number and district. | Taluk. | Division by which investigated. | Name of Scheme. | Major, medium or minor schemes. | Brief description. | Stage and remarks. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| | | | | | | has been asked to submit his final report before 1st July 1956. |
| 9 Do. | Do. | Do. | Construction of an aniout across the Araniar river at Govindappanaidu Kandriga (alias Aragam Kandriga Scheme or Nallegundla Madugu Scheme). Cost of Rs. 10·00 lakhs. | Medium | The proposal is to construct an aniout across the Araniar river near Govindappa Naidu Kandriga or Nallagundlamadugu. | A preliminary report on this scheme was submitted to the Chief Engineer (Irrigation) by Superintending Engineer, Anantapur. |
| 10 Do. | Do. | Do. | Bugga Aniout Scheme. Cost of Rs. 1·53 lakhs. | Do. | The proposal is to construct an aniout across the Kusastali | Proposals with plans and estimates have been |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | river near Bugga Agraharam to feed a chain of tanks. The additional ayacut to be benefited by the scheme is 520 acres. | submitted to Chief Engineer (Irrigation) by the Superintending Engineer, Anantapur. |
| 11 | Do. | Tiruttani. | Do. | Construction of an aniout across Kusa river near Perumanellore. Cost of Rs. 5·00 lakhs. | Do. | The proposal is to construct an anicut across the Kusa river, a tributary to Kusastali river near Permanellore to feed Permanellore tank, Bonala cheruvu, Kilapudi tank and Pandravedu tank and the additional ayacut to be brought under plough is 430 acres. | The proposals have been received from the Executive Engineer and they are under finalisation in Superintending Engineer's Office (awaiting some field particulars asked to be furnished by the Sub-divisional Officer, Nagari). |
| 12 | Do. | Chandragiri. | Do. | Kalyani reservoir Scheme. Cost of Rs. 17 5 lakhs. | Do. | The proposal is to form a reservoir across the Kalyani river to irrigate an ayacut of 200 acres under first crop and | The proposals with plans and estimates have been submitted to Chief Engineer, Irrigation, by the |

| Serial number and district. | Taluk. | Division by which investigated. | Name of Scheme. | Major, medium or minor schemes. | Brief description. | Stage and remarks. |
| --- | --- | --- | --- | --- | --- | --- |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| | | | | | 800 acres under second crop besides bridging a gap of 200 acres between the registered wet and actual cultivation under the 16 spring channels lower down and assuring supplies to the remaining existing ayacut of 1,188 acres. | Superintending Engineer, Anantapur. |
| 13 Chittoor | Chittoor. | Special Division, Chittoor. | Reservoir across Kutalavanka near Pathapalem. Cost of Rs. 4·10 lakhs. | Minor. | The proposal is to construct a dam across the Kutalavanka near Pathapalem to irrigate | Proposals with plans and estimates were submitted to the Chief Engineer |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | an ayacut of 276 acres. | (Irrigation) by the Superintending Engineer, Anantapur. |
| 14 | Do. | Palamaner. | Do. | Restoration of Girivasiah veddu across the Palar river. | Do. | The proposal is to restore the old breached out flanked anicut across the Palar river to restore the registered ayacut. | Proposals are under submission to Chief Engineer (Irrigation) by the Superintending Engineer, Anantapur. |
| 15 | Do. | Puttur | Do. | Kuchivaripalli anicut Scheme. Cost of Rs. 0·30 lakhs. | Do. | The proposal is to restore the breached and out flanked anicut across Nagari river near Kuchivaripalli and to remodel the supply channel taking off from the above anicut which feeds Pallipet tank. | Proposals are under submission to Chief Engineer (Irrigation) by the Superintending Engineer, Anantapur. |
| 16 | Do. | Chittoor | Do. | Formation of a new tank across Maddipalli vanka | Do. | The proposal is to form new tank across Maddapalli | Do. |

| Serial number and district. | Taluk. | Division by which investigated. | Name of Scheme. | Major, medium or minor schemes. | Brief description. | Stage and Remarks. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| | | | alias Kuntlamadugu near Chukuvaripalli village, hamlet of Gundlapalli. Cost of Rs. 3·64 lakhs. | | vanka alias Kuntlamadugu near Chittoor Vanipalli, hamlet of Gundlapalli to irrigate an ayacut of 300 acres of dry lands in the villages of Chukuvaripalli, Gubalavandlapalli, Diguvagubalavandlapalli and Surugusettinganisapalli, etc | |
| 17 Do. | Puttur. | Do. | Formation of a new tank at Taduku near Venugopalapuram Agraharam. Cost of Rs. 0·80 lakhs. | Minor. | The proposal is to form a new tank at Taduku village near Venugopalapuram Agraharam to irrigate an ayacut of 106 acres. | Proposals with plans and Estimates received from the Executive Engineer have been returned with |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | | | remarks and they are under revision with the Executive Engineer. |
| 18 | Do. | Tiruttani. | Do. | Excavating left side channel from Punimangadu anicut across Kushastali near Punimangadu village. Cost of Rs. 1·07 lakhs. | Do. | The proposal is to excavate a main channel on the left side of the Punimangadu anicut and to excavate branch channels from main channel to feed Kothur Venkatapuram tank, Chivvada tank. The lands to be benefitted under this scheme are 602 acres of existing wet ayacut which will set improved supply and 175 acres of new ayacut. | Proposals with plans and estimates were submitted to Chief Engineer, Irrigation by the Superintending Engineer, Anantapur. |
| 19 | Do. | Puttur. | Do. | Construction of an anicut across the | Do. | The proposal is to construct an anicut | Preliminary report was submitted to |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 10 | Do. | [illegible] | [illegible] | Araniar river near Thorur. Cost of Rs. 4·5 lakhs. | | across the Araniar near Thorur to irrigate an ayacut of 268 acres. | the Chief Engineer (Irrigation) by the Superintending Engineer, Anantapur. |
| 10 | Do. | Do. | Do. | Restoration of Ootacheruvu of Rachapalem. Cost of Rs. 0·49 lakhs. | Do. | The proposal is to restore the abandoned tank having no existing ayacut under it. After restoration it will bring 71 acres of land under plough. | Proposals with plans and estimates were submitted to the Chief Engineer (Irrigation) by the Superintending Engineer, Anantapur. |

## List II.

### List of Schemes under Investigation in Chittoor District.

| Item number and taluk. (1) | Name of scheme. (2) | Brief history. (3) | Remarks. (4) |
|---|---|---|---|
| 1 Puttur ... | Construction of a dam across the Nagari near R. K. B. V. Pet. | The proposal is to construct a dam across the Nagari near R K.B.V. Pet. | Minor. |
| 2 Do. ... | Scheme for 3 small tanks and an anicut in Nagari Firka. | The proposal is to form 3 tanks and to feed them by waters from the Nagari river by constructing an anicut across it in Nagari firka to irrigate an ayacut of 500 acres. | Do. |
| 3 Do. ... | New tank near Timmarajapuram. | The proposal is to form a new tank near Timmarajapuram. | Do. |
| 4 Do. ... | Excavation of a supply channel from Bahuda river to Jyotireddi cheruvu of Timmapuram village. | The proposal is to excavate a supply channel from Bahuda river to feed Jyotireddicheruvu of Timmapuram. | Do, |
| 5 Punganur ... | Construction of anicuts across Gargeya (Pincha) river at | The proposal is to construct 3 anicuts across the Gargeya | Do. |

| Item number and taluk. | Name of scheme. | Brief history. | Remarks. |
| --- | --- | --- | --- |
| (1) | (2) | (3) | (4 |
| | Nanjampet, Nadigadda and Tsadam. | (Pinoha) river near Najampet, Nadigadda and Tsadam to irrigate an ayacut of 600 acres. | |
| 6 Madanapalli ... | Construction of an anicut across the Kallarivanka and excavating a channel to supply Peddakolathur tank. | The proposal is to construct an anicut across the Kallari vanka and to excavate a supply channel to feed Peddakolathur tank to irrigate an ayacut of 2,000 acres. | Do. |
| 7 Palmaner ... | Construction of an anicut across the Knowndinya river near Palmaner. | The proposal is to construct an anicut across the Kowndinya river near Palmaner. | Do. |
| 8 Chittoor ... | Construction of an anicut across the Chittoor river to feed Janakaripalli tank and Pottannapeta Kalva. | The proposal is to construct an anicut across the Chittoor river to feed Janakaripalli tank and Pottannapeta Kalva to irrigate an ayacut of 165 acres. | Do. |
| 9 Chittoor and Tiruttāni. | Construction of a dam across the Ponnai river, near Gangadhara, Nellore and | The proposal is to construct a dam across the Ponnai river near Gangadhara, Nellore and | Do. |

| | | | | |
|---|---|---|---|---|
| | | digging a supply channel via Amudalaputtur. | digging a channel via Amudalaputtur. | |
| 10 | Vayalapad ... | Forming a small reservoir on Tittilivanka at Chintavaripalli. | The proposal is to form a reservoir across Tittilivanka Chintavaripalli at the confluence with Bahuda river. | Do. |
| 11 | Puttur ... | Formation of a new tank across Lingakona Kalva near Aranyam Khandriga. | The proposal is to form a new tank across the Lingakonakalva near Aranyam Khandriga to irrigate an ayacut of 288 acres. | Minor schemes. |